## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





# భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name
A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year
1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject
Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language
Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సంపూర్ణ నీతిచంద్రిక

[ ప్రథమ భాగము ]

మిత్రలాభము - మిత్రభేదము

1

విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కొ
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విషయసూచిక



# సంపూర్ణ నీతిచంద్రిక

## ఉపోద్ఘాతము

భారత భూమియందుఁ బ్రవహించుచుండు పవిత్రనదులలో గంగానది మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది. ఆనది యొడ్డున సంపదలతో నిండిన పాటలీపుత్ర మను నగరము గలదు. సమస్తమయిన ప్రభుగుణములు గలిగిన సుదర్శనుఁ డను రా జానగరముఁ బరిపాలించుచుండెను.

ఒకనాఁ డొక బ్రాహ్మణుఁడు పఠించుచున్న రెండు శ్లోకము లారాజు వినుట సంభవించెను. ఆ శ్లోకములభావ మిది:

"మానవులకు సందేహము లన్నియుఁ బోఁగొట్టి, సామాన్యదృష్టి కందని విషయములను గోచరింపఁజేయు నయనము శాస్త్రము. అది లేనివాఁడు కను లుండియు గ్రుడ్డి వాఁడే. యౌవనము, ధనసంపద, ప్రభుత్వము, నవివేకము నను నాల్గింటిలో నే యొక్కటియైన ననర్థము గలిగింపఁ జాలును. ఈ నాలుగు విషయములు నొక్కచోటఁ గూడి యున్నచో వేఱుగాఁ జెప్పనవసరములేదు."

సుదర్శనుని కుమారులు శాస్త్రము లభ్యసింపక యెల్లపుడుఁ జెడుదారుల సంచరించుచు నాటపాటలం దాసక్తులై

యుండిరి. బ్రాహ్మణుఁడు చదివిన శ్లోకములు విని రాజు తన కొమరులను గుఱించి యిట్లు తలపోసెను.

"విద్వాంసుఁడుకాని పుత్త్రుఁడు జనించినఁ బ్రయోజన మేమియులేదు. కంటిబాధయేకాని గ్రుడ్డికంటివలన నుపయోగ మేమి యుండును? గుణవంతులలో లెక్కకురాని సుతునిఁ గన్న తల్లియుఁ బుత్రవతియే యనిపించుకొన్న యెడల నింక గొడ్రాలన నెవరు? దానమున, దపమునఁ, విద్యయందు, నర్థలాభమునఁ బ్రశస్తినొందని సుతుఁడు గలుగుట కేవలము తల్లుల కడుపుఁజేటుకాదా?

వేలకొలఁదిగా నుండు తారలకంటెఁ జందమామ యొక్కఁడే చీకటి సంపూర్ణముగా హరింపఁ గలుగును. అటులే గుణహీనులగు పలువురు సుతులకంటె గుణవంతుఁడగు కుమారుఁ డొక్కఁడే కులమునకుఁ గీర్తి తేఁగలుగును. ధార్మికుఁడు, గుణవంతుఁడు, చెప్పినమాట వినువాఁడు నగు పుత్త్రుఁడు మహాతప మొనరించిన వారికేకాని లభించుట కష్టము. ధనలాభము, ఆరోగ్యము, ప్రియురాలగు భార్య, చెప్పుచేతలలో నుండు సుతుఁడు, నర్థసంపాదనమునకుఁ బనికివచ్చు విద్యయు లోకమున దుర్లభములు. పండితుఁడు గాని పుత్త్రునిఁ బుత్త్రుఁ డనుటకంటెఁ శత్రుఁ డనుట యుక్తము. ఎట్టి వంశమున జనించినను విద్వాంసుఁడైనయెడలఁ బూజితుఁ డగును. ఉన్నతవంశమున జనన మొందినను బండితుఁడుకానివానికి గౌరవము కలుగనేరదు. సద్వంశజనితమైనను గుణరహితమగు

ధనువునకు విలువ యుండదు గదా! ఆహారము, నిద్ర మున్నగులక్షణములు మానవులకు నితరజంతువులకు సమాన ములే. ధర్మాధర్మముల వివేకమే మానవునియందలి విశేషము. ఆ వివేకమునకు విద్యయే మూలము. విద్యలేని మానవుఁడు వింతపశు వనఁబడును" అని కొంతసేపు దుఃఖించెను.

మరల "సర్వవిధముల యత్నించి సుతులను సుగుణ వంతులుఁగాఁ జేయఁదగును. వట్టికోరికలతో నూరకుండక తగువిధమునఁ బ్రయత్నించిన దేవుఁడును సాయపడకపోఁడు. కుమారులకు విద్యాభ్యాసము చేయింపకున్న దోసము తలి దండ్రులది. ఒంటిచక్రమువలన రథమునకు నడక గలుగని యట్లు పురుషయత్నము, దైవసాహాయ్యముఁ గూడిరానిచోఁ గార్యములు సిద్ధింపవు. కావునఁ దగిన ప్రయత్న మొనరించె దను" అని దీర్ఘముగా నాలోచించి మఱునాఁడు పండితు లందఱను రావించి సభగావించి వారితో నిట్లు పలికెను.

"విద్వాంసులారా! విద్యావిహీనులై యెల్లవేళలఁ జెడుదారులఁ దిరుగుచున్న నాసుతులకు నీతిశాస్త్ర ముపదే శించి గుణవంతులను జేయఁజాలు పండితు లెవ్వరైనఁ గలరా?"

ఇట్లు ప్రశ్నింపఁగా మహాపండితుఁ డగు విష్ణుశర్మ యను భూసురుఁడు "రాజా! ఉత్తమకులమున జనించిన నీసుతులను విద్వాంసులుగాఁ జేయుట యెంతపని? నీకులమున నపండితు లెట్లు పుట్టుదురు?

ఎంతయత్నించినను బకమును మధురముగాఁ బలికింప లేముగాని, చిలుకను బలికించు టేమికష్టము? నీకుమారుల నాఱుమాసములలో నీతిశాస్త్రజ్ఞుల నొనరించి యొప్పగింపఁ గలను” అని బదులు పలికెను.

అందులకు రా జెంతయు సంతసించి యిట్లనెను “ గాజు బంగారముతోడి సంబంధమున మరకతమణికాంతి నొందును. అట్లే సజ్జనస్నేహము నొందిన మూర్ఖుఁడును నేర్పు సంపాదింపఁ గలఁడు గదా! కీటకము కుసుమ సంపర్కమున సుజనుల శిర మెక్కును. సత్పురుషులు ప్రతిష్ఠించుటవలనఁ బాషాణమే దైవత్వము నొందును. నదీగతములగు జలములు సుఖముగాఁ ద్రాగుటకు యోగ్యములు. సముద్రగతములగు నా సలిలములే త్రావుట కయోగ్యము లగును. ఆడువారి కనులయం దుంచఁబడిన నల్లని కాటుకయు నందము నొందు నట్లు దుర్జనుఁడును మంచివారి యాశ్రయమువలన రాణించును. మిముఁ బోలు పండితులకడఁ జేరి నాసుతులు నీతివిదు లగుట వింతకాదు. కావున వారలకు విద్యయొసఁగు భారము మీయదియే.” యని పలికి బహుమాన పూర్వకముగా విష్ణుశర్మకు సుదర్శనుఁడు తనకుమారుల నొప్పగించెను.

పిమ్మట విష్ణుశర్మ యారాజకుమారుల నొక సుందర మైన భవనమునకుఁ గొనిపోయి సుఖముగా గూరుచుండఁజేసి వారితో నిట్లు పలికెను.

"సుజనులు కావ్యశాస్త్రవినోదమునఁ గాలము గడుపు దురు. మూర్ఖులు నిద్రావ్యసనకలహములతోఁ గడుపుదురు. కావున మీకు వినోదముకొఱకు విచిత్రమయిన చక్కని నీతి శాస్త్రకథలు చెప్పెదను. అందు మిత్రలాభము, మిత్ర భేదము, విగ్రహము, సంధి యను నాలుగు భాగములు గలవు. వానిలో ముందు మిత్రలాభముఁ దెలుపుదును. ఆ భాగమునఁ గాక కూర్మాదులు స్నేహమువలన నెంతయో లాభ మొంది నవి. వాని కథ కడుంగడు విచిత్రము. వినుఁడు."

## కథా ప్రా రం భ ము

## మి త్ర లా భ ము

### చిత్రగ్రీవుఁ డను కపోతరాజు వృత్తాంతము

పూర్వము గోదావరీతీరమున నొక గొప్ప బూరుగు చెట్టు గలదు. అన్ని దెసలనుండియు వచ్చి పక్షులు రాత్రి యా చెట్టుపై నివసించుచుండెడివి. ఒకనాఁటి వేకువవేళ లఘుపతనక మను కాకము మేలుకాంచి యమునివలె భయం కరుఁడై యున్న కిరాతు నొకనిఁ జూచి "లేవఁగానే యనిష్ట దర్శన మైనది. నేఁ డేమి కీడు మూడునో కదా!" యని కలఁత నొందెను. అంతలో బోయవాఁ డావృక్షముచెంత నూకలు చల్లి, వలపన్ని దాఁగి యుండెను.

అనంతర మాకాశమునఁ బరివారముతో సంచరించు చున్న చిత్రగ్రీవుఁ డనెడి పావురములరాజు నేలమీఁద నున్న నూకలు జూచి భ్రమపడుచున్న తన తోడి పావురములతో నిట్లనెను. "నిర్జనమగు నీవనమున నూక లెట్లు వచ్చినవి ? మన మీ నూకల కాసపడినచోఁ బూర్వము కంకణమునకై యాసించి పులిచేతఁ జిక్కి మరణించిన బాటసారివలె నపాయము నొందవచ్చును. మీ కాకథ చెప్పెదను వినుఁడు.

## కంకణమున కాసించి పులిచేఁ జంపఁబడిన బాటసారి కథ

పూర్వ మొకపుడు దక్షిణదేశపు టడవిలోఁ దిరుగుచుఁ జూచితిని. ఒక ముసలిపులి స్నానముచేసి దర్భలు చేతఁబట్టు కొని యొకచెఱువుగట్టున నుండి "ఓయి బాటసారీ! ఇదిగో బంగరు కంకణము. దీనినిఁ దీసికొనుము" అని పలుకుచుండెను.

పేరాసకు లొంగిన యొక బాటసారి "నిస్సందేహముగా నిది నాయదృష్టము. అనుమానములు పెట్టుకొని కూరుచున్నచో ధనార్జనమే కష్టము. అయినను త్వరపడరాదు. పరిశీలించెదను గాక" యని తలఁచి "కంకణ మేది? చూపుము" అని యాపులి నడిగెను.

"ఇదిగో బంగరు కంకణము. చూడుము." అని పులి చేయి చాచి చూపెను.

"నీవు క్రూరజంతువవు. నిన్నెలాగున నమ్మవచ్చును?" అని యాబాటసారి ప్రశ్నించెను.

దాని కా పులి యిట్లు బదులు పలికెను “నీ వన్నట్లు యౌవనమున నే నతిదుర్మార్గుఁడనై యుంటిని. అనేకములగు గోవులను, మనుజులను జంపితిని. ఆపాపముచేతనే యాలుబిడ్డలను గోలుపోయి వంశహీనుఁడనై యుంటిని. పిమ్మట నొక పుణ్యాత్ముఁడు “గోవులను, మనుజులను చంపుట మానివైచి దానధర్మములు చేయుము” అని నాకు బోధించెను. నాఁటి నుండియు స్నానదానాదులు చేయుచుంటిని.

గోళ్లు, దంతములులేని ముదుసలిని. నే నెవరికేమి యపకారము చేయఁగలను? ధర్మమార్గమునకు లోభము లేకుండుట మొదటి సోపానము. చేతఁ జిక్కిన కంకణమును దాన మిచ్చుచున్న నాకు లోభము లేదనుసంగతి తెల్లమే కదా!

అయినప్పటికిఁ బులులు మనుజులఁ జంపునని లోకప్రసిద్ధి. దాని నెవరు వారింపఁగలరు? గ్రుడ్డినమ్మకమే కాని ధర్మమును గనిపెట్టుట లోకమున నఱుదు. మరుస్థలమునఁ గురియు వానవలెను, నాకలిగొన్నవాని కిడు భోజనమువలెను, పేదలకొసఁగు దానము ప్రశస్తము. నీవు దరిద్రుఁడవనియు, సర్వవిధములఁ బాత్రుఁడవనియు దీనిని నీకీయఁ దలఁచితిని. రోగముగలవాని కౌషధ మీయవలయునుగాని యారోగ్యవంతున కిచ్చిన నేమి యుపయోగము? కావున నీ చెఱువులో స్నానముచేసి వచ్చి దీనిని గ్రహింపుము. సంశయింపకుము.”

ఇట్లు పలికిన పులిమాటలకు లోఁబడి యాబాటసారి స్నానమునకై చెఱువున దిగఁబోయి పెనుఱొంపిలో దిగఁబడి

కదలఁజాలఁ డయ్యెను. అవు డాపులి "అయ్యో! బురదలోఁ బడిపోయితివి. నిన్ను లేవఁదీయుదు" నని నెమ్మదిగా సమీప మున కేగి యాతనిఁ బట్టుకొనియెను.

అట్లు పట్టువడి, "క్రూరజంతువును నమ్మి గొప్ప తప్పిద మొనరించితిని. నదులయందును, శస్త్రప్రాణులయందును, గోళ్లు కలిగిన జంతువులందును, కొమ్ములు కలిగిన జంతువు లందును, స్త్రీలయందును, రాజకులములందును విశ్వాస ముంచ రాదని పెద్దలు వచింతురు. గతించిన దానికి విచారించినఁ బ్రయోజనమేమి? విధిఁ దప్పించుకొన నెవ్వరికిఁ దరమగును? చంద్రుఁ డున్నతమైన గగనమార్గమునఁ జరించును; కల్మష మును హరించును. అనేకకిరణములను ధరించుచు జ్యోతిర్మధ్య మున సంచరించును. అంతటి ఘనుఁ డైనను రాహుకేతు వులచే మ్రింగఁబడుట తప్పలేదుగదా!" అని విచారించుచుఁ బులిచేఁ జంపఁబడెను.

బాగుగా జీర్ణమయిన యన్నమును, చక్కఁగాఁ జదివిన కుమారుఁడును, సుశిక్షితురాలైన స్త్రీయును, బాగుగా సేవింపఁ బడిన ప్రభువును, ఆలోచించి యాడిన మాటయు, నిదానించి యొనరించిన కృత్యమును నెన్నఁడు హాని కలిగింపవు. కాఁబట్టి బాగుగా నాలోచింపనిదే యేపనియుఁ జేయరాదు.

చిత్రగ్రీవుఁడు పలికిన యీమాటలు విని యొకపావు రము నవ్వి గర్వముతో నిట్లనెను. "ఎల్లపుడు నిట్టి యుప యోగములేని శంకలు పెట్టుకొన్నచో నాహారము సంపా

దించుకొని జీవించుటయే కష్టమగును. అసూయగలవాఁడు, నిందగలవాఁడు, సంతోషము లేనివాఁడు, కోపస్వభావుఁడు, పరులపోషణపై నాధారపడువాఁడు, నెల్లపుడు సందేహ ముతోఁ గూడియుండువాఁడు నను నీ యాఱుగురు దుఃఖభాగు లని పెద్దల వచనము" ఈ మాటలు విని పావురములన్నియు నచట త్రాలి బోయవాఁడు పన్నిన వలలోఁ దగులుకొనెను.

"లోభము కడు దుష్టగుణము కదా! అన్నివిషయ ములుఁ దెలిసియుండియుఁ, బరుల సంశయములు దీర్ప నేర్పరు లయ్యు లోభమునకు లొంగి మిగులఁ గష్టపడుదురు. లోభమె సమస్తదోషములకు మూలము. బంగరులేడి జనించుట యసం భవమయినను శ్రీరామునంతటివాఁడు లోభపడి హానిఁ జెందెను. ఆపద రానైయున్నకాలమున నెంతటివారి బుద్ధియు మలిన మగును."

వలలోఁ జిక్కిన పావురము లన్నియు సంశయము పనికి రాదని తమ కాలోచనము చెప్పిన పావురమును నిందింపఁ దొడఁగినవి.

"గుంపునకు ముందు మార్గదర్శకుఁడుగా నుండరాదు. కార్యము సఫల మయినయెడల ఫలిత మందఱకు సమానమే. కార్యము చెడిపోయినచో నిందమాత్రము మార్గదర్శకునకు వచ్చును."

పావురములు నిందించుట చూచి చిత్రగ్రీవుఁడు వానితో నిట్లనెను. "ఆపద రానైయున్నపుడు మేలు కూడఁ గీడుగా

మారుచుండును. ఇది కేవల మీతని తప్పుగాదు. ఆపద కలిగినపుడు తప్పించుకొను నుపాయ మాలోచింపవలయునే కాని యొకరినొకరు నిందించుకొనుట కాపురుషుల లక్షణము. ఆపదనుండి తప్పింపఁగల సమర్థుఁడే బంధు వనఁదగును గాని వృథా నిందాపరుఁడు బంధువు కాఁజాలఁడు.

ఆపదయందు ధైర్యము, నభివృద్ధి గలిగినపు డోర్పు, సభలయందు మాటనేర్పు, యుద్ధములయందు శౌర్యము, కీర్తియం దభిరుచియు, శాస్త్రశ్రవణమునందు వ్యసనము నను నీ గుణములు మహాత్ములకు స్వాభావసిద్ధములు. కాఁబట్టి ధైర్య మవలంబించి ప్రతిక్రియ యాలోచింపఁదగును.

మన మందఱము నేకీభవించి వలయెత్తుకొని యెగిరి పోవుదము. 'అల్పులమగు మన కీపని యెట్లు శక్య మగు' నని తలఁపకుఁడు. అల్పములగు గడ్డిపరకలు పెనవైచుకొని మదించిన యేనుఁగును సహితము బంధింపఁ గలుగుచున్నవి. అల్పమైన యూక తొలఁగింపఁబడిన సారవంతమగు బియ్యపుగింజ మొలకెత్తఁజాలదు. మన మందఱముఁ గలిసినచో నీపని కష్టము గాదు." అని తమ ఱేఁడు పలికిన మాటలు విని యా కపోతములన్నియు వల యెగఁ దన్నుకొని యాకసమున కెగిరిపోయెను.

అనంతర మాబోయవాఁ డది చూచి "యీపక్షులు గుమిగూడి వలఁ దన్నుకొని పోవుచుండెను. నేలపైఁ వ్రాలఁ గానే పట్టుకొందునుగాక" యని తలఁచి వెంటఁ బోవుచుండెను.

అవి కనుచూపుమేర దాఁటిపోఁగా నాతఁడు నిరాశుఁడై మరలి తనతావునకుఁ బోయెను.

ఆతఁ డట్లు మరలిపోవుట చూచి "మన కిపుడు కర్తవ్యమేమి?" యని యాపక్షు లడుగఁగాఁ జిత్రగ్రీవుఁ డిటు లనియెను.

"లోకమునఁ దల్లియుఁ, దండ్రియు, మిత్రుఁడు నను నీ ముఁవ్వురే నిజమైన హితులు. కడమవా రందఱుఁ దమ మేలు కోరిమాత్రమే హితు లగుచున్నారు. నాకు మూషిక రాజగు హిరణ్యకుఁ డను నొక మిత్రుఁడు గలఁడు. గండకీ నదీ తీరమునఁ జిత్రవనమం దాతఁడు నివసించుచుండును. ఆతఁ డీ వల నొఱికి మనలను విడిపింపఁగలఁడు" అని చెప్పఁగనే పావురములన్నియుఁ బోయి హిరణ్యకుఁడు వాసము చేయు చున్న కలుఁగుదరిని వ్రాలెను.

## హిరణ్యకుఁడు పావురములకు మేలుసేయుట

హిరణ్యకుఁడు పావురములు వ్రాలిన సవ్వడి గుర్తించి భయముచేఁ దన కలుఁగులోఁ గదలక మెదలక యుండెను. అపుడు చిత్రగ్రీవుఁడు "చెలికాఁడా! మాతో మాటాడవేల?" యని యెలుఁగెత్తి పిలిచెను. ఆమాట చిత్రగ్రీవునిదని గుర్తించి వెంటనే హిరణ్యకుఁడు కలుఁగు వెలుపలికి వచ్చెను. చిత్రగ్రీవునిఁ జూచి "మిత్రునితో సంభాషణము, సహనివాసము, కలుగుట కన్న పుణ్యము మఱిలేదు. పుణ్యవశమున నాచెలికాఁడువచ్చి

నా కానందముఁ గలిగించినాఁడు." అని పలికి వలలోఁ దగులుకొన్న పావురములను జూచి కొంచెము భయపడి 'మిత్రుఁడా! ఇదియేమి' యని యడిగెను.

దానికిఁ జిత్రగ్రీవుఁడు "మిత్రుఁడా! యిది మా పూర్వ జన్మకర్మమునకు ఫలము. రోగము, పరితాపము, బంధనము, వ్యసనము నను నవి ప్రాణుల కాత్మాపరాధవృక్షఫలములు గదా!" యని బదులు పలికెను.

వెంటనే హిరణ్యకుఁడు చిత్రగ్రీవుని బంధములు గొఱుకుటకై సిద్ధపడెను. చిత్రగ్రీవుఁడు "మిత్రమా! ఇది సరికాదు. ముందు నాయాశ్రితుల బంధములు తెగఁ గొఱుకుము. తరువాత నావియుఁ గొఱుకవచ్చును" అనెను.

ఇది విని యా మూషికరాజు "నాదంతములు కడు సున్నితములు. శక్తియుఁ దక్కువగా నున్నది. కావున ముందుగా నీ బంధములు ఛేదించి తరువాత శక్తియున్నచో వారి బంధముల సంగతి చూచెద" ననెను.

ఆ పలుకులకుఁ జిత్రగ్రీవుఁడు "సరే; శక్తికి మించి యేమి చేయఁగలవు? ముందు వీరి బంధములు శక్తియున్నంత వఱకుఁ ద్రుంపుము. పిమ్మటనే నాపని చూడవచ్చును" అన, మూషికరాజు "తన్ను వీడి యితరులఁ గాపాడఁ దలచుట నీతి గాదు. 'ఆపదవేళ నుపయోగపడుటకై ధనమును రక్షించు కొనవలయును. ధనమును వీడియైనను దారను గాపాడుకొన వలయును. ధనమును, దారను వీడియైనను తన్నుఁ దా

నేమఱక కాపాడుకొనవలయును ' అని నీతివిదులు పలుకుదురు. ప్రాణములు ధర్మార్థకామమోక్షముల సుస్థితికి మూలములు. అవి పోయినచో సర్వముఁ బోయినట్లే. " అని చెప్పెను.

ఆపలుకులు విని చిత్రగ్రీవుఁడు మరల నిట్లనెను. " మిత్రుఁడా ! నీవు చెప్పినది నీతియే. అయినను నా యాశ్రితుల దుఃఖము నేను సహింపఁజాలను ; కావున నిట్లు పలికితిని. ' పరుల నిమిత్తము ధనమునే కాక జీవితమును గూడ వదలుకొనవలయు ' నని పెద్దలు చెప్పుదురు. ఎప్పుడైనను నశింపక తప్పని ప్రాణములు మంచికారణమునఁ ద్యజించుట శ్రేయస్కరము గదా ! అన్నివిధముల వీరు నాకు సమానులు. వీరి నిపుడు రక్షింపలేకున్నచో వీరికి నాప్రభుత్వమువలని యుపయోగమేమి ? జీతబత్తెములు లేకున్నను వీరెల్లపుడు వీడక నన్నుఁ గొలుచుచున్నారు. నాజీవితము వదలుకొనియైనను వీరిని రక్షించుట మేలు. అనిత్యము, మలినము నగు దేహముచే శాశ్వతము, నిర్మలము నగు యశము లభించు నప్పుడిఁకఁ గావలసినదేమి యుండును ? శరీరము క్షణకాలములో నశించునది ; గుణములు కల్పాంతమువఱకు నుండునవి. కావున మలినమైన నాదేహము విషయమున శ్రద్ధమాని నాకీర్తిశరీరమును గాపాడుము. "

చిత్రగ్రీవుఁ డాడిన యీమాటలు విని హిరణ్యకుఁడు సంతోషముచేతఁ బులకితుఁడయి యిట్లనియెను. " సఖుఁడా మేలుమేలు. ఆశ్రితులయెడల వాత్సల్య మనెడి నీ యీ సుగు-

ణాముచేత ముల్లోకముల నేలఁజాలి యున్నావు." ఇట్లు పలికి యన్నిటిబంధములు నవలీలగాఁ గొఱికివైచి వానిని సాదర ముగాఁబూజించి హిరణ్యకుఁడు కపోతరాజుతో మరలనిట్లనెను.

"మిత్రమా! చిత్రగ్రీవా! వలలోఁ దగులుకొంటి నని విచారింపకుము. ఆమిషము నాకాశమున యోజనము దూరము నుండియైనఁ జూడఁగలపక్షి యాపత్కాలము ప్రాప్తమై నప్పుడు తనసమీపమునఁ బన్నఁబడిన వలను సైతముఁ జూడజాలదు. కాలము ప్రాప్తించినపుడు సూర్య చంద్రులకు రాహుకేతుగ్రహపీడయుఁ గజసర్పములకు బంధన మును, బుద్ధిమంతులకు దారిద్ర్యమును గలుగుచుండుటఁ జూచి నచో విధి బలవత్తర మని తెలును గదా! కావునఁ గాల మతిక్రమింపరానిది" అని యూరడించి, యాలింగన మొన రించి, సపరివారముగా నాతిథ్యమొసఁగి హిరణ్యకుఁడు చిత్ర గ్రీవునిఁ బంపెను. ఆ కపోతరా జానందమున యథేచ్ఛముగా వెడలెను. హిరణ్యకుఁడు తనకలుఁగుఁ జొచ్చెను.

కాఁబట్టి పెక్కుమంది సన్మిత్రులను సంపాదింపవల యును. ఒక్క మూషికమువలనఁ బావురముల కెంతమేలు చేకూఱెనో చూడుడు!

## లఘుపతనక మనెడి వాయసము హిరణ్యకుని చెలిమి గోరుట

వెంటనంటిపోయి పావురముల సంగతి యంతయుఁ జూచి లఘుపతనక మనెడి బూరుగుచెట్టుమీఁది వాయసము

హిరణ్యకుని కలుగు దగ్గర వ్రాలి "ఓహో! హిరణ్యకుఁడా! కొనియాడఁ దగినవాడవు. కాఁబట్టి నీచెలిమిగోరి వచ్చితిని. దయయుంచి నాకోరిక దీర్పుము" అని పలికెను.

హిరణ్యకుఁ డది విని కలుఁగులోనుండియే "ఓయీ నీ వెవఁడవు?" అని ప్రశ్నించెను. ఆకాకి "నేను లఘుపతనక మనెడి వాయసమను" అని బదులు పలికెను. హిరణ్యకుఁడు విడ్డూరముగా నవ్వి "నీతోడనా మైత్రి? సరిపడువారు మైత్రి చేయుట మంచిది. నే నాహారమను నీవు భక్షకుఁడవు. కావున నీతో స్నేహము నాకు హానికరము. పూర్వ మొక లేడి యొక నక్క చెప్పిన కపటపుమాటలు నమ్మి యురులలోఁ దగులు కొని యొక కాకముచేతఁ గాపాడఁబడినది. నీ కా కథ చెప్పె దను, విను" మని యిట్లు చెప్పఁదొడఁగెను.

## నక్క కపటపు మాటలచే వంచింపబడిన లేడి కథ

మగధ దేశమునఁ జంపావతి యను నడవియొకటి గలదు. అచటఁ జిరకాలమునుండియు నొక లేఁడియు, నొక కాకమును మిగుల స్నేహముతో నివసించుచుండెను. ఆలేడి చక్కఁగా బలిసి యడవిలో హాయిగా తిరుగుచుండఁగా నొక జంబుకము చూచి యిట్లాలోచించెను.

"ఆహా! యీలేడి మిక్కిలి బలిసియున్నది. దీని మాంసము నాకెట్లు లభించును? దీనికి నమ్మకము గలిగించి ప్రయత్నించి చూచెదను." అని తలఁచి యాజింకను సమీ

పించి "చెలికాఁడా! సేమమా?" యని యడిగెను. దాని కాజింక "నీవెవ్వఁడ" వని ప్రశ్నించెను.

"నేను సుబుద్ధియను పేరుగల జంబుకమను. కారణాంతరములచేత నాచుట్టము లందఱు నన్ను విడిచి పోయిరి. నేను మృతునివలె నిచట నొంటరిగా వసించుచున్నాను. స్నేహపాత్రుడవగు నిన్నుఁ జూడఁగనే బంధువులనడుమఁ జేరినటులున్నది. నీతోఁ జెలిమిచేసి కూడియుండఁ దలఁచుచున్నాను." అని యాజంబుకము సమాధాన మీయఁగా "సరే, అట్లే కానిమ్ము." అని దానిని లేఁడి సాయంకాలము తన నివాసస్థానమునకుఁ దోడుకొనిపోయెను.

అచట సంపెంగచెట్టుకొమ్మమీఁద నిలిచియున్న కాకి తన చెలికాఁడగు జింకను జూచి "యీ రెండవవాఁ డెవ్వఁ" డని యడిగెను. "నాస్నేహముఁ గోరివచ్చిన సుబుద్ధియను జంబుకోత్తముఁ" డని లేఁడి చెప్పఁగా విని, కాక మిట్లనియెను.

"సఖుఁడా! ఆకస్మికముగా వచ్చినవారిని నమ్మి చెలిమి సేయఁదగదు. కులము, శీలము నెఱుఁగనిదే యెవ్వరికిఁ జోటీయఁ దగదు. మార్జాలమునకుఁ జోటిచ్చిన దోషముచేతఁ బూర్వము జరద్గవమను నొక గ్రద్ద మరణము నొందెను. నీ కా కథ వివరించెదను వినుము" అని కాకి యిట్లు చెప్పఁ దొడఁగెను.

## మార్జాలమునకుఁ జోటిచ్చి దానివలన మరణించిన జరద్గవ మను గ్రద్ధ కథ

గంగాతీరమున గృధ్రకూట మను పర్వతమున నొక పెద్ద జువ్విచెట్టు గలదు. దాని తొఱ్ఱయందు మిక్కిలి ముదుసలియై గోళ్లు, దంతములు పట్టుచెడిన జరద్గవ మను నొక గ్రద్ధ నివసించుచుండెను. ఆ చెట్టుమీఁదనుండు పక్షులు దయతోఁ దాము తెచ్చుకొన్న తిండిలోఁ గొంచెము కొంచెము మా జరద్గవమున కిచ్చుచుండెను. ఆగ్రద్ధ దానితో జీవించుచుఁ బక్షులు గూళ్లు విడిచి పోయినపుడు వాని పిల్లలను గాపాడుచుండెను.

ఒకనాఁడు దీర్ఘకర్ణ మనెడి పిల్లి యొకటి పక్షిపిల్లలను బట్టుకొని తినుటకై యాజువ్విచెట్టుకడకు వచ్చెను. దానిం జూచి పక్షిపిల్లలు భయపడి యఱవఁదొడఁగెను. అంతట జరద్గవ మా యఱపు విని "యెవ రా వచ్చుచున్న వా?" రని ప్రశ్నించెను.

అపు డాపిల్లి గ్రద్ధను జూచి భయపడి "హా, చచ్చితిని! ఇఁక నేమి చేయుదును? ఆపద మీఁదఁ బడినపుడు భయపడి పొందఁగల ప్రయోజనమేమి? పాఱిపోవు టిఁక శక్యముగాదు. ఉపాయమునఁ దప్పించుకొనవలయును. ఏమైన నగును గాక. దీనితో మాటలాడి నమ్మకము గలిగింప యత్నించెదను." అని యాలోచించి దరిఁజేరి "అయ్యా! నమస్కారము" అని పలుకఁగా గ్రద్ధ 'నీవెవ్వఁడ' వని ప్రశ్నించెను. "నేను

దీర్ఘకర్ణమను పేరుగల పిల్లిని" అన, గ్రద్ద "వెంటనే దూరముగఁ బొమ్ము. లేనిచోఁ జంపివేయుదు" ననెను.

"దయయుంచి నామాట వినుఁడు. అనంతరము చంపఁదగినవాఁడ నైనయెడల నట్లే చంపివేయవచ్చును. జాతిమాత్రమున నెవ్వరినిఁ జంపివేయనురాదు; పూజింపను గూడదు. సంగతియంతయుఁ దెలిసికొని చంపఁదగునో, గౌరవింపఁదగునో నిర్ణయించుట నీతి" అని యా మార్జాలము వేడుకొనఁగా గ్రద్ద యపుడు "అయినచోఁ జెప్పుము. నీవేమి పనిమీఁద నిచటికి వచ్చితివి?" అని యడిగెను.

"నే నిచట గంగలో నిత్యము స్నానముచేయుచు మాంసాహారము విడిచి బ్రహ్మచారినై చాంద్రాయణవ్రతము చేయుచుంటిని. మీరు ధర్మజ్ఞానపరులనియు, విశ్వాసయోగ్యులనియుఁ బక్షులన్నియు నెల్లవేళల నుతించుట విని, విద్యచేతను, వయస్సుచేతను బెద్దలయిన మీవలన ధర్మములు విన దలఁచి మీదర్శనమునకు వచ్చితిని. అన్నిధర్మములుఁ దెలిసిన మీరే మీయింటికివచ్చిన నన్నుఁ జంపఁదలఁచితిరి.

ఇంటికి వచ్చినపుడు శత్రువున కయినను గౌరవము చేయవలయును. ధన మీయలేకున్న మంచిమాటలతోనైన నాదరింపవలయును. తన్ను ఛేదించుటకు వచ్చినవానికి సయితము వృక్షము చల్లని నీడయొసఁగి యాదరించుచున్నది. సాధువులు గుణహీనులయందును దయచూపుదురు. ఎట్టి

నీచపుఁ దావులయందును జందమామ వెన్నెల గాయకుండ నుండఁడుగదా !

మఱియు నగ్ని బ్రాహ్మణులకుఁ బూజ్యుఁడు. అన్ని వర్ణములవారికి నిజమైన బ్రాహ్మణుఁడు పూజ్యుఁడు. స్త్రీలకు భర్త పరమపూజ్యుఁడు. ఇంటికి వచ్చిన యతిథి యందఱకుఁ బరమపూజ్యతముఁడు. ఎవ్వఁడింటికి వచ్చిన యతిథిని, నిరాశతో వెడలఁగొట్టునో వాని సుకృత మా యతిథికిఁ జెందుననియు, నాయతిథి చేసిన పాప మాతని వెడలఁగొట్టిన వానికి వచ్చు ననియుఁ బెద్దలు చెప్పుదురు. అతిథి సర్వదేవతలతో సమా నుఁడు. వాఁడెట్టి నీచుఁడైనను గౌరవమున కర్హుఁడు." అని పిల్లి చెప్పిన సంగతులు విని గ్రద్ద మరల నిట్లనెను. "పిల్లులకు మాంసమునం దెక్కువ యిష్టము. పక్షిపిల్లల రక్షణభారము నామీఁద నుండుటచేత నిట్లంటిని" అనఁగానే యాబిడాలము చెవులు మూసికొని యిట్లు పలికెను.

"హరిహరీ! ఎంతమాట వినవలసి వచ్చినది! ధర్మ శాస్త్రములు విని, కోరికలు విడిచి చాంద్రాయణవ్రత మాచ రించుచుంటిని. ఇతర విషయములను గుఱించి పరస్పరవిరో ధము లెన్నియున్నను ధర్మశాస్త్రము లన్నియు 'అహింస పరమధర్మ' మని యేకగ్రీవముగా ఘోషించుచున్నవి. సర్వ జీవులయందు దయగలిగి యుండి యహింస నవలంబించువానికి స్వర్గము స్వాధీనమై యుండును. మరణము కలుగునన్నచోఁ బుట్టుదుఃఖము వర్ణింపనలవికానిది. ఒకరి ప్రాణములు దీసి

తా ననుభవించు తృప్తి క్షణికమే కదా! అనాయాసముగా దొరకు నే యాకలములతోనైనఁ బొట్టపోసికొనవచ్చును. ఈ పాడుపొట్టకై మహాపాపముచేయుట యెంత తెలివితక్కువ పని?" యని పలికి యా ముసలిగ్రద్దకు సంపూర్ణమగు నమ్మకముఁ గలిగించి దానితో మిక్కిలి స్నేహముఁ జేయుచు నాచెట్టు తొఱ్ఱలోనే నివసించుచుండెను.

ఇట్లు కొన్ని దినములు గడచి గ్రద్దకు నమ్మకము ముదిరిన యనంతరము దీర్ఘకర్ణము చెట్టెక్కి పక్షిపిల్లలను దెచ్చి తొఱ్ఱలో నిడుకొని నిత్యము భక్షింపసాగెను. తమపిల్లలు కనఁబడక పక్షులు దుఃఖించుచు నిటునటు వెదుకఁ దొడఁగినవి. ఆ సంగతి తెలిసి పిల్లి తొఱ్ఱను విడిచి పాఱిపోయెను. పక్షులు వెదకివెదకి తొఱ్ఱలోనున్న తమపిల్లల యెముకలు కనుఁగొని యా జరద్గవమే పిల్లలను దినివైచి యుండునని నిశ్చయించి యన్నియుఁ జేరి తమ ముక్కులతోఁ బొడిచి యా ముసలిగ్రద్దను జంపివైచినవి.

కాఁబట్టి యాకస్మికముగా వచ్చినవారిని నమ్మరాదని చెప్పితిని? ఈ విధముగాఁ జెప్పిన కాకి పలుకులు విని మిక్కిలి కోపముతో జంబుక మిట్లనెను.

"ఈ లేఁడిని జూచిన మొదటిరోజున నీవును నూతనుఁడవే. అట్టి నీకును దీనికిని మైత్రి నిత్యమును వర్ధిల్లుట లేదా? నీ కెదురాడువారు లేక నీకుఁ దోచిన వన్నియు నీతులని పలుకు

చున్నావు. వీఁడు తనవాఁడు, వీఁడు పరుఁడు నని యల్పబుద్ధి గలవారు తలపోయుదురు. బుద్ధిమంతు లట్లు భావింపక లోక మంతయు నొకకుటుంబమని యెంతురు. ఈ లేఁడి నీకెట్టి చుట్టమో నాకును నట్టిబంధువే.” ఈ మాటలు విని ‘యట్లే యగుఁ గాక’ యని కాకియు దానిచెలిమి కంగీకరించెను. అప్పటినుండియు నాలేఁడియు, నక్కయుఁ, గాకియు మిక్కిలి స్నేహముగలిగి యా వనమున నివసించుచుండెను.

కొంతకాలమునకుఁ బిమ్మట సుబుద్ధి లేఁడితో రహస్య ముగా నిట్లు పలికెను. “యీ యడవియం దొక్కచోట సస్యముతో నిండిన పొలమున్నది. దానిని నీకుఁ జూపుదును ర” మ్మని జింకను వెంటఁ దీసికొనిపోయి సుబుద్ధి పంట పొలము దానికిఁ జూపెను. లేఁడియు రోజురోజు నచటికిఁ బోయి యాపయిరు దినుచుండెను.

ఒకనాఁడు పొలముకాపు పయిరు దినివేయఁబడుచుం డుటఁ జూచి, వలపన్ని వెడలెను. జింక మేఁతకుఁ బోయి యావలలోఁ జిక్కుకొని ‘నన్నీ వలనుండి, తప్పించి కాపాడు దిక్కెవరు?’ అని చింతించుచుండ జంబుకము వచ్చి చూచి ‘నాతంత్ర మిప్పటికి నెఱవేఱినది. ఇది చంపబడినయెడల దీని మాంసాదులు చాలకాలమువఱకు నాకు భోజనమునకు సరి పోవును.’ అని తలఁచుచు దరి కేఁగెను.

లేఁడి జంబుకమును గాంచినంతనే సంతసించి ‘సఖుఁడా! త్వరితముగా వచ్చి నాబంధములు గొఱికి నన్నుఁ గాపాడు’

మని కోరెను. ఆ నక్కయు మఱింత దగ్గరగా వచ్చి మాటి మాటికి వలను బరిశీలించి చూచి 'మిత్రుఁడా! యీవల నులి నరములతోఁ జేయఁబడినది. దీనిని నేఁ డాదివార మగుటచేతఁ దాఁకఁ జాలను. నీవు వేఱుగా భావింపకుము. తెల్లవారఁగనే నీవు చెప్పినట్లు చేయుదును.' అని పలికి సమీపమందలి పొద చాటున దాగియుండెను.

అనంతరము సాయంకాలమైనను లేఁడి తిరిగి రాకుండుట చేత వాయస మనుమానపడి యటునిటు వెదకుచు వచ్చి వలలోఁ దగులుకొనియున్న మిత్రునిఁ జూచి 'ఇది యేమి?' యని యడిగెను.

'మిత్రుని మాట వినకుండుటవలనఁ గలిగిన ఫలితము. హాని సిద్ధమైయున్నపుడు సఖుల మాటలు చెవి కెక్కునా!' యని పలికి లేఁడి సంగతియంతయు వివరించెను. 'జంబుక మెచట నున్న' దని వాయస మడిగెను. 'నా మాంసముఁ దినఁ గోరుచు నిచటనే యుండు' నని మృగము బదులు పలికెను. అపుడు కాకి యిట్లనెను.

'నేను ముందే చెప్పితిని. నాయం దేమియు దోసము లేదు గదా యని దుర్మార్గులను నమ్మరాదు. వారు సుజను లకుఁ గూడ హానిచేయఁగలరు. మరణము సమీపించినవారు దీప మాఱిపోవునప్పటి గంధ మాఘ్రాణింపలేరు. మఱియు వారి కరుంధతీ నక్షత్రము గోచరింపదు. మిత్రులమాటలు చెవి కెక్కవు.

ఎదుట మంచిమాటలాడి నమ్మించి చాటునఁ గీ డొన
రించు మిత్రుని నమ్మరాదు. అట్టివాఁడు మేఁకవన్నె పులివంటి
వాఁడు.' అని పలికి 'ఓ దుష్టజంబుకమా! పరమసాధువయిన
యీజింకను వంచించితివా? ఓ భూమాతా! నమ్మి మేలొన
రించిన వారిని వంచించు దుష్టుల నెట్లు భరింపఁగలుగుచుంటివి?

దుర్జనుల సాంగత్యము సకలహానులకు మూలము.
నిప్పు తాఁకినవారిని దహించును. చల్లాఱినను మాలిన్యమును
గలిగించును.

దోమ ముందుగాఁ బాదముల మీఁద వ్రాలును. పిదప
వీపుమీఁది మాంసమును గొఱుకును. చెవిలో మధురముగా
నేమియో పలుకును. రంధ్రముఁ జూచుకొని నెమ్మదిగా శరీర
మునఁ జేరి కడుంగడు హానిఁ గలిగించును. దుష్టుని వర్తనము
నిట్టిదే. మధురముగా మాటలాడినంతమాత్రమున విషముతో
నిండిన హృదయముగల దుర్జనుని నమ్మరాదు' అని విచా
రించుచుండఁ గఱ్ఱ చేతఁబట్టుకొని వచ్చుచున్న పొలముకాపు
గనఁబడెను.

వానిఁ జూచి వాయసము 'సఖుఁడా! ఆలసింపరాదు.
ఊపిరి బిగఁబట్టి కడు పుబ్బరించునట్లు చేసి కాళ్లు చాచుకొని
చనిపోయినట్లు నటింపుము. నేను కూయఁగానే లేచి వేగ
ముగాఁ బాఱిపొమ్ము' అని చెప్పెను.

జింకయుఁ గాకి చెప్పిన విధమునఁ జచ్చినట్లు పడియుం
డెను. అపుడు పొలముకాపువచ్చి యా జింకను జూచి యది

చచ్చినదని తలఁచి వల వదలించెను. అది చూచి కాకి కూసెను. అంతట వేగముగా లేచి లేఁడి పాఱిపోయెను. మృగముచేసిన వంచన కా ఘోలముకాపు మిక్కిలి కోపించి తన చేతనున్న బడియ విసరగా నది గుఱితప్పి దాగియున్న నక్కకుఁ దగిలెను. దానిచేత నానక్క వెంటనే ప్రాణములు విడిచెను.

"పుణ్యముగాని, పాపముగాని మితిమీఱి చేయువారికి ఫలితము కొలఁది కాలములోనే సంభవించును." అనిన విని లఘుపతనకము హిరణ్యకున కిట్లనెను.

"నిన్నుఁ జంపిన మాత్రమున నాకుఁ బుష్కలముగ నాహారము చేకూఱునా? నీతో మైత్రి యొనరించి చిత్రగ్రీవుని వలె నుండుదును. నీవెన్ని చెప్పినను నీచెలిమి సేయనిదే జీవించి యుండఁజాలను. నే నింతగా మాట్లాడితినని నాపైఁ గోపగింపకుము. సాధువులకుఁ గోపము వచ్చినను వా రితరులకు హాని చేయఁ బూనుకొనరు, నిప్పురవ్వ తగిలిన మాత్రమున సముద్ర జలము వేడి యెక్కదు."

ఈ మాట విని, "నీవు చంచలబుద్ధివి. చపలుని చెలిమి మంచిదిగాదు. మార్జాలము, దున్నపోతు, కాకము, దుర్జనుఁడు నమ్మించి యెంతపనియైనఁ జేయఁగలరు. మఱియు నీవు మాకు శత్రువులతెగకుఁ జెందినవాఁడవు. శత్రు వెంతమంచివాఁడైనను వానితోఁ జెలిమి సేయఁదగదు. జల మెంత యుష్ణమైన దైనను నిప్పును జల్లార్పకుండునా? మంచి మాణిక్యములను

ధరించినదై నను సర్పము చేరరాని దై నట్లుగా నెట్టివిద్యగలవాఁ డైనను దుర్జనుఁడు చేరనీయక విడువఁదగినవాఁడు. నేలమీఁద వానలును నీటిమీఁద బండ్లును నడువఁజాలని విధమున శత్రువు మేలొనరించుట యసంభవము. శత్రువును, దనపై మనసులేని భార్యను నమ్మియుండువాని కచిరకాలము నకే హాని సంభవింపపకమానదు " అని దృఢముగాఁ బలికెను.

ఆ మాటలు విని లఘుపతనకము " వేయిమాటలేల ? నీవు నాచెలిమి కంగీకరింపని యెడల నేఁటినుండి నిరశనవ్రతముఁ బూని ప్రాణములు కోలుపోవుదును. కారణ మేమన; మంటి కుండనువలె దుర్జనునిఁ ద్వరలో విడఁగొట్టుట సులభము. సంధించుట మిక్కిలి కష్టము. బంగరుకలశము త్వరితముగా సంధింపఁబడును గాని తేలికగా విడఁగొట్టఁబడదు. సుజనుని విధము నట్టిదియే.

సుజనులను జూచినంతమాత్రమున సఖ్య మేర్పడును. అది విడఁదీయరానిదై యుండును. సుజనులు నారికేళమువలె సారముఁ గలిగియున్నట్లు బయటికి గనఁబడకున్నను నంతరంగమున సుగుణసారముఁ గలిగి యుందురు. దుర్జనులు మేడిపండువలె బయటికి మాత్రము సుందరముగాఁ గనఁబడుదురు. సాధువుల చెలిమి కేకారణమున నైన నాటంకములు గలిగినను వారి గుణముల యోగ్యత సెడదు. తామరతూండ్లు త్రుంచి వేయఁబడినను వాని దారములు విడిపోవు. మంచిమిత్రుని గుణములని చెప్పఁబడు దయ, స్నేహము, త్యాగము,

శౌర్యము మున్నగునవి యన్నియు నీయందుఁ గలవు. ఇట్టి మిత్రుఁడు నాకింకెట్లు దొరకును ?" అని వివరించెను.

ఆ మాటలు విని హిరణ్యకుఁడు కలుఁగు వెడలివచ్చెను. "లఘుపతనకా ! నీమాట లమృతమువలె నా కానంద మొసఁగినవి. మంచిగంధపుసారముగాని, చల్లని నీటితుంపురుల జల్లుకాని, కప్పురపుఁబ్రోవుల పరిమళముగాని యాదరముతో నిండిన సుజనుల సల్లాపమువలె హాయి గలిగింపఁ జాలవు. రహస్యము వెల్లడించుట, యాచన, నిష్ఠురముగ మాటలాడుట, మనస్థిరత్వము లేకపోవుట, కోపము, నసత్యములాడుట మిత్రులకుండరాని గుణములు. ఈ దోసములం దేదియు నీయందు లేదు. మాటలవలననే మంచిచెడ్డలు గొంతవఱకు వెల్లడియగుచుండును. కావున నీవు గోరినటులే యగునుగాక" అని పలికి వాయసముతో సఖ్యమొనరించి గౌరవించెను. నాటినుండియు లఘుపతనక హిరణ్యకులు పరస్పరముఁ గుశల మరసికొనుచుఁ గడు విశ్వాసముతో మాటలాడుకొనుచుఁ గాలక్షేపము సేయుచుండిరి.

ఒకనాఁడు లఘుపతనకుఁడు హిరణ్యకునితో "సఖుఁడా! ఇచట నాకుఁ దిండి దొరకుట కష్టమగుచున్నది. ఇచ్చోటు వీడి మఱియొకస్థలమున కేఁగుట మంచిదని తలంచుచుంటిని." అని చెప్పెను. దానికి హిరణ్యకుఁడు 'మిత్రుఁడా ! ఒకస్థానము విడిచి నూతనస్థలమున నడుగిడునపుడు చక్కఁగా నాలోచింపవలయును. నీవెచటి కేఁగఁ దలఁచితివి ? ' అని యడిగెను.

"మిత్రమా! చక్కగా నాలోచించితిని. దండకారణ్యమునఁ గర్పూరగౌర మను నొక సరస్సు గలదు. చిరమిత్రుఁడైన మంథరుఁ డనెడి కూర్మరా జందుఁ గలఁడు. ఇతరులకు ధర్మములు బోధించుట సులభము. ఆచరించుట కష్టము. ఆ తాఁబేలు కడు ధర్మాత్ముఁడు. ఆతఁ డాహార మొసఁగి నన్నుఁ బోషింపఁగలఁడు" అని వాయసము బదులుపల్కెను.

అంతట హిరణ్యకుఁడు "నీవు వెడలిపోయిన తర్వాత నిచటనుండి నేనేమి చేయుదును? 'ఏ దేశమున గౌరవము, జీవనోపాయము, చుట్టములు, విద్యాప్రాప్తి లభింపవో యా దేశము విడువవలయు' నని పెద్ద లందురు. మఱియు, అప్పిచ్చువాఁడు, వైద్యుఁడు, సంతతముఁ బ్రవహించు నది, వేదపండితుఁడు లేనిచోట నుండరాదు. కావున నన్నుఁగూడ నీతోఁ గొనిపొమ్ము." అని కోరెను. లఘుపతనకుఁ డందుల కంగీకరించెను. సంతసముతో విచిత్రమైన కథలు చెప్పుకొనుచుఁ గర్పూరగౌర సరస్సును జేరఁబోయిరి.

మంథరుఁడును, వచ్చుచున్న వాయస మూషికములను దూరమునుండియే చూచి తగిన విధమున నాదరించెను. అనంతరము లఘుపతనకుఁడు మంథరునితో నిట్లు పలికెను. "సఖుఁడా! యీ మూషికరాజు మిక్కిలి పుణ్యాత్ముఁడు. దయాపరుఁడు. ఈతని పేరు హిరణ్యకుఁడు. ఈతని సుగుణవిశేషము లాదిశేషుఁడైనను వర్ణింపఁజాలఁడు. ఈతని నీవు

మిగుల గౌరవింపవలయును." అని హిరణ్యకునితోఁడి తన చెలిమిని గుఱించి వివరించెను.

అంతట మంథరుఁడు హిరణ్యకుని మిక్కిలి పూజించి "హిరణ్యకా! నీ వీ జనరహితమైన యడవియందేల నివసించు చుంటి" వని యడిగెను. అపుడు హిరణ్యకుఁడు తన వృత్తాంతము నిట్లు చెప్పఁదొడఁగెను.

"చంపక మను నగర మొక్కటి కలదు. అందలి మఠములో సన్యాసులు పెక్కుమంది నివసించుచుందురు. అందుఁ జూడాకర్ణుఁ డను నొక యతి గలఁడు. అతఁడు ప్రతి దినముఁ దాను భుజింపఁగా మిగిలిన యాహారము భిక్షాపాత్రమందుంచి యా పాత్రముఁ జిలుకకొయ్యకుఁ దగిలించి నిదురించు చుండువాఁడు. నేను రోజురోజు మెల్లగాఁ బయి కెగఁబ్రాఁకి యా పదార్థమును దినిపోవుచుండువాఁడను. ఒకనాఁ డాతని మిత్రుఁడు వీణాకర్ణుఁ డచటికివచ్చెను. జూడాకర్ణుఁ డాతనితో మాటలాడుచు నన్ను భయపెట్టుటకై మాటిమాటికి గిలుక కఱ్ఱతో నేల మీఁదఁ గొట్టుచు వచ్చెను. అదిచూచి వీణాకర్ణుఁడు 'ఏల యటులు గొట్టుచుంటివి? నామాటలయం దిష్టములేదా?' యని చూడాకర్ణు నడిగెను.

"ఇష్టము లేకపోవుట గాదు, చూడుము, ఆ యెలుక ప్రతిదినము నా కపకారియై పాత్రమునందలి పదార్థముఁ దిని వేయుచున్నది. దానిని బెదరించుటకై యిట్లుకొట్టుచుంటిని." అని చూడాకర్ణుఁడు బదులు పలికెను. అదివిని "యల్పజంతు

వైన యెలుక కింత పైకెగురు శక్తి యెటులు వచ్చెను? దీని కేదో కారణ ముండితీరును. వెనుక శాండిలీమాతయను నొక బ్రాహ్మణి నువ్వుపప్పునకు మాఱుగా నువ్వు లడిగినందుల కేదో కారణ ముండియుండునని యొక బ్రాహ్మణుఁడు గుర్తించెను. నీ కా కథ చెప్పెదను వినుము" అని వీణాకర్ణుఁ డిట్లు చెప్పఁదొడఁగెను.

## నూవుల బ్రాహ్మణి కథ

"పూర్వము నే నొక బ్రాహ్మణుని యింటికి భిక్షకై వెడలి యుంటిని. ఆయింటి బ్రాహ్మణుఁడు "ఱేపటి దినమమావాస్య. బ్రాహ్మణులకు భోజనము పెట్టవలసియున్నది. పదార్థము లేవి సమకూర్చియుంటి" వని భార్య నడిగెను.

"పురుషులు తమ సామర్థ్యముచేతఁ బదార్థములు సంపాదించి యింటికిఁ దేవలయును. అపుడు స్త్రీలు గావలసిన పనులకు వాని నుపయోగింతురు. మీరు తేకుండిన నే నేమి చేయఁగలను?" అని యామె బదులు పలికెను.

దాని కా బ్రాహ్మణుఁడు కోపగించి "పదార్థములు సంపాదింప వలయునన్నమాట నిజమేకాని బ్రాహ్మణునకు విస్తారముగా సంపాదింపవలయు ననెడి కోరిక యుండరాదు. అట్లని విధాయక కృత్యముల కత్యావసర మైనవానిని భద్రపఱుపక పోవుట తప్పుకాదా?" యని భార్యను మందలించెను.

అపుడామె భర్తతో "నువ్వులు, బియ్యము గొంచెము కూడఁబెట్టి యుంచితిని. రేపు తిలాన్నముఁ జేయుదును రేండు" అని చెప్పి నువ్వులు బాగుగాఁ గడిగి యెండఁ బోసెను. ఒక కోడివచ్చి యానువ్వులు కాళ్ళతోఁ జిమ్మెను. బ్రాహ్మణుఁ డది చూచి బ్రాహ్మణ భోజనమున కీనువ్వులు పనికిరావు. కాఁబట్టి యవి తీసికొనిపోయి మార్చి తీసికొని రమ్మని భార్యకుఁ జెప్పెను. తరువాత నామె నేను భిక్షకేఁగిన యింటికి వచ్చి 'నువ్వు పప్పుఁ దీసికొని నువ్వు లిచ్చెదరా?' యని యా యింటివారి నడిగెను. ఆ యింటి యిల్లాలా మాటలు విని సంతసించి యింటిలోనుండి నువ్వులు తీసికొని వచ్చి నువ్వుపప్పు పుచ్చుకొనుచున్న సమయమున నాయింటి బ్రాహ్మణుఁ డెచటి నుండియో యింటికివచ్చెను. "భార్యను జూచి నీవేమి బేరమాడుచున్నావని ప్రశ్నించెను. ఆమె చెప్పిన సంగతి విని "వెఱ్ఱిదానా? చెరుడు నువ్వులు దీసికొని దంచిననువ్వు లిచ్చువా రెక్కడనైన నుందురా? ఈమె యిట్లు వచ్చుట కేదో కారణ ముండితీరును." అని యా బ్రాహ్మణుఁడు చెప్పుచుండఁగా భిక్షార్థ మచటనున్న నే నామాటలు వినియుంటిని. ఈ మూషికమును దగిన కారణములేనిదే యిచట నింతధైర్యముగాఁ గాపురముండదు."

ఇట్లు వీణాకర్ణుఁడు చెప్పిన కథ విని వెంటనే చూడాకర్ణుఁ డొక గునపముఁ దెచ్చి నేను నివసించు కలుఁగును ద్రవ్వి చిరకాలమునుండి సంపాదించిన నా ధనమునంతను దీసి

వైచెను. నాఁటినుండి యుత్సాహ మంతయుఁ బోయి యాహార మైనను సంపాదించుకొను శక్తిలేనివాఁడనై దిగులుపడి మెల్ల మెల్లగాఁ దిరుగుచుంటిని.

చూడాకర్ణుఁ డట్టియవస్థలో నొకనాఁడు నన్నుఁ జూచి తన మిత్రునితో నిట్లనెను. "లోకమున ధనము గలవాఁడే బలవంతుఁడు. పండితుఁడు నాతఁడే. గ్రీష్మకాలమున నదు లింకిపోయినట్లు ధనములేనివాఁడు చేయఁదలపెట్టు కార్యము లన్నియుఁ జెడిపోవును. ధనముగలవారికే బంధువులు, మిత్రులు నిలిచియుండుదురు. బిడ్డలులేని యిల్లును, చుట్టములులేని దేశము, మూర్ఖుని మనస్సు శూన్యముగా నుండును. దరిద్రు నకు సర్వము శూన్యముగ నుండును. దారిద్ర్యముకంటెఁ జావు మేలు. మరణము తత్కాలమున మాత్రమే బాధ గలి గించును. దారిద్ర్యము బ్రదికియున్నంతకాలము బాధించు చుండును. అన్నిలక్షణములును వెనుకటివలెనే యున్నను ధనము తొలఁగినంతనే వేఱుమనుజునివలె నయిపోవును. ఈ సంగతి యెంతయుఁ జిత్రమయినది. ధనముఁ గోలుపోయి యీయెలుక యెంత నిరుత్సాహ మొందినదియో చూడుము."

అది విని నే నిట్లాలోచించితిని. "ఇంక నే నిచట నుండుట దగదు. ఈ వృత్తాంత మెవ్వరికిఁ జెప్పను దగదు. 'ధననాశము, మనోవ్యథ, యింటిగుట్టు, మోసము, పరా భవము నెవ్వరికిఁ జెప్పరాని' వని పెద్ద లందురు. దైవము మిక్కిలి ప్రతికూలమై పౌరుషము చెడిపోయినపు డభిమానము

గలవానికి వనమే శరణ్యము. అభిమానవంతుఁడు మరణమైన నొందును గాని దైన్యము నొందఁడు. నిప్పు, నీరు చిలుకరించి నను వెంటనే వేడిమి గోలుపోవదుగదా! మానవంతుఁడు పూలగుత్తివలె నందఱి శిరముల మీఁదనైన నుండవలయును. లేదా అడవిలో మంటియందుఁబడి నశించిపోవనైనఁ బోవల యును. ఇచటనే యుండి యాచించుకొని బ్రదుకుట కంటె నెండైనఁబడి చచ్చుట మేలు.

దారిద్ర్యము సర్వాపదలకు మూలము. కల్లలాడుట కంటె మౌనము మేలు. పరసతులఁ గూడుటకంటెఁ బురుషుఁడై పుట్టకుండుట మేలు. యాచించి జీవించుటకంటెఁ జావుమేలు. దుష్టవృషభము లుండుటకంటె గోశాల శూన్యమై యుండుట లెస్స. అవినీతురాలైన భార్యకంటె వేశ్య మేలు. అవివేకి పరిపాలనమున నుండుటకంటె వనవాసము మేలు. అధములఁ జేరుటకంటె మరణమే మేలు.

వెన్నెల చీకటిని హరించును. ముదుసలితనము లావణ్యము హరించును. హరినామము పాపములను హరించును. యాచన సర్వసుగుణములను హరించివేయును. కావున నే నేల జీవనమునకై యితరులను గాచుకొని యుండవలయును. అట్లుండుటన్న మాఱురూపమున మృత్యువు నొందియుండుటయే." అని యెంతో యాలోచించియుఁ దిరిగి లోభమునకు లొంగినవాఁడనై ధనము సంపాదింపఁ దలఁచి మరలఁ గలుఁగు నిర్మించుకొంటిని.

లోభ మెంతపాడుగుణము ? దానివలన మతి చలించును. దాన దుఃఖము గలుగును. నే నట్లు మెల మెల్లనఁ దిరుగుచుండఁగాఁ జూడాకర్ణుఁడు చూచి యీమాఱు నన్నుఁగఱ్ఱతోఁ గట్టిగాఁ గొట్టెను.

“ఎవనిమానసమునకు సంతుష్టి కలుగదో వానికి సర్వాపదలును సంభవించును. తృప్తిగలవానికి సకల సంపదలు నున్నట్లే యుండును. చెప్పులుదొడిగిన కాళ్ళకు లోకమంతయుఁ జర్మమయముగఁ దోఁచును. సంతుష్టుఁడైన వానికిఁ గలుగు సుఖ మెంతధనమున్నవానికిఁ గలుగనేరదు. తృప్తి గలవానికి సర్వము నొడగూడును ? తృష్ణకు వశుఁడైనవాఁడు దూర మనుకొనక నూఱుయోజనములైనఁ దిరుగును. సంతుష్టుఁడు ధనము మోకాలిదగ్గఱికి వచ్చినను లెక్కసేయఁడు. వనములో ఫలమూలాదులు దిని సెలయేటినీరు ద్రావి తృణశయ్యపై బరుండి బ్రదుకుట మేలగునుగాని ధనహీనుఁడై బంధుమిత్రాదుల నడుమ నుండఁదగదు.” అని యెంచి యాస్థల మంతటితో విడిచి నిర్జనవనముం జేరితిని. పుణ్యావశమునఁ గొంతకాలమున కిట్టి మిత్రుఁడు లభించెను. నాయదృష్టమువలనఁ జివరికి నీయాశ్రయ మనెడి స్వర్గమే లభించినది. సంసార మనెడి విషవృక్షమునకుఁ గావ్యామృత రస మనుభవించుట, సుజనులతో సాంగత్యముచేయుట యనునవి రెండే రసవంతములయిన ఫలములు.” అని హిరణ్యకుఁడు వివరించిన సంగతులన్నియు విని మంథరుఁ డిట్లుపలికెను.

"అర్థములు నిలుకడ గలవికావు. యౌవనము సెలయేటి నీటివంటిది. జీవితము నీటిబుడగవంటిది. తగినకాలమున ధర్మ మాచరింపనివాఁడు వార్ధక్యమొంది పశ్చాత్తాప మనెడి యగ్నిచే దహింపఁబడును. నీ వతి సంపాదనముఁ జేసితివి. అందుచేతనే బాధకలిగినది. తటాకజలముపొంగి గట్లు త్రెంచి వేయకుండుటకు జలమును విడుచు తూఁబు యవసరమైనట్లు సంపాదింపఁబడిన ధనమునకు దానమనెడి రక్షణ మావశ్యకము. ధనము పాతఱలో దాచుట దాని నాశమునకు దారి చూపుటయే.

తన సుఖము లెక్కింపక ధనము సంపాదించువాఁడు పరులబరువు మోయువానివలె శ్రమకుమాత్రమే పాలగును. దానభోగములే ధనమునకు ఫలములు. అవిలేని ధనికుఁడు దరిద్రునికంటె నధికుఁడుగాఁడు ధనమున్నను సుఖముగా ననుభవింపనివాఁడు దరిద్రునితో సమానుఁడే. సంపాదించుట యందును రక్షించుటయందును శ్రమ మాత్ర మాతనికి విశేషము. మంచిమాటలతోడి దానము, గర్వములేని జ్ఞానము, నోర్పుతోడి పౌరుషముఁ బ్రశస్తములు. ధనసంపాదన మవసరమే యైనను దానియం దతివాంఛ దగదు. పూర్వ మొకనక్క యెక్కువ సంపాదింపఁగోరి వింటి దెబ్బచే మరణించెను. నీ కా కథ చెప్పెదను వినుము.

అతి సంపాదనేచ్ఛచే వింటిదెబ్బతగిలి మరణించిన నక్కకథ

కల్యాణకటకమను పట్టణమున భైరవుఁ డనెడి బోయవాఁడు గలఁడు. వాఁ డొకనాఁడు వేటకై యడవి కేఁగెను.

అచట నొక మృగమును వేటాడి చంపి దానిని బుజముపై మోచికొని వచ్చుచుండఁగా నొక యడవిపంది యాతనికిఁ గనఁబడెను.

ఆతఁడు బుజము మీఁది లేఁడిని క్రిందికిఁ దించి వెల్లెక్కువెట్టి బాణము సంధించి యా వరాహముం గొట్టెను. అదియు మిక్కిలి కోపముతో ఘుర్ఘురధ్వని చేయుచుఁ గొమ్మున వానిం గొట్టఁగా నాదెబ్బ కాతఁడు మొదలు నఱకిన చెట్టువలె నేలమీఁదఁ గూలి ప్రాణములు విడిచెను. బాణపు దెబ్బచేత నడవిపందియు మరణించెను. అచ్చట నొక సర్పము కిరాత సూకరముల కాలి త్రొక్కుడికి నలిగి చచ్చెను.

ఇంతలో దీర్ఘరావ మను నొకనక్క యాయడవియం దాహారమునకై తిరుగుచు నచటికివచ్చి చచ్చిపడియున్న బోయ వానిని, సర్పమును, వరాహమును జూచి యిట్లాలోచించెను.

“ నాకిపుడు గొప్పయాహారము దొరకినది. ప్రాణులకు దుఃఖము లేవిధముగా ననుకొననిదే కలుగుచుండునో దైవశ మున సుఖములును నట్లే సంభవించుచుండును. నా కీయాహా రము మూఁడునెలలవఱకును సరిపడును. ఈ కిరాతునిమాంస మొక నెలకుఁ జాలును. లేడిమాంసముతో నింకొక నెలయుఁ బంది మాంసముతో మఱియొకమాసమును గడుపవచ్చును. సర్పమాంస మొక్కరోజునకుఁ జాలును. ఈవింటినారి నరము దిని మొదటియాకలి దీర్చుకొందునుగాక ” యని తలఁచి

యావింటి చేరువకుఁ బోయి నారి గొఱుకఁగనే బెట్టువదలి వింటికొన గాటముగ బొమ్మనఁ దగిలి ప్రాణములు దీసెను.

అతిలోభ మెంత హానికరమో చూడుము. దానమునకును భోగమునకును వినియోగపడినది మాత్రమే స్వధనము. అట్లుపయోగింపక కూడఁబెట్టినది యితరులపాలగును. గతించిన దానికి విచారమేల? పండితులు రానిదానికై ప్రాకులాడరు; పోయినదానికి విచారింపరు. ఆపదవచ్చినను గలఁత నొందరు. కావున నీవెప్పుడు నుత్సాహముఁ గోలుపోవకుము. శాస్త్రములెన్ని చదివినను క్రియాశూన్యునిఁ బండితుఁ డనుట చెల్లదు. ఔషధమెంతమంచి మందైనను పేరుచెప్పినంతమాత్రాన రోగులకు సుఖమొసఁగదు గదా! ఉత్సాహములేనివానికిఁ బాండిత్యము గ్రుడ్డివానికిఁ దనచేతియందలి దివ్వియవలె నిరుపయోగము. కావున నోరిమి వహింపుము. పరస్థలమునకు వచ్చితినని చింతింపకుము.

రాజు, కులస్త్రీ, మంత్రులు, దంతములు, కేశములు, నఖములు, నరులు స్థానభ్రష్టులైన శోభింప రను వాక్యము కాపురుషుల విషయమున మాత్రమే వర్తించును. సింహములు, సత్పురుషులు, గజములు, సర్వదేశములందు సంచరించి కీర్తినొందుట లేదా? మఱియుఁ గాకములు, మృగములు, కాపురుషులు స్థానమునుండి కదలఁజాలక యచటనే నశింతురు. అభిమానధనుఁడగు వీరునకుఁ దనదేశమనియుఁ బరదేశమనియు భేదములేదు. ఎచటికేఁగిన నచటనే తనసామ

ర్థ్యముచేత ఖ్యాతిఁగాంచును. నిండిన చెఱువును మండూక ములు సేరినట్లు సర్వసంపదలు నుత్సాహవంతుఁడగు పురుషునిఁ బొందును.

దేహికి సుఖదుఃఖములు కాలక్రమమున సంభవించుట సహజము. సంపదగలిగినపుడు గర్వము, నాపద గలిగినపుడు ఖేదముఁ దగవు. ధనములేకున్నను వీరుఁడు గౌరవము సంపాదింపఁగలఁడు. ఎంతధనమున్నను నీచునకు గౌరవ మించుక యైనఁ గలుగదు. కుక్కకు బంగరునగ లెన్నితొడిగినను సింహమునకుండు సహజతేజస్సు గలుగదు గదా! మేఘముల చాయయు, ఖలుల ప్రీతియు, యౌవనము, ధనముఁ గొలఁది కాలముమాత్రము నిలిచియుండును. పుట్టించినప్రాణు లందఱకు నాహారము దేవుఁడే యేర్పఱుపక మానఁడు. కాఁబట్టి యాహారమునకై యంతప్రయాసపడ నక్కఱలేదు. ధనము లేవిధమునఁ జూచినను దుఃఖ కారణములే యగుచున్నవి. ముందు ముందు సంపాదించుట కష్టము. పిదప దానివలనఁ గలుగు గర్వము కలిగించు దుఃఖము లనంతములు. సంపాదించిన ధనములకు హాని గలిగిన నెట్టిదుఃఖము గలుగునదియు వర్ణింపఁ జాలము.

ధర్మకార్యములపేరు చెప్పి ధనము సంపాదించుటయు ననవసరము. అడుసు ద్రొక్కనేల? కాలుకడుగనేల? ఆకసమునఁ బక్షులచేతను, నేలమీఁదఁ బులులచేతను, జలములందు మకరములచేతను నామిషము భక్షింపఁ బడుచుండును. ధనికు

నందఱు నన్నివిధముల వేధించుకొని తినుచుండుదురు. దేహిని మృత్యువు బెదరించునట్లు, రాజు, జలము, నగ్ని, స్వజనులు ధనికు నెల్లపుడును బాధించుచుందురు. ధన సంపాదనమే కష్టము. ఆర్జించిన దానిం గాపాడుకొనుట మఱియుఁ గష్టము. దానికి హాని గలిగెనా మృత్యుబాధ గలుగును. కావున దానిపై నాశవీడుట మేలు. తృష్ణ ప్రసరించినవాని శిరముపై దాస్యము తాండవించుచుండును. అది వీడిననాఁడు ధనికుఁడనియు, దరిద్రుఁడనియు భేదభావము గలుగదు. నెఱవేఱుచున్న కొలఁదియుఁ గోరికల కంతమే యుండదు. కావున నిచ్చట నుండి కాలము గడవుము.” ఈవిధముగాఁ బలికిన మంథరుని మాటలు విని లఘుపతనకుఁ డిట్లనెను.

“మంథరా! ధన్యుఁడ నైతివి. నీగుణములు కొనియాడదగినవి. బురదలో దిగఁబడిన యేనుగులను లేవనెత్తుట కేనుఁగులే సమర్థము లయినట్లు సత్పురుషుల కాపద గలిగినపుడు సన్మిత్రులే దానినిఁ దొలఁగింపఁగలరు. మహాత్ముల స్నేహము లామరణాంతములు; కోపములు క్షణికములు; త్యాగములు జంకులేనివి. యాచకుని, శరణాగతుని, నెవరు నిరాశతో వెడలింపరో వారే సకలగుణములకు నాలవాల మగుదురు.”

## చిత్రాంగుని చేరిక

అనంతరము మంథరాదులు ముప్వురును హాయిగాఁ గాలక్షేపము సేయుచుండిరి. ఇట్లుండగా నొకనాఁడు చిత్రాంగుఁ

డనెడి లేడి యొక వేటకానిచేఁ దఱుమఁబడి యచటికిఁ బరువెత్తు కొని వచ్చెను. అదిచూచి భయపడి మంథరుఁడు జలములోఁ బ్రవేశించెను. మూషికము కలుగులోనికిఁ బాఱిపోయెను. వాయసము చెట్టుమీఁది కెగిరి నలువైపులు చాలదూరము పరికించి భయమునకుఁ గారణమేమియులేదని తెలిసికొని మంథర హిరణ్యకులకుఁ దెలిపెను. మరల ముప్పురుఁ గూడుకొనిరి. అపుడు వణఁకుచు నచటనున్న మృగముం జూచి మంథరుఁడు "నీ వెవఁడవు? ఏల యిచటికిఁ బాఱి వచ్చితివి?" అని యడుగఁగా, "వేటకాఁ డొకఁడు తఱుముచుండఁగా భయపడి తప్పించుకొని వచ్చి మీ శరణముఁ జొచ్చితిని. మీ చెలిమి గోరుచుంటిని." అని యా హరిణము బదులు పలికెను.

అపుడు హిరణ్యకుఁడు "మిత్రమా! స్వాగతము. స్వేచ్ఛముగా మాతోఁబాటు స్వగృహమునందువలెనే సంచరింపుము" అని పలికి, యది యాహారపానీయములు దీసి కొని నెమ్మదించిన తర్వాత "సఖుఁడా! నిర్జనమైన యీ వనమున నిన్నెవరు తఱుముకొని వచ్చిరి? వేటకాం డ్రెవ్వరైన నపుడపు డచట సంచరింతురా?" యని యడిగెను.

దానికి మృగ మిట్లు చెప్పెను. "కళింగదేశమున రుక్మాంగదుఁ డనుఁరాజు గలఁడు. ఆతఁడు దిగ్విజయమును గోరి వచ్చి చంద్రభాగానదీతీరమున సేనలను విడియించెను. ప్రాతఃకాలమున నాతఁడు కర్పూరసరస్సునొద్దకు రాఁగలఁడని

వదంతి వినఁబడుచున్నది. ప్రాతఃకాలమున నీక నిట నుండుట మంచిదిగాదు. ఏమిచేయఁదగునో యాలోచింపుఁడు."

లేఁడి మాటలు విని మంథరుఁడు భయపడి మఱియొక చెఱువునకుఁ బోవుద మని పలికెను. కాకియు, మృగమును 'సరే' యనెను. వారి మాటలు విని హిరణ్యకుఁడు నవ్వి "మఱియొక జలాశయమునకుఁ బోయినయెడలఁ గుశల మని మంథరుఁడు చెప్పినది సత్యమే. కాని మెట్టదారిఁ బయనము సేయుట ప్రమాదకరము గాదా? జలజంతువులకు నీరును, దుర్గనివాసులకు దుర్గమును, శ్వాపదాదులకు స్వస్థలమును, రాజునకు సన్మంత్రియు బలము గదా? దూరాలోచనలేని కార్యమునకుఁ బూనుకొన్నయెడలఁ బిమ్మట విచారింపవలసి వచ్చును. ఈ యర్థమును దెలుపు కథ యొకటి గలదు. వినిపించెదను. వినుఁడు" అని యిటులా కథ చెప్పఁదొడఁగెను.

## దూరాలోచన లేక ముంగిసను జంపి విచారించిన బ్రాహ్మణుని కథ

గౌడదేశమునం దొక యగ్రహారమున దేవశర్మ యను బ్రాహ్మణుఁడు గలఁడు. ఆతని భార్య యజ్ఞసేన. సంతానము లేకలేక కొంతకాలమున కామె గర్భవతి యయ్యెను. దానికా బ్రాహ్మణుఁడు మిగుల సంతోషించి కోరిక లీరికలెత్తగా "ఓప్రియురాలా! నీగర్భమునందున్న కుమారుఁడు మన కులమెల్ల నుద్ధరింపఁగలఁడు. మహాభాగ్యవంతుఁడు కాఁగలఁడు."

అని పలుకఁగా విని యజ్ఞసేన, "నాథా యిటువంటికోరికలు గోరుట మంచిదిగాదు. అనాగతకార్యములను గుఱించి యెవఁడు చింతచేయునో వాఁడు సోమశర్మ తండ్రివలె విషాదము నొందును. మీకాకథ దెలుపుదు వినుఁడు.

## సోమశర్మ తండ్రి కథ

ఒకానొక బ్రాహ్మణకుమారుఁడు విద్యాభ్యాసము చేయుచు నొక బ్రాహ్మణుని యింటఁ దద్దినపు భోజనముచేసి వచ్చుచుండెను. ఆతనికి వారు కొంత పేలాలపిండి యొసఁగిరి. ఆతఁ డది యొక కుండలో నుంచుకొని తనయొద్దఁ బెట్టుకొని భుక్తాయాసము దీఱుటకై యొక యరగుమీఁదఁ బండుకొని నిదురవోయెను. అపుడు మితిలేని కోరిక లాతని మనసునఁ గలుఁగ జొచ్చెను.

"ఇపుడు నాదగ్గఱఁ బేలాలపిండి యున్నదిగదా! నేను దీనిని విక్రయించి యొక పాడిమేకను గొనియెదను. దానికి రెండు పిల్లలు గలుగును. ఆ రెండును గొంతకాలమునకు రెండేసి పిల్లల నీనును. ఆ నాలుగింటికి నెనిమిది పిల్లలు పుట్టును. ఈ విధముగాఁ గొంతకాలమునకు వేలఁకొలఁదియు మేఁక లగును. తరువాత వాని నమ్మి నూఱావులఁ గొందును. అవి ప్రతి సంవత్సరము నీనుచుండును. కొన్ని సంవత్సరములకు వేలకొలఁది సంఖ్యగల యావులతోను, బెయ్యలతోను, కోడెల తోను దొడ్డి నిండియుండును. కొన్నికోడెల నరకలు గట్టించి

దున్నించి విస్తారమయిన పంట పండించి యాధాన్యముల నమ్మి వేయుచుందును. కొన్ని కోడెలను విక్రయించి మఱికొంత ధనము సంపాదింతును.

ఈప్రకారముగా సంపాదించిన ధనముం జూచి 'నీకుఁ గన్యనిచ్చెద' మని యనేకులు వచ్చెదరు. వారిలోఁ గులంబును రూపంబును, గుణమును గలిగిన కన్య నెంచికొని పెండ్లియాడి యామెతో సంసారము చేయఁగా నొకకుమారుఁడు పుట్టును. ఆబాలునకు సోమశర్మయని పేరువెట్టుదును. కొన్ని నెలలయిన తరువాత వానికి బంగరు మువ్వలమొలత్రాడు, రావిరేక మురుగులు, గొలుసులు, అందెలు మొదలయిన నగలుపెట్టి యాదరముతోఁ జూచెదను. వాఁ డాడుకొనుచు నల్లరిచేయు సమయమున నేను పనితొందరలోనుండి పిల్లవానిం దీయుమని నాభార్యను. బిలిచెదను ఆమెయు నేదోపనిలోనుండుట వలన నాలస్యము గావచ్చును. ఆలస్య మైనందులకుఁ గోపగించి యామె నీకఱ్ఱతోఁ గొట్టెదను" అని యాలోచించుచుఁ బేల పిండి తినుటకుఁ గుక్కలు మొదలగునవి రాకుండ బెదరించుటకు దగ్గఱనుంచుకొన్న కఱ్ఱగిరగిరఁ ద్రిప్పికొట్టెను. ఆదెబ్బతగిలి పేలపిండి యున్నకుండ పగిలిపోయి పిండియంతయుఁ జెదరి మంటిపాలయి పోయెను. దానితో మెలఁకువవచ్చి, జరిగినది తెలిసికొని యా బ్రాహ్మణ కుమారుఁడు మిక్కిలి విషాదము నొందెను. కాఁబట్టి యనాగతకార్యముల గుఱించి చింతింప

రా దంటిని" అని చెప్పిన భార్యమాటలు విని దేవశర్మ కొంచెము సిగ్గుపడియూరకుండెను.

తరువాతఁ గొన్ని దినములకు యజ్ఞసేన శుభలక్షణములతోఁగూడిన కుమారునిఁ గనెను. కొన్నాళ్ళయినపిమ్మట నొకనాఁడు పర్వదినమగుటచేత నామె కుమారునిఁ బెనిమిటి కప్పగించి నదికి స్నానమునకుఁ బోయెను. ఆమెనది కేఁగిన వెంటనే యాదేశము నేలు రాజా యగ్రహారమందలి బ్రాహ్మణులను దాన మిచ్చుటకై పిలువనంపెను. బ్రాహ్మణులు కొందఱపుడు దానము గ్రహించుటకై వెళ్ళుచుండిరి.

వారిం జూచి దేవశర్మ యిట్లు చింతించెను. "అయ్యో నేఁడు నాభార్యను స్నానమున కెందుల కంపితిని? నేను రాజదర్శనమునకుఁ బోయినచో నిపు డీ శిశువు నెవ్వరు గాపాడుదురు? 'రాజు నన్నెపుడు పిలుచును? ఎపుడు దాన మిచ్చును? ఎపుడు భాగ్యవంతుఁడ నగుదును?' అని చిరకాలమునుండి నిరీక్షించుచుంటిని. ఇపు డవకాశమురాఁగా వెడలుటకు వీలులేక పోవుచున్నదే!" ఇట్లు విచారించి యించుకసే పాలోచించి, చాలకాలము నుండి బిడ్డనువలెఁ బెంచిన ముంగిసను బాలునియొద్దఁ గావలియుంచెదనని నిశ్చయించి దానినిఁ బిలిచి 'నీ విచటనుండి యీ శిశువును గనిపెట్టుచుండు' మని సంజ్ఞాపూర్వకముగాఁ దెలిపి, దానిని ద్వారమందు నిలిపి రాజభవనమునకుఁ బోయెను.

బ్రాహ్మణుఁ డట్లు వెడలిన తరువాత నొక నల్లత్రాచు శిశువు చెంతకుఁ బ్రాకిపోవుచుండెను. ముంగిస యదిచూచి సర్పముమెడఁబట్టి కోటికి చంపివై చి దానిశరీరమును ముక్కలు ముక్కలుగాఁ జేసివై చెను. నోటినిండఁ, దనదేహమునిండఁ బాము రక్త మెఱ్ఱగా నిగనిగలాడుచుండగా నాముంగి మరల ద్వారము నొద్దకు వచ్చి నిలిచెను.

అచట నాదేవశర్మ రాజొసఁగిన విలువ గ్గైన దానముఁ బుచ్చుకొని బిడ్డ యేమయ్యెనో యని తలఁచుకొనుచు మిక్కిలి త్వరితముగా నింటికి వచ్చెను. వచ్చియురాఁగానే నెత్తుటితో నిండియున్న ముంగి తన విధిని జయప్రదముగా నెఱవేర్చితి నన్న గర్వముతో యజమానుని పాదముల కడకుఁ బరుగిడెను. ఊయలలోను, దాని శరీరమునను గల రక్తము కంటఁబడఁ గానే యాముంగిస దన బిడ్డను గొఱికివై చినదని యెంచి యా బ్రాహ్మణుఁడు కోప మాపుకొనలేక యచటనున్న రోకటితో గొట్టి దానిం జంపివై చెను. అనంతర మాతఁ డూయెలదగ్గఱకు బోయి సంతసముతోఁ గాలుసేతు లాడించుచు నవ్వుచున్న తనబిడ్డను గనుఁగొనెను. ప్రక్కను తునుకలుగాఁ జేయబడి యున్న సర్పమును గాంచెను. వెంటనే జరిగిన సంగతి గ్రహించి గుండెలు బాదుకొనుచు 'మందబుద్ధినగు నేను బాగుగా నాలో చింపక తొందరపడి దారుణము గావించితి' నని విలపించు చుండెను. ఇంతలో యజ్ఞసేన స్నానము చేసివచ్చి జరిగినది

తెలిసికొని విచారించెను. కావున నేపనియు దూరమాలోచింపక చేయరాదు.''

హిరణ్యకుఁ డీవిధముగా నెంతచెప్పినను వినక భయముచేత మంథరుఁడు మఱియొక చోటునకుఁ బోవుటకే నిశ్చయించి పయనమాయెను. స్నేహవశమున హానిని శంకించుచు హిరణ్యకాదులును వెంట నేఁగుచుండిరి. అట్లు నేలమీఁదఁ బ్రయాణము సేయుచుండఁగా నొకవేటకాఁడు చూచి మంథరునిఁ బట్టుకొని వింటికొనకుఁ గట్టివైచి తిరిగి తిరిగి యాఁకలిగొని యింటికి మరలిపోవుచుండెను. వెంటనున్న మృగవాయసమూషికము లీసంగతి చూచి మిక్కిలి విషాదమొంది వేటగాని ననుసరించి పోవుచుండెను. అట్లు పోవుచు హిరణ్యకుఁ డిట్లు చింతించెను.

"ఒక దుఃఖము ముగియులోపలనే మఱియొక దుఃఖము సంప్రాప్తమయ్యెను. సందు దొరకినపుడే యనర్థములన్నియు నొకదానివెంట నొకటి వచ్చి మీఁదఁబడును. ఆపద గలిగినపుడు ప్రాణములు సయితము లెక్కసేయక కాపాడు సన్మిత్రుఁడు మహాభాగ్యమువలనఁ గాని లభింపఁడు. శోకము నుండియు, శత్రువుల నుండియుఁ గాపాడునట్టియుఁ; బ్రీతి విశ్వాసములకుఁ బాత్రుఁడు నగు 'మిత్రుఁడు' అను నక్షరత్రయము తోడి రత్న మెవరివలన సృష్టింపఁబడెనో కదా! సన్మిత్రుని యందుండు నమ్మకము తల్లియందును, దండ్రియందును, భార్య

యందును, సోదరునియందును గుమారుని యందును గూడ గలుగదు.

ఇదియంతయు దైవకల్పితము. పూర్వకర్మవలని ఫలము మంచిదైనను, జెడ్డదైనను ననుభవింపక తప్పదు. శరీరమున కెల్లపుడు నపాయము సిద్ధము. సంపద లాపదలకు మూల ములు. స్నేహము లనిత్యములు. జనించిన దేదియు నశింపక మానదు.

ద్రవ్యాభిలాషచే సంపద గలిగినపు డందఱును మిత్రు లగుదురు. సుఖమునందువలె దుఃఖమునందును బాలుపంచు కొనువాఁ డెవ్వఁడో వాఁడే నిజమగు మిత్రుఁడు. దీనికి విపత్తులే నికషోపములు.'' ఇట్లు విచారించి చిత్రాంగ లఘుపతనకులతో నిట్లనియెను.

"ఇంక విచారించుచు నూరకుండిన లాభములేదు. బోయవాఁ డీ యడవి దాటకముందే మిత్రుని విడిపింపవల యును. నాకొక యుపాయము తోఁచుచున్నది. చెప్పెదను. వినుఁడు. చిత్రాంగుఁడు కిరాతకుఁడు పోవుమార్గమున నొక మడుగుచెంతఁ జచ్చినట్లు పడియుండవలయును. కాకి చిత్రాం గునిపై వ్రాలి ముక్కుతోఁ బొడుచుచున్నట్లు నటింపవల యును. ఈ బోయ మృగము చచ్చి పడియున్నదని తలఁచి తప్పక మంథరు నచట విడిచి మృగమును గ్రహించుటకై ప్రయత్నపడును. నే నపుడు క్షణములో మంథరుని బంధములు

దెగఁగొఱుకుదును. అపు డాతఁడు నీటిలోఁ బ్రవేశించును. బోయ మిమ్ము సమీపించు సరికి వేగముగాఁ బాఱిపొండు" అని చెప్పఁగా నవి రెండును నట్లే కావించెను.

కిరాతుఁ డలసినవాఁడై పానీయముల ద్రావి యామడుగుదరి నున్న చెట్టునీడ యందుఁ గూరుచుండి యాహారిణముం గాంచి సంతసమంది దాని దరికేఁగెను. హిరణ్యకుం డంతలో వచ్చి మంథరుని బంధములు గొఱికివేయఁగా నాతఁడా జలములలోఁబడెను. బోయ సమీపించుసరికి లేఁడిలేచి వేగముగాఁ బాఱిపోయెను. ఆవ్యాధుఁ డిదియంతయుఁ జూచి "సిద్ధించిన దానిని విడిచి యెవ్వఁడు మఱొకదానికై లోభపడునో వాఁడు తుదకు 'రెండింటికిం జెడిన రేవఁ' డగును అని విచారించి నిరాశుఁడై యింటికిఁ బోయెను. మంథరాదులందఱు నీవిధమున నాపదనుండి తప్పించుకొని సుఖముగా నుండిరి.

రాజపుత్రులారా! మీరును సుజనులగు మిత్రులను సంపాదించి మీరు మేలొంది లోకమునకు మేలుగూర్చుఁడు" అని విష్ణుశర్మ చెప్పఁగా వినివారు కడుంగడు మోదమొందిరి.

---

# మిత్రభేదము

అనంతరము రాజపుత్రులు విష్ణుశర్మతో "ఆర్యా తమదయవలన మిత్రలాభము వినియుంటిమి. ఇఁక మిత్రభేదము వినఁ గుతూహలముతో నుంటి" మని పలికిరి. విష్ణుశర్మవారి కిట్లు చెప్పఁదొడఁగెను

"దక్షిణ దేశమున సువర్ణ పురమను నగరముగలదు. ఆనగ రమున వర్ధమానుఁడను వణిజుఁడు నివసించుచుండెను. ఆతఁడు ధనికుఁడే యైనను దనకంటె నైశ్వర్యవంతులయిన బంధువులను జూచి వారికంటె నెక్కువ ధనము సంపాదింప వలయునని యూహించెను. తనకంటెఁ దక్కువవానిఁ జూచిన నెవ్వఁడైన నధికుఁడే యగును. తనకంటె నధికులను గుఱించి యాలో చించినపు డెంతవాఁడైనఁ దాను దరిద్రుఁడుగనే యుండును.

"మహాపాతక మొనరించినను ధనముగల నరుఁడు పూజింపఁబడును. చంద్రునివలె స్వచ్ఛమయిన వంశమునఁ బుట్టిన వాఁడైనను నిర్ధనుఁడు నిరాదరింపఁ బడును. కావున ధర్మముదప్పని యేమార్గముననైన ధనము సంపాదింపవల యును. ధర్మార్థకామమోక్షము లనెడి నాలుగు పురుషార్థముల లోపల నర్థమే ముఖ్యమయినది. అట్టిధనము సంపాదించి దానిం గాపాడి పెంపొందింప వలయును. పెంపొందిన దానిని సరియైన విధమున నుపయోగింపవలయును.

ధన ముండియు సరిగాఁ గాపాడకున్నచో నది నశించి పోవును. లభించినధనము వృద్ధినొందింపని యెడలఁ గొంచెముగా ఖర్చుపెట్టుచున్నను గాటుకవలె హరించిపోవును. ధనముండియు ననుభవమునకు రానిచో నది నిరుపయోగము దానభోగముల కుపయోగింపని ధనమును, శత్రువిజయము సంపాదింపలేని బలమును, ధర్మమాచరింపని వాని పాండిత్యమును, నింద్రియజయములేనివాని బుద్ధివిశేషమును నిరుపయోగములు.

జల బిందువులను సేకరించుటవలన ఘటము పూరింపఁబడునటులు సకలవిద్యలు, ధర్మము, ధనము క్షణక్షణముఁ గణము కణముచొప్పున సంపాదింపవలయును. దానోపభోగములు లేక రోజులు వెళ్ళఁబుచ్చువాఁడు చర్మముతోఁ జేయఁబడిన కొలిమితిత్తివలె శ్వాసగలిగియున్నను జీవములేనివాఁడే.

అట్టిధనము సంపాదించు మార్గములలో వాణిజ్యమే యుత్తమ మయినది. అవసరమయిన యెడల దూరదేశముల కేఁగియైన వాణిజ్యము చేయవలయును. ఆలస్యము, స్త్రీసేవ, రోగము, జన్మభూమి విడువకుండుట, యల్పసంతుష్టి, భయము నను నవి యభివృద్ధికిఁ బ్రతిబంధకములు.” ఈవిధముగ నాలోచించి వర్ధమానుఁడు వాణిజ్య మొనరించి విశేషధనము సంపాదింప నిశ్చయించుకొనెను.

ఒక మంచిముహూర్తమున నందక సంజీవకము లనెడి రెండెద్దులను గట్టించి వర్ధమానుఁడు బండి సిద్ధము చేయించెను.

కాశ్మీర దేశమునఁ దక్కువగానుండి తన దేశమునఁ బుష్కలముగా నుండు విలువగలయెన వస్తువులను సేకరించి తన బండియం దుంచుకొనెను. ఇంకను విస్తారమయిన పలురకములయిన వస్తువులను సంపాదించి పెక్కు బండ్లనిండ వేయించెను. మరికొన్ని సామగ్రులను కావళ్ళతోఁ గొనిరా సేవకులను నియోగించెను. ఈవిధముగాఁ దగుపరివారమును గూడబెట్టుకొని వర్ధమానుడు వాణిజ్యమునకై కాశ్మీర దేశమునకుఁ బయనమాయెను. సమర్థులకుఁ జేయరాని పనియు, నుద్యోగులకు దూరభూమియుఁ, బండితులకుఁ బరదేశమును, బ్రియమైన మాటలాడువారికి శత్రువులును గలుగరు.

వర్ధమానుడటులు బయలుదేఱి సుదుర్గపర్వత సమీపమందలి యడవి మీఁదుగాఁ బోవుచుండెను. ఆ యరణ్యప్రదేశమున దారి సమముగా నుండక మిట్టపల్లములుగా నుండుటవలన నొకచోట సంజీవకము కాలుజాఱి పడిపోయెను. ఈవిధమునఁ గాలు విఱిగి పడిపోయిన సంజీవకముం జూచి వర్ధమానుడిట్లు చింతించెను.

"పురుషుఁడెంతప్రయత్నముఁ జేసినను దైవానుకూల్యమును బట్టియే యది ఫలించుచుండును. ఊరక విచారించిన నించుకంతయుఁ బ్రయోజనములేదు. కావునఁ బురుషుఁడు వృథావిచారము మాని కార్యసిద్ధికై మరలమరల యత్నింపవలయును." ఇట్లు నిశ్చయించి సంజీవకము కాడికట్టు వదలించి సేవకులను బంపి యచ్చటికి సమీపమునసున్న ధర్మపుర

మను గ్రామమునుండి బలిష్ఠమైన యెద్దును గొని తెప్పించి దానిని బండికిఁ గట్టించుకొని సంజీవకము నచ్చట దిగవిడిచి ముందునకు సాగిపోయెను.

సంజీవకము దైవవశమునఁ గ్రూరజంతువుల బారిఁ బడక యచటి పచ్చికఁ దిని, సమీపమందలి వాగులోని నీరు ద్రావి క్రమక్రమముగాఁ గాలినొప్పి తగ్గి విఱిగినకాలు తిన్నఁబడి యిటునటుం దిరుగులాడఁ జొచ్చెను. ఆయువు గట్టిగా నున్నయెడల సముద్రమున మునిఁగినను, బర్వతము మీఁది నుండి పడినను, మహాసర్పముకాటు దిన్నను బ్రాణములు పోవు. కాలము రానంతవఱకు బాణశతములచేఁ గొట్టినను చావు గలుగదు. కాలము సమీపించినపుడు దర్భముల్లు తాఁకినంత మాత్రముననే ప్రాణము లెగిరిపోవును. దిక్కులేక యడవియందు విడువఁబడిన వాఁడైనను నెట్లో జీవించును. దైవము సాయపడనిచో నింటియందు సకలోపచారములు నుండియు మరణించును.

కొంతకాలమైన పిమ్మట సంజీవకము స్వేచ్ఛగా విహరించుచు బలిసిన శరీరము గలది యయ్యెను. ఒక్కనాఁ డుత్సాహాతిశయమున గుహలు ప్రతిధ్వనించునట్లు మిక్కిలి గట్టిగా అంకె వైచెను.

ఆవనమునఁ బింగళకుఁడను నొక సింహము కలదు. అది తనబలముచేత నచటి జంతువు లన్నిటిని లోఁబఱచు

గొని సుఖముగా నా యడవి నేలుకొనుచుండెను. ఆసింహ మానాఁడు దప్పిగొని పానీయములు ద్రావుటకై యమునా నదికిఁ బోవుచు సంజీవక మొనరించిన యకాల మేఘ గర్జనమువంటి యఱపువిని భయపడి పానీయములు గ్రోలకయే వెనుకకు మరలి తనతావునకుఁ బోయి "ఇది యేమై యుండు" నని యాలోచించుచు విన్నఁబోయి యుండెను.

ఆవనములోనే నివసించుచున్న కరటక దమనకము లనెడి రెండు జంబుకములు పింగళకుఁడు నీరు ద్రావఁబోయి భయపడిన విధము గమనించినవి. అందులో దమనకుఁడు కరటకునిఁ జూచి "సఖుఁడా! మన రాజైన పింగళకుఁడు దప్పిగొనియు జలములు గ్రోలక వెనుదిరిగి పోయి వెఱపుతో నుండెను. కారణ మేమియై యుండును? విషయముఁ గనుఁగొని యాతని భయము మాన్పి యాతని యాశ్రయము సంపాదింప వీలు పడునేమో?" అనఁగాఁ గరటకుఁడు "మన మాతని సేవించుట లేనపు డాతని చేష్టలు విమర్శించుట మన కనవసరము. మఱియు నీరాజు, పూర్వ మీతని సేవలు చేయునపుడు నిరపరాధులమగు మనల నవమానించి యున్నాఁడు. జీవనార్థియై పరులను సేవించుటలో ననుభవించు శీతవాతాతపక్లేశములో నాల్గవపాలు సహించి, తప మొనరించి సుఖము పడయ వచ్చును. ఎవరి జీవనము పరుల కధీనమై యుండదో వారి జన్మము సఫలము. పరాధీనులై జీవించుటకంటె మరణించుటమేలు. 'లెమ్ము, రమ్ము

పొమ్ము, మాటాడకుము, చెప్పుము ' అని సేవకులను రాజులు బాధించుచుందురు. పణ్యస్త్రీలవలె మూర్ఖులు ధనలాభము కొఱకు మాటిమాటికిఁ దమ యాత్మను సంస్కరించి సంస్కరించి పరుల కుపకరణము గావింతురు. సహజముగాఁ జంచలముఁ, దగని విషయములపైఁ బ్రసరించు నదియు నగు యజమానుల దృష్టిని సేవకులు కడుంగడు గౌరవించు చుందురు.

ఔన్నత్యముం గోరి యడఁగి యుండవలయును. జీవన ముంగోరి ప్రాణములు విడచుట కైనను సిద్ధపడవలయును. సుఖముంగోరి దుఃఖముఁ దెచ్చి పెట్టుకొనవలయును. ఇట్టివిధ మున సేవకుఁడు కాఁగోరు మూఁఢు డెవ్వ డుండును" అని పలుకఁగా విని దమనకుఁ డిట్లనెను.

"మిత్రుఁడా ! అట్లనుట యుచితముగాదు. సంతుష్టి నొంది సకలమనోరథములు దీర్పఁగల ప్రభువులను సేవించు టలోఁ దప్పేమియు లేదు. రాజులకు శ్వేతచ్ఛత్రము, హస్తి తురగాది సైన్యము, చామర వీజనాది సంపదలు ప్రజాసేవను బట్టియేకదా లభించుచుండును ? " అన, విని మరలఁ గరటకుఁ డిట్లనెను.

"ఏమయినను నది మనపనిగాదు. సంబంధము లేని పనికి సిద్ధపడినవాఁడు మేఁకు నూడఁబెఱికిన కోతివలె మృతి నొందుట నిజము. నీకా కథ చెప్పెదను, వినుము.

## మేకను బెఱికి మరణించిన కోఁతి కథ

మగధ దేశమునందు శుభదత్తుఁడను నొక వైశ్యుఁడు గలఁడు. చాలకాలము వఱ కాతనికి సంతానము గలుగలేదు. అందువలన నాతఁడు సప్తసంతానములలోనివి యైన దేవాలయనిర్మాణము, చెఱువులు త్రవ్వించుట, చెట్లునాటించి వన మహోత్సవము చేయుట మున్నగు పుణ్యకార్యములందుఁ దన ధనము వెచ్చించుచుండెను.

ఒకనాఁ డొక దేవాలయము శిథిలమై యుండుటఁ గాంచి దానిని బాగుచేయించుట కావైశ్యుఁడు పూనుకొని తగిన శిల్పులను, బనివాండ్రను నేర్పఱచెను. ఒకనాఁడు వడ్రంగి యొక చేవదూలమును బనివాండ్రచేఁ గోయించుచు నది సులభముగాఁ జీలుటకై యచటనచటఁ గొయ్యమేకులు దిగఁగొట్టించెను. అంతలో వేళదాటుటచేతఁ బనివారందఱు దమతమ యిండ్లకుఁ బోయిరి.

ఇంతలో నొక కోఁతులమంద యచటికి వచ్చి దేవాలయపు గోడలమీఁదను సమీపమందలి చెట్లమీఁదను విహరించుచుఁ బెక్కు రకములుగాఁ జేష్టలు చేయుచుండెను. వానిలో నొకకోఁతి మేకులు దిగఁగొట్టియున్న దూలము నొద్దకు వచ్చి దానిపై గూరుచుండి కొయ్యమేకు రెండు చేతుల తోడను గట్టిగాఁ బట్టుకొనియెను. అపుడాఁకోఁతి తోఁక దూలపు నెఱియలోఁబడి వ్రేలాడుచుండెను. ఆకోఁతి సహజముగు చప

లత్వముచేత మేకును బలవంతముగా నూడఁబెఱికెను. నెఱి యలోఁ జిక్కుకొనియున్న తోఁక నలిగివెంటనే యాకోఁతి బాధతో నఱచుచు మరణించెను. కావున మనకు సంబంధము లేని పనికిఁ బోరాదు. ”

కరటకుఁ డిట్లు చెప్పఁగా దమనకుఁడు, “స్వామి కార్యమునెడ నుపేక్షింపరాదు. ఒకవు డాతఁడు మనల నెట్లు చూచినను నాతఁడు మనకుఁ బ్రభువు కాకపోఁడు” అని పలు కఁగా మరలఁ గరటకుఁడు “ఆపని రాజోద్యోగులది. మన మిపుడు రాజోద్యోగులము గాము. కానవు డితరుల యధి కారము పయిఁ బెట్టుకొనఁ గూడదు. పరుల యధికారము మీఁదఁ బెట్టుకొనువాఁడు కుక్క మొఱుగుటకు బదులుగా నోండ్రవెట్టి దెబ్బతిన్న గాడిదవలె హాని నొందును. నీకా కథ చెప్పెదను ; వినుము.

## పరుల యధికారము మీఁదఁ బెట్టుకొని మరణించిన గాడిద కథ

వారణాసి యందుఁ గర్పూరపటుఁ డను నొక చాకలి గలఁడు. వాఁడొక నాఁటి రాత్రి, పగలంతయు బట్ట లుదికిన బడలికచేత నొడలెఱుంగక నిదురించుచుండెను. అర్ధరాత్ర మున వాని యింటియం దొక దొంగ ప్రవేశించెను. వాని యింటిముందు గాడిద యొకటి కట్టివేయఁబడి యుండెను. ఆ యింటి కావలికుక్కయు నచటనే కూరుచుండి యంతయు జూచుచుండెను.

అపు డచటి గాడిద కుక్కతో “సఖుఁడా! దొంగ యింటఁ జొచ్చుట చూచి యుంటివి గదా! గట్టిగా మొఱిగి యజమానుని మేల్కొల్పుటకుఁ బ్రయత్నింపవేలఁ? ఇది నీపని కాదా?” యన శునక మిట్లనెను. “నావిధిని గుఱించి చర్చింప నీకేమి యవసరము? నీవేమి యెఱుఁగుదువు. రాత్రియుఁ బవలుఁ గష్టమనక యీయిల్లు గాచుకొని యుందును. యజమానుఁడు నాయుపయోగముఁ గొంచెమైనను గ్రహింపకున్నాఁడు. నా కాహార మవసర మనెడి యూహాయే యాతనికి లేదు. అవసరము లేనపు డధికారులకు సేవకులయం దాదరము తొలఁగి పోవుటలో నాశ్చర్య మేమున్నది?”

ఆ మాటలు వినుసరికి గార్దభమునకుఁ గోపము వచ్చెను. “పని గలుగునపుడు లంచమడుగు భృత్యుఁడు, మిత్రుఁడు నీచులు” అని పలుకఁగాఁ “గార్యకాలమున మాత్రమే భృత్యులయం దాదరముఁ జూపు ప్రభువు యోగ్యుఁ డెట్లగు” నని శునకము గార్దభమును బ్రశ్నించెను.

దానికా గాడిద మఱింతగాఁ గోపించి “యాపత్కాలమున స్వామికార్యము విడనాడు నీవు పాపాత్ముఁడవు. పోనిమ్ము. నీతోడనే యున్నదా? ఏలికను లేపి నాఋణముఁ దీర్చుకొందును.” అని పలికి గట్టిగా నోండ్రపెట్టెను. ఆధ్వనికి గాఢ నిద్రలోనున్న రజకుఁడు మేలుకొని నిద్రాభంగమైనదని కోపించి యొకబడియ చేతఁబట్టుకొని తిన్నగా గాడిద యొద్దకుఁ

బోయి దానిం జావమోదెను. ఆదెబ్బ లాయువుపట్టునఁ దాఁకి వెంటనే యది మరణించెను. కావునఁ 'బరుల యధి కారము మనకేల?' యని పలికితిని. చచ్చిన పసరముల వెదకి కొనుటయే మనపని. మనకు గావలసినంత తిండి దొరకును. పోవుదము రమ్ము." అని కరటకుఁడు చెప్పినదంతయు విని దమనకుఁ డిటు లనియెను.

"ఏమీ! తిండికొరకే కేవలము రాజును సేవింప వలయుననియా నీ యుద్దేశము? నీవు చెప్పినది మిక్కిలి యనుచితము. మిత్రులకు మేలును, విరోధులకు హానియుఁ జేయఁదలఁచి బుద్ధిమంతులు రాజు నాశ్రయింపఁ గోరు చుందురు. ఏదోవిధమునఁ బొట్ట నింపుకొనలేకపోవుదుమా? విప్రులకు, బంధుమిత్రాదులకు నుపకారము చేయఁగల జీవితమే ధన్యమైనది. తనపొట్ట నిండించుకొనుటకు మాత్రమే యత్నించు చుండువాని జీవితము నొక జీవితమే యగునా? కాకి కడుపు నింపుకొనుచు నెంతకాలము జీవించిన నేమి ప్రయోజనము.

మాంసములేని వట్టి యెముక దొరకి నంతమాత్రమున నే కుక్క మిక్కిలి సంతుష్టినొందును. జంబుకములుమున్నగు జంతువులు వేలఁకొలఁదియుఁ జెంతఁ దిరుగులాడుచున్నను సింహము వానిదెసఁ గన్నెత్తి చూడక యేనుఁగుల కుంభ స్థలములు చీల్చి మెదడు భక్షించుటకై యత్నించుచుండును. ఎవ్వరైనఁ దమ సామర్థ్యమునకుఁ దగిన ఫలమునే కోరుదురు.

కుక్క తనకుఁ దిండిపెట్టువానిఁ జేరి తోకాడించును. చరణములు చాచి నేలపై బడి కడుపు, నోరుఁ జూపును. ఇన్నిపాట్లు పడినను దాని కొకటి రెండు ముద్దలకంటె నెవ్వరు నెక్కువ పెట్టరు. ఏనుఁగు గంభీరముగాఁ జూచుచు మంచి మాటలచే బతిమాలించుకొనుచు నాహారము గైకొనును. పౌరుష జ్ఞానకీర్తులచేఁ బ్రసిద్ధి నొందినవాని బ్రదుకే బ్రదుకు. ఎంగిలి మెదుకు లేఱికొని తిను కాకి కేమి గౌరవముండును? మంచి చెడ్డ లెఱుఁగక యందఱిచే నిందింపఁబడుచు నుదరపూరణమే ముఖ్యముగాఁ దలఁచువాఁడు పశువుకన్న నధముఁడు."

ఈవిధముగాఁ దమనకుఁ డిచ్చిన యుపన్యాసము విని కరటకుఁడు 'మనము ప్రధానులము గానపు డింతయాలోచనము మన కేల?' యన దమనకుఁ డిట్లు జవాబిచ్చెను.

"ప్రధానులగుట కెంత కాలము గావలయును! తాము గావించు కృత్యములే జనులను గౌరవనీయులగు ప్రధానులు గాను, ఖలులుగాను జేయుచున్నవి. మానవులకు గౌరవాగౌరవములు వారి ప్రవర్తనముం బట్టియే కలుగుచుండును. ఖ్యాతి గాంచుట కష్టము. నిందపడుట తేలిక. బండరాయి కొండ మీఁది కెక్కించుట మహాకష్టము. కొండమీఁదినుండి క్రిందికిఁ ద్రోచివైచుట కడు సులభము. నూయి త్రవ్వువాఁడు చుట్టు బ్రాకార మేర్పఱచుకొనుచుఁ దన చర్యచేతనే క్రమముగాఁ గ్రిందికి దిగిపోవునట్లు మానవుడు తన కృత్యములచేతనే యధఃస్థితిం జెందును."

దమనకుని పలుకులు విని తుదకుఁ గరటకుఁడు "సరే నీమాటలు యుక్తముగనే యున్నవి. ఇపుడేమి చేయవలయు నని నీతలంపు ?" అని యడిగెను.

"మనరాజు నీరుద్రావుటకై యమునకుఁ బోయి యెద్దుఱంకె వినియే భయపడి యదియేమో గుర్తింపలేక మరలి యింటికిఁ బోయి విషణ్ణుఁడై యున్నాఁడు. ఇందుఁ దెలియని దేమున్నది ? ఈసంగతి యెవ్వరును జెప్పనక్కఱ లేదు. నోటఁ జెప్పిన విషయములు పశువులు, హయములు, గజములు, సర్పములు గూడ గ్రహింపఁ గలవు. చెప్పకుండ నాకారాదులచేఁ బరుల యూహాలు గ్రహింపఁ గలవాఁడే పండితుఁడు. నేనిపుడు మనరాజు దగ్గఱకుఁబోయి సందర్భము ననుసరించి యవసరములయిన మాటలు సెప్పి యాతనిభయముఁ బోఁగొట్టి యాతనిఁ బ్రసన్నునిగాఁ జేసికొందును.

'సందర్భమునకుఁ దగిన మాటలు, మంచితనమునకుఁ దగిన ప్రియవచనములు, శక్తికి మించని కోపముఁ గలవాఁడే వివేకి'" యని దమనకుఁడు చెప్పఁగా "నీవు సేవాధర్మము నెఱుఁగవు. చూడుము. పిలువని పనికిఁ బోవువాఁడును, నడుగ నిదే సమాధాన మిచ్చువాఁడును, దనవిషయమునఁ బ్రభువు ప్రీతుఁడై యుండెనని నమ్మువాఁడును నవివేకులు" అని కర టకుఁ డనెను.

దానికి దమనకుఁడిట్లు జవాబిచ్చెను. "నేనుసేవాధర్మ మునెఱుంగ కుందు టేమి ? సహజముగా సుందరమైనను గాకు

న్నను నెవరికేది యిష్టమో యది సుందరముగనే కనఁబడును. ఏవనికేయది ప్రియమగునో తెలిసికొని బుద్ధిమంతుఁడు వానినిఁ దనకు సముఖునిగాఁ జేసికొనును. 'అది నాపనిగాదు. సరిగా నాజ్ఞాపింపుము' అనిపలుకక యథాశక్తి రాజాజ్ఞను నెఱవేర్చుచుండవలయును. అధికమైన ప్రతిఫలముఁ గోరనివాఁడై నీడ వలె ననుసరించుచు నాజ్ఞకెదురాడక ప్రాజ్ఞుఁడు రాజసేవయందు బ్రవర్తింపవలయును.

ఏదైనానొకవేళ రా జవమానము కలిగించునేమో యను నూహించి రాజసన్నిధి వీడరాదు. ఏదైనఁ గీడుకలుగునని కర్తవ్యము విడుచుట యవివేకుల లక్షణము. అజీర్ణము కలుగునేమోయని భోజనము మానివైచు మూర్ఖుఁడెవ్వఁడైన నుండునా? అకులీనుఁడు, విద్యాహీనుఁడు, నయోగ్యుఁడునైనను సర్వదా కనిపెట్టుకొనియుండువానిని రాజు లాదరింతురు. రాజులు, లతలు, వనితలు తఱుచుగా దగ్గఱనున్న వానిపై నభిమానము చూపుట సహజము" అనిన విని గరటకుఁ డంగీకరించి "సరే! నీవిపు డటకేఁగి యేమి పలుకుదువు?" అని ప్రశ్నింప దమనకుఁడిట్లు చెప్పెను.

"ముందుగాఁ బ్రభువు నాకు సుముఖుఁడో, కాఁడో తెలిసికొందును. దూరమునుండి చూచుట, మనవిచేయునపు డాదరము గలిగి వినుట, పరోక్షమున సుగుణముల నెన్నుట, ప్రియవిషయములు తటస్థించి నపుడు స్మరించుట, దానము, ప్రియవచనము లాడుట, దోషములు గుణములుగా గ్రహించుట

సుముఖుని చిహ్నములు. మఱియుఁ గాలయాపనము, నాశలు రేకెత్తించుట, ఫల మొసఁగకుండుట, విముఖుని లక్షణములు. బుద్ధిమంతుఁ డీసంగతులన్నియు గుర్తింపవలయు. ఇన్ని విధములు నెఱిఁగి పింగళకుని స్వాధీనునిఁ జేసికొందును.”

అన విని కరటకుఁడు “ అయినను సమయోచితము గాని ప్రస్తావముఁ జేయకుము. బృహస్పతితో సమానుఁ డైనను సమయోచితములు గాని పలుకులచేత నవమానము నొందును. అనిపలుకఁగా దమనకుఁడు “మిత్రుఁడా! కరటకుఁడా! భయపడకుము. సమయమెఱుఁగక మాటలాడను. ఆపదయందును నపమార్గములఁ బోవునపుడును నడుగకున్నను భృత్యుఁడు స్వామిహితమును గోరి సంభాషింపవలయును. అవసరమయినపుడు కూడ ‘మన కేల’ యని యాలోచనము సెప్పకయూరకుండు నెడల సేవకుని యునికియే నిరుపయోగము. కాఁబట్టి సఖుఁడా! నాకు బోవుటకు సెలవిమ్ము” అని కోరెను. కరటకుఁడును “శుభమగుఁగాక. నీదారి సుగమ మగుఁగాక! నీకు యుక్తమని తోఁచిన విధమున జాగరూకుఁడవై ప్రవర్తింపుము. పోయిరమ్ము.” అని దమనకునిఁ బంపెను.

## దమనకుఁడు పింగళకుం జేరుట

అనంతరము దమనకుఁడు వచ్చుచుండుట దూరమునుండియే చూచి పింగళకుఁడు దగ్గఱకుఁ బిలిపించుకొనెను. దమనకుఁడును సాష్టాంగనమస్కారముచేసి కూరుచుండెను.

తరువాత రాజు "చాలకాలమునకుఁ గనఁబడితివి. సేమమా?" యని యడిగెను.

"ప్రభువులకు నావంటి యల్పసేవకునివలనఁ బ్రయోజన మేమియుండును? అందుచేతఁ దఱచుగా వచ్చుటలేదు. సర్వ సమర్థులగు మీ సత్పరిపాలనమున మా సేమమునకు లోటేమి యుండును? ఎంతటి యల్పుఁడైనను సమయము వచ్చినపుడు భృత్యుఁడు ప్రభువునకుఁ దగిన యాలోచనము సెప్పుట ధర్మ మని మీ దర్శనమునకు వచ్చితిని. పల్లు కుట్టుకొనుటకును, చెవి గోకికొనుటకును నెంతవారికిని గడ్డిపుల్లకూడ నుపయోగపడు చుండఁ గాలుసేతులు గల జంతు వెప్పుడైన నుపయోగింప కుండునా?

ధైర్యము గలవాని కవమానము గలిగినను మతిసెడదు. దివిటీ తలక్రిందుగాఁ బట్టుకొన్నను దానిమంటలు మీఁదికేఁ బ్రసరించుచునే యుండునుగాని క్రిందికిఁ బ్రసరింపవు గదా! ప్రభువు లెఱుఁగని దేముండును? మణి పాదములందు దొరలినను దాని ప్రభ చెడదుగదా! గాజుముక్కను శిరమున ధరించి నను దానికి శోభ గలుగఁ జాలదు. పరిజనులందఱియందు భేదములేక రాజొకేతీరున వర్తించినయెడలఁ గ్రియాదక్షులగు వారు నిరుత్సాహు లగుదురు. పురుషులలో నుత్తములు, మధ్యములు, నధములు నని మూఁడు విధములు. వారిని మూఁడు రకముల పనులయందును నేలిక నియోగింపవలయును. వారికి వారికిఁ దగిన పనులందు యోగింపక వ్యత్యస్తముగాఁ

జేసినచోఁ జూడామణి పాదములందును గాలియందె తలయం దును దాల్చి నట్లగును. బంగరు నగలయందుఁ దాపింపవలసిన మణి యిత్తడియందుఁ బొదిగినయెడల నారత్నమున కేమియు లోటురాదు. భృత్యులకుఁ దగిన గౌరవమొసఁగని దోసము రాజుదే యగునుగాని భృత్యులది గాదు.

అశ్వము, ఆయుధము, శాస్త్రము, వీణ, విద్య, నరుఁడు, నారియు నుత్తములప్రాపుచే గణన కెక్కుటయు నధముల సాంగత్యమునఁ జెడుటయు లోకప్రసిద్ధములు. అసమర్థున కెంతభక్తి యున్నను, శక్తిమంతుఁ డపకారియైనను నుపయోగ మేమి ? రాజావమాన మొందిన పరిజనునకు మతిసెడును. వానిం జూచి బుద్ధిమంతుఁ డెవ్వఁడు రాజసమీపమున కేఁగు టకు వెఱచును. పండితులు వీడినరాజ్యమున నీతి సెడును. నీతి చెడినపుడు సకలముఁ జెడిపోవును. రాజగౌరవ మొందిన వాని నందఱుఁ గౌరవించెదరు. రా జనాదరించినట్లు తెలిసిన జను లందఱు నవమానింతురు. ఉచితమైన దానిని బాలుఁడు తెలిపి నను గ్రహింపఁదగును. రవిలేని సమయమునఁ జిఱుదీప ముప యోగింపకుండునా ? ” యని దమనకుఁడు పలుకుచుండఁ బింగళకుఁ డిట్టు లనియెను.

“ దమనకా ! ఇంతగాఁ జెప్పనేల ? నీవు మాకుఁ బర మాప్తుఁడవు. కడు యోగ్యుఁడవు. ఇంతకాల మేదో దుష్టుల బోధవలన రాకపోకలు తగ్గించితివి. ఇప్పుడు స్వేచ్ఛగా నీవు చెప్పఁదలఁచిన ముఖ్యాంశములు చెప్పుము. ” అను రాజు

మాటలు విని దమనకుఁడు “మనవి చేసి కొనుచుంటిని. ప్రభువువారు నీరు ద్రావుటకై యమునకుఁ బోవుచు నీరు ద్రావకయే వెఱఁగొంది వెనుదిరిగివచ్చినట్లు కానఁబడుచున్నది. ఇందులకుఁ గారణముఁ దెలిసికొని యవసరమైన సేవ చేయఁ దలఁచి దర్శనమునకు వచ్చితిని” అని వినయమునఁ బలికెను.

అంతటఁ బింగళకుఁడు “దమనకా! అడుగఁ దగిన యంశమే యడిగితివి. ఈరహస్యముఁ దెలిపి యాలోచన మడుగుటకు నమ్మదగినవాఁ డొక్కఁడును గానరాకున్నాఁడు.

ప్రస్తుత మీవనమున కేదో యొక యపూర్వ మృగమే తెంచియున్నది. కాఁబట్టి మన కియ్యది విడువఁదగినదని తోఁచుచున్నది. ఆకారణమున వెఱఁగొంది యుంటిని. ఇంతకు ముందే యొక మహాధ్వని వినవచ్చినది. ఆశబ్దముఁ బట్టి చూచిన నాజంతువు మహాబలముగలదై యుండవలయును” అని పల్కెను.

అది విని దమనకుఁడు “ఔను; ఆధ్వని మేమును విని యుంటిమి. అది భయముఁ గలిగించునట్లుగనే యున్నది. అయినప్పటికి నాలోచన లేకుండ ముందుగానే దేశత్యాగము చేయుటకును, యుద్ధమునకుఁ బూనుకొనుటకు మంత్రియైన వాఁడెట్లు ప్రోత్సహించును? ఇట్టి విషమ పరిస్థితులలోనే భృత్యుల సారము దెలియవలయును. బంధువులు, భృత్యులు, స్త్రీలు ననువారి బుద్ధియు, సామర్థ్యము నాపద లనెడి నొఱపురాళ్ళ

యందే తేలిపోవును. నేఁ జీవించియుండఁగాఁ దమకు భయ మక్కఱలేదు. కరటకుఁడు మున్నగువారిఁ గూడఁ గొంచెము చేరఁ దీయుఁడు. ఏలయన, నాపత్సమయములందుఁ బురుష సాహాయ్య మెంతయు నవసరము." అని చెప్పెను.

పిమ్మటఁ గరటకునిఁ గూడఁ బిలిపించి పింగళకుఁడు వారిర్వురను సర్వవిధముల గౌరవించెను. అపుడు దమనకుఁ డిట్లనెను. "ప్రభూ! ధ్వని విన్నంతమాత్రమున భయపడరాదు. ధైర్యము వహించి కారణముఁ దెలిసికొని ప్రతిక్రియ యాలోచింపవలయును. ఈయర్థముఁ దెలుపు కథ యొక్కటి గలదు. వివరించెదను; చిత్తగింపుఁడు.

## పొలికలని యందలి నక్క కథ

పూర్వ మొక నక్క యాకలిగొని వనమం దాహారము నకై తిరుగాడుచు విసువొంది యదృష్టమువలనఁ దుద నొక యుద్ధభూమిం గాంచెను. అందుఁ గుప్పలుగాఁ గూలినరథములు, నవయవములు, పలుపెకములుగా ఖండితములై పడియున్న యేనుఁగులు, గుఱ్ఱములు, సైనికసమూహములు నిండుగా నుండెను. ఆనక్క యవియన్నియుఁ జూచి సంతసముతో వానిఁ దినుటకై దగ్గఱికిఁ బోవుచుండఁగా నేదో యొక పెద్దచప్పుడు వినఁబడెను. ఆధ్వనితో గుండె లదరి యది పాఱిపోవఁ దలఁచెను. కాని యంతలో నేమి దోఁచినదో యాధ్వని విన వచ్చిన దెసకుఁ బరికించి చూచెను. దూరమున నొకచోటఁబడియున్న

దుందుభియను వాద్యముపైఁ జెట్టుకొమ్మ గాలికి గదలి గట్టిగా దగులుచుండుటవలన నది బిగ్గఱగా ధ్వని చేయుచుండెను. అపు డా నక్క దాని దగ్గరికిఁబోయిఁ యది కొఱకి చూచి యందుఁ బ్రవేశించి బయటికి వచ్చెను. అట్లు భేరీముఖమంతలి చర్మముఁ గొఱికివేయఁగానే యాధ్వని నిలిచిపోయెను.

అపు డాజంబుకము "ఎంతపొరపడితిని. ఇంత యాహారము విడిచిపెట్టి యీశబ్దమునకు జడిసి పాఱిపోవుటకు సిద్ధపడితిని" అని యనుకొనుచు సంతసముతో గావలసినంత యాహారముఁ దిని తనదారింబోయెను. కావున నాధ్వనికిఁ గారణ మరసి ప్రతిక్రియ చేయుదు" నని పలికెను. పింగళకుఁడు 'సరే' యని సెలవిచ్చి పంపెను.

దమనకుఁ డట్లు బమలుదేఱి పోవుచుండ వానివెంట నరిగి కరటకుఁ డిటు లనియెను. "భయమునకుఁ గారణ మెఱుంగకుండ, నది తొలఁగింప శక్యమైనదో కాదో తెలియకుండ భయప్రతీకారమునకు శపథముచేసి రాజసత్కారము నొందితిమి. ఉపకారముఁ జేసియేకాని యెవ్వరివలనఁ గానుకలు గ్రహింపరాదు. అందునను రాజువలన నెంతమాత్రము స్వీకరింపరాదు. ఏలయన రా జనుగ్రహించెనేని సంపదలు, విక్రమించినయెడల విజయముఁ, గోపించినయెడల మృత్యువును గలిగింపఁగల సమర్థుఁడై యుండును. ఎట్టివాఁడైనను రాజు నవమానింపరాదు. రాజన నరరూపమున నుండు దైవమే కాని

యన్యుఁడుగాఁడు." అనుమాటలకు దమనకుఁడు నవ్వి యిటు లనియెను.

"సఖుఁడా! నీ కేమియు నాందోళన మవసరము లేదు. భయకారణము దెలిసియేయున్నది. అది వర్ధమానుఁడను వణిజునిచే నడవియందు విడువఁబడిన యెద్దు వైచిన అంకెయే గాని యన్యము గాదు. వృషభములు మనముకూడ సులభముగా భుజింపఁదగినవి. రాజువిషయమై సందియ మేల?" యను దమనకుని పలుకుల "కట్లైన ముందే స్వామికిఁ దెలిపి యాతని భయము మానుపరాదా?" యని కరటకుఁడు ప్రశ్నించెను.

దానికి దమనకుఁడు "వెంటనే భయము మాన్పించిన మనకుఁ జిరకాలగౌరవ మెటులు గలుగును? భృత్యులెన్నఁడును స్వామి నిఁక దమ యవసరములేని స్థితికిఁ దేరాదు. ప్రభుని యవసరములన్నియు మిగులకుండఁ దీర్చువాఁడు దధికర్ణునివలెఁ జెడును. నీకా కథ యెఱింగించెదను వినుము.

## సింహము పనియంతయు నెఱవేర్చి చెడిన పిల్లి కథ

ఉత్తరదేశమం దర్బుదశిఖర మనెడి యొక పర్వతము గలదు. అందు దుర్దాంతుఁడను మహాబలముగల సింహము వసించుచుండెను. అది కొండగుహాలో సుఖముగా నిదురించుచుండునపు డొక యెలుక రోజును దాని కేసరములు గొఱుకు

చుండెను. ఆ సింహము పట్టుకొనఁ బోగా నది దొరకక కలుఁగులోనికిఁ బాఱిపోవుచుండెను.

అపుడు దుర్దాంతుఁడు "క్షుద్రశత్రువును బలముచే సాధించుట కష్టము. అట్టివానిం జంపుటకు వానికిఁ దగిన వాఁడే యుండవలయును." అని యాలోంచి యొక గ్రామము నకుఁ బోయి కడుశ్రమతో దధికర్ణుఁ డనెడి మార్జాలమును నమ్మించి తీసికొనివచ్చి గుహలోఁ దనయొద్ద నుంచుకొని యాహారాదులచే దానిం బోషించుచుండెను. దాని భయము వలన మూషికము కలుఁగువెడలి వచ్చుటకే భయపడు చుండెను. అందువలనఁ గేసరములు కొఱుకుబాధ తప్పి యా సింహము సుఖముగా నిదురించుచుండెను. ఎలుక చప్పుడు వినవచ్చి నపుడెల్లఁ బిల్లికి దుర్దాంతుఁడు మాంసాహార మొసఁగి ప్రోత్సహించుచుండెను.

పిమ్మటఁ గొంతకాలమైన తరువాత నాకలికిఁ దాళలేక యామెలుక కలుఁగు వెడలివచ్చి పిల్లిచే భక్షింపఁబడెను. అనంతరము చాలకాలమువఱకు నెలుక చప్పుడుగాని యెలుక గాని దుర్దాంతునకుఁ గనఁబడలేదు. ఆ కారణమున దుర్దాం తుఁడు దధికర్ణున కాహార మిడుటయం దశ్రద్ధవహించుచుఁ గొంతకాలమునకుఁ బూర్తిగా మానివైచెను. దధికర్ణుఁడును దిండిలేక క్రమముగా బలహీనుఁడై కృశించి మరణించెను. కాఁబట్టి యెన్నఁడును బ్రభువును నిరపేక్షునిగాఁ జేయరాదు."

అని పలికి కరటకుని నొక చెట్టుక్రిందఁ గూరుచుండ నియమించి సంజీవకుని యొద్ద కేఁగి యిట్లు పలికెను.

"ఓ వృషభేంద్రా! ఈయడవిం గాపాడుటకై మృగరాజగు పింగళకునిచే నియమింపఁబడిన సేనాధిపతి కరటకుఁ డిట్లాజ్ఞాపించుచున్నాఁడు. 'త్వరితముగ నాకడకు రమ్ము. లేదేని యీ యడవినుండి దూరముగఁ దొలఁగి పొమ్ము. ప్రభువు కోపించిన యెడలఁ గలుగు ఫలితము లెఱిఁగియే యుందువు. ప్రభువుల కాజ్ఞాభంగము, బ్రాహ్మణుల కనాదరము, స్త్రీలకు పృథఙ్మందిర నివాసము శస్త్రముకక్కఱ లేని చిత్రవధ వంటిది.'"

సంజీవకుఁడు మిగులభయపడి చప్పునఁ గరటకుని కడకుఁ బోయి సాష్టాంగనమస్కారముచేసి "సేనాపతీ! నే నెఱుఁగక చేసిన తప్పు లున్నచో క్షమింపుము. ఇఁక నీయాజ్ఞానుసారముగా మెలఁగుదును." అని విన్నవించుకొనెను,

అది విని కరటకుఁడు "ఓవృషభమా! నీవు మా యరణ్యమున నివసించుచున్నావు. కావున మాప్రభువుని కడకు వచ్చి నమస్కరించి విధేయుడవై యుండుము." అని యాజ్ఞాపూర్వకముగాఁ బలికెను.

దానికి సంజీవకుడును "నా కభయ మొసఁగుము. నీయానతి చొప్పున వచ్చి స్వామిసేవ చేయఁగలను." అని

వేడుకొనఁగాఁ గరటకుఁడు "భయపడకుము. సింహము మేఘ గర్జనలకు తిరిగి గర్జించునుగాని నక్క కూఁతలు లెక్క సేయదు. వాయువు సమున్నతములైన వృక్షములనే పెల్లగించునుగాని వంగియుండు తృణముల జోలికిఁ బోఁడు. నీవును వినయ విధే యతలతో మెలఁగిన మారాజు పింగళకుడు నీ కేహానియుఁ జేయడు సరిగదా! నీకేదైన నుద్యోగము కూడ నొసఁగి గౌర వించును." అని పలికెను.

ఈవిధముగా సంజీవకుని లోబఱచుకొని కూడఁదీసికొని పోయి యాతనిఁ గొంతదూరమున నుంచి కరటక దమనకులు పింగళకుని సమీపమునకుఁ బోయిరి. రాజునకు వందన మొన రించి కూరుచున్న యనంతరము "దమనకా! నీవు పోయిన పని యేమైనది? శబ్దకారణ మెఱిఁగి యావైరియెవ్వఁడో తెలిసికొంటివా?" యని పింగళకుఁడు ప్రశ్నించెను.

దమనకుఁడు "దేవా! అంతయు మనవిచేయు చున్నాను. మీ రూహించినటు లాతఁడు మహాజంతువే కాని క్షుద్రజంతువుకాడు. అయినను దమకు విధేయుఁడై వర్తింపఁ దలఁచినవాఁడు కాని విరోధమునకుఁ బూనుకొను వాఁడుగాఁడు. స్వామి యనుగ్రహమున్నచో నుద్యోగిగా నుండి సేవచేయఁ గలఁడు. ఆజ్ఞ యైనచో రప్పించెదను." అని విన్నవించెను. పింగళకుఁ డందుల కంగీకరించెను. దమనకుఁడు బయటికివచ్చి సంజీవకుని రాజు నెదుటికిఁ గొనిపోయెను.

## సంజీవకుఁడు మంత్రియుఁ, గరటక దమనకులు కోశాధికారులు నగుట

సంజీవకుఁడు విధేయతతోఁ బింగళకునకు సాష్టాంగ వందన మాచరించి "ప్రభుని యాజ్ఞలకు బద్ధుఁడను" అని పలికెను. పింగళకుఁడు సంతసించి యావృషభమునకు మంత్రి పద మొసఁగి గౌరవించెను. నాటినుండియుఁ బింగళక సంజీవకులు కడుంగడు నమ్మకముతోఁ జెలిమి యొనరించుచు సుఖముగాఁ గాలము గడపుచుండిరి. పింగళకుఁడు కరటక దమనకులను గోశాధికారులుగా నియమించి గౌరవించెను.

## స్తబ్ధకర్ణుని రాక - సంజీవకుఁడు కోశాధికారి యగుట

అనంతర మొకనాఁడు పింగళకుని సోదరుఁడయిన స్తబ్ధకర్ణుఁ డచటికి వచ్చెను. పింగళకుఁ డాతని సగౌరవముగా నాహ్వానించి గౌరవించి యాతని కాహార మొసఁగుటకై మృగములను జంప స్వయముగా బయలు దేఱుచుండెను. ఆసమయమున సంజీవకుఁడు "ప్రభూ! చంపఁబడిన జంతువుల మాంసము నిలువ లేదా?" యని యడిగెను.

"కరటక దమనకులకు దెలియవలె" నని సింహము చెప్పెను. "ఉన్నదో లేదో తెలిసికొనుట మంచిది" అని సంజీవకుఁ డనెను. పింగళకుఁడు వర్తమానించి తెలిసికొని "మాంసము నిలువ లే" దని చెప్పెను. "మాంసమంతయుఁ

గరటక దమనకులే తినివైచుచుండిరా ?" యని సంజీవకుఁ డడిగెను. "ఔను ప్రతిదిన మట్లే జరుగుచుండెను" అని పింగళకుఁ డనఁగా సంజీవకుఁడు "ఈపని ప్రభువుల యెఱుక లోనే జరుగుచుండెనా ?" యని యడిగి "నాకుఁ, దెలిసియుఁ, దెలియకయు జరుగుచుండె" నని పింగళకుఁడు చెప్పఁగా సంజీవకుఁ డిట్లు విన్నవించెను.

"ప్రభూ ! ఇది యెంతమాత్రముఁ దగదు. ఆపదకుఁ బ్రతిక్రియ యొనరించుట దక్క మఱేపనియుఁ బ్రభువునకు నివేదింపకుండ భృత్యుఁడు తనంతఁదాను స్వతంత్రించి చేయ రాదు. కమండలువు తనలోని సారమంతయుఁ ద్యజించి యజ మానుని మేలునకై మిక్కిలి జలమును గ్రహించునట్లు మంత్రి యైనవాఁడు ప్రభువునెడల వర్తింపవలయును. కోశముఁ బెంపు సేయువాఁడే నిజమైన మంత్రి. ఏలయన ; రాజునకుఁ గోశమే ప్రాణములు గాని, ప్రాణములు గావు. పురుషున కేయితరగుణ ములచేతను గోశసమృద్ధివలన వచ్చినంత గౌరవము రాఁ జాలదు. ధనహీను నాలుబిడ్డలే నిరాదరింతు రన నితరుల మాట సెప్పనేల ? అతివ్యయము, నపరిశీలనము, నధర్మార్జ నముఁ, గోశవ్యసనమునకు లక్షణములు. ఆదాయము గుఱు తింపక స్వేచ్ఛగా వ్యయము చేయువాఁడు కుబేరతుల్యుఁ డయినను ననతికాలమున జేటు నొందును."

సంజీవకుని పలుకులు విని స్తబ్ధకర్ణుఁ డిట్లు పలికెను. "సోదరా ! వినుము. సంధి విగ్రహాది కార్యములందు సమర్థు

లును జిరకాలమునుండి యాశ్రయించి యున్నవారు నగు కరటకదమనకు లెన్నఁడుఁ గోశాధికారమున నియోగింపఁ దగినవారు గారు. ఉద్యోగప్రసక్తిలో నేను వినియున్న ధర్మములు తెలుపుదును. వినుము.

బ్రాహ్మణుఁడు, క్షత్రియుఁడు, బంధువుఁ గోశాధికారమున నియోగింపఁదగరు. బ్రాహ్మణుఁడు సంపాదింపఁబడిన ధనము కష్టకాలమున నైన వినియోగింపఁడు. క్షత్రియుఁ డన్నిటికి ఖడ్గముఁ జూపును. బంధువు జ్ఞాతిభావముచేత సమస్తము నాక్రమించి హరించును. చిరసేవ యొనరించు నియోగి దోషమునకై నను వెఱవక స్వామిని లెక్క-గొనక నిరంకుశుఁడై చరించును. ఉపకారినెన్నఁడుఁ గోశాధికారమున నియమింపరాదు. తానొనరించిన యుపకారము నిమిత్తముగాఁ జేసికొని నిత్యము రాజసన్నిధానమునఁ జరించుచుఁ దానే రాజన్నట్లాతఁడు చరించును. సమృద్ధిగలవానిని మంత్రిగా నియమించిన నసాధ్యుఁడగును. సమృద్ధి చిత్తవికారముఁ గలిగించును.

పిండినకొలఁదియు ద్రవించు దుష్టవ్రణమువలె నుద్యోగులు ప్రభుని యంతస్సారముఁ బీల్చివేయుదురు. ఎంతపిండినను దడివస్త్రము పయోధారల నొసఁగఁ జాలనట్లెంత యొత్తుడు గలిగినను నుద్యోగులు హరించిన ధనముఁ దెచ్చియీయరు.

ఈ విషయము లన్నియు బాగుగా నాలోచించి సందర్భానుసారముగా మెలంగవలయును." సోదరుని యీ మాటలు విని పింగళకుఁడు "అది నిజమేయగును. కరటకదమనకు లీమధ్య నన్నివిధముల నాయాజ్ఞలకు బద్ధులై యుండుచున్నట్లు గానరాదు." అని చెప్పఁగా మరల స్తబ్ధకర్ణుఁ డిట్లనెను.

"ఆజ్ఞ మీఱెడి వారిని రాజు క్షమించెనేని నాతనికిని జిత్రప్రతిమకు భేద మేమి? సోమరియైన వానికిఁ గీర్తియు, సరళతలేనివానికి స్నేహమును, నింద్రియ నిగ్రహము లేని వానికి గులమును, ధనాశాపరునకు ధర్మమును, లుబ్ధునకు సౌఖ్యమును, వ్యసనములు గలిగియుండు వానికి విద్యాఫలమును, మంత్రుల విషయమై యేమఱియుండు నరపతికి రాజ్యమును నచిరకాలమునఁ జెడిపోవును. కావున సోదరా! తప్పక నామాట పాటింపుము. సస్యము మాత్రమే తిని జీవించు సంజీవకునిం గోశాధిపతిగా నియమించుట యుక్తమని నాయూహ."

ఇట్లు పలికిన సోదరుని మాటల కంగీకరించి యప్పటి నుండియుఁ బింగళకుడు సంజీవకునిఁ గోశాధికారమున నియోగించెను. ఈ విధముగాఁ బింగళక సంజీవకుల స్నేహము మఱింత ప్రబలెను. అంతేకాక యితరబంధువులందును, మంత్రులందును బింగళకుని కాదరము తగ్గిపోయెను.

## కరటక దమనకుల విషాదము – పన్నుగడ

అనంతర మీవిషయము లన్నియుఁ గరటక దమనకు లకు మిక్కిలి ఖేదముఁ గలిగించెను. దమనకుఁడు కరకటకునితో మిత్రమా ! యిపుడు గర్తవ్య మేమి ? ఇది స్వయంకృతాపరాధము. స్వయంకృతదోషమునకు విలపించుట కూడ యుక్తము గాదు. తాము చేసికొన్న దోషముచేత నొక రాజకుమారుఁడు నొకసన్న్యాసియు హాని నొందిరి. నీకా కథలు చెప్పెదను వినుము.

## స్వయంకృతాపరాధమువలనఁ జెడిన రాజకుమారుని కథ

సింహళ దేశరాజయిన జీమూతకేతునకుఁ గందర్ప కేతుఁడను నొక కుమారుఁడు గలఁడు. ఆతఁ డొకనాఁ డుద్యాన వనమున నుండఁగా నొక యోడబేరగాఁడు వచ్చి "ప్రభూ! సముద్ర మధ్యమున నెున్నటి చతుర్దశినాఁడు డొకకల్ప వృక్షము బయలు దేఱినది. ఆవృక్షముక్రింద రత్నకాంతులతో దేదీప్యమానముగ నున్న పానుపుపై సర్వాలంకారములు ధరించి వీణవాయించుచు లక్ష్మివలె నుండు నొక కన్య కానఁ బడినది." అని చెప్పఁగా రాజకుమారునకుఁ గుతూహలము గలిగి యాతనితో సముద్రతీరమునకుఁ బోయెను.

సరిగా వణిజుఁడు చెప్పిన చొప్పున నున్న కన్యకా మణిం జూచి యామె రూపలావణ్యములచే రాకొమరుఁ డాకర్షింపఁబడెను. వెంటనే యాతఁడు మహాసాహసమున నాబాలా

మణియొద్ద కుటికెను. అట్లుటుకుటయే తడవుగా నాతఁడు బంగరుమేడలతో నిండిన యొకపట్టణమునకుఁ బోయి యందొక సుందరసౌధమున విద్యాధరకన్యలచే సేవింపఁబడుచున్న యా సుందరాంగిం జూచెను.

ఆమెయు రాకొమరుని దూరమునుండియే చూచి యాతనితో మాటలాడుటకై తన చెలికత్తె నంపెను. చెలికత్తె యాతనికడకుఁ బోయి "రాజకుమారా! మాచెలి కందర్పకేళియను విద్యాధరచక్రవర్తి కూతురు రత్నమంజరి. 'ఎవఁడు తనంతటఁ దానీ సువర్ణనగరముం జూచి చేరవచ్చునో యాతనిఁబెండ్లి యాడవలయు' నని యామెసంకల్పము. కావున నీవామెను గాంధర్వ విధిచే వివాహమాడుము" అని పలికెను.

కందర్పకేతుఁ 'డట్లే' యని యంగీకరించి రత్నమంజరిని వివాహమాడి యచటనే హాయిగా సమస్తసుఖములు ననుభవించుచుండెను. ఒకనాఁ డామె యాతనితో "స్వామీ! యీసర్వైశ్వర్యము నీయధీనము, నీయిచ్చవచ్చినట్లు దీని ననుభవింప వచ్చును. ఈచిత్రపటమందలి యాకృతిస్వర్ణ రేఖయను విద్యాధరకన్యది. దీనినిమాత్రము నీవెన్నఁడుఁ దాఁకవలదు. అట్లు తాఁకినయెడల మహాప్రమాదము సంభవింపఁ గలదు, అని పలికెను.

కొంతకాల మట్లు కడచిన పిమ్మట నొకనాఁడు కందర్పకేతుఁడు కుతూహలము నిలుపుకొనలేక యా స్వర్ణ రేఖను

జేతితోఁదాఁకెను. వెంటనే యది చిత్రమే యయినను నామె తన చరణముచేత నారాజకుమారునిఁ దన్నెను. ఆతఁడెప్పటివలెఁ దన రాష్ట్రమందలి యుద్యానవనమునఁ బడి యెన్నఁడు నిఁక రత్నమంజరి జాడగానఁజాలక దుఃఖజపీడితుఁ డయ్యెను. ఇంక సన్న్యాసి కథ వినుము.

## స్వయంకృతా పరాధమువలనఁ జెడిన సన్న్యాసికథ

మలయపర్వత సమీపమున నొకానొక సాధువు నివసించుచుండు వాఁడు. ఆతఁడొకపుడు పంద్రెండుసంవత్సరములు పయనము సాగించి మలయపర్వత ప్రదేశమునుండి కాంచనపురమను నొకనగరముఁ జేరెను. నాఁటిరేయి యానూతననగరమున నొకవిశాలభవపు టరఁగుమీఁద బండుకొనెను.

అదియొక వేశ్యాగృహము. గృహద్వారమున దారునిర్మితమైన బేతాళ విగ్రహమొకటి గలదు. దాని శిరముమీఁద ప్రశస్తమైన యొకమణి ప్రకాశించుచుండెను. దానిం జూడఁగా నాసాధువున కాస కలిగెను. దానింగ్రహింపఁదలఁచి యాతఁడు చేయిచాచి తాఁకినంతనే బేతాలుని చేతులా సాధువును బంధించి వైచినవి. బేతాళునిచేతుల బిగి కాగలేక యాతఁడాక్రందన మొనరించుచుండఁగా లోనుండి యొక పరిచారిక యరుదెంచి "ఓయీ! నీవు మలయపర్వతము దరినుండి వచ్చితివి. నీయొద్దనెన్నో మణులుండవలయును. వాని నన్నిటిని

గౌరవముగా నిచ్చివేయుము. లేనిచో నీబంధము నుండి నీకు విముక్తిగలుగుట యసంభవము " అని స్పష్టపఱచెను. పది మందియు విన్నచో నింకను నవమానము గలుగునని వెంటనే తనతగ్గఱనున్న మణులన్నియు నిచ్చివైచి శూన్యహస్తుఁడై యాతఁడు మిక్కిలి విచారము నొందెను.

ఇట్లే యాషాఢభూతి యనువానిచే మఱొక సన్న్యాసికి, మేషయుద్ధమువలన నొక నక్కకు స్వయంకృతాపరాధముచే హాని సంభవించెను. నీకాకథయు వివరించెదను వినుము.

## సన్న్యాసిని మోసఁగించిన యాషాఢభూతి కథ

పూర్వము దేవశర్మయను నొక సన్న్యాసియుండెను. ఆతఁడు సన్న్యసించినను లోభగుణము విడువలేకుండెను. జనులకు నిత్యము వేదాంతవిషయము లుపన్యసించుచుండువాఁడు. వారు భక్తితోఁ దెచ్చియిచ్చు కానుకలయెడ ననాదరముఁ జూపువాఁడు. కాని వారిం జిన్నఁబుచ్చ నిష్టములేని వానివలె నటించి యవి స్వీకరించుచుండువాఁడు. ఇట్లు సంపాదించిన ధనమంతయు నొక బొంతలో నుంచి యెవ్వరికిఁ దెలియకుండునట్లు దానిం గుట్టి మీఁద గప్పుకొని దేశసంచారము చేయుచుండువాఁడు.

ఆషాఢభూతి యను పేరుగల వంచకుఁ డీవిషయము గుర్తించెను. ఆతఁడా సన్న్యాసిం జేరి యధికమైన భయభక్తు

లతోఁ బరిచర్యలు సేయుచుండెను. మఱియు వేదాంతార్థము తెలుఁగఁగోరిన వారివలె నటించుచు నాతని నమ్మించి యాతని వెంట దేశాటన మొనరించుచుండెను.

ఒకనాఁడు వారిరువురు దారిఁ బయనము సేయుచుండఁగా నాషాఢభూతి యొకచోటఁ దటాలున నిలిచెను. తనబట్ట కంటుకొనియున్న యొక పూరిపుడక చేతఁబట్టుకొని దేవశర్మకుఁ జూపి "స్వామీ! నిన్నరాత్రి మనము నిదురించిన వారియింట నీపూరిపుడక నావస్త్రమున కంటుకొన్నది. ఇది వారి సొమ్ము. పరులసొమ్ము తృణమైన నపహరించుట ధర్మముగాదు. కాఁబట్టి యిది వారి కిచ్చి వచ్చెదను" అని పలికి కొంతదూరము వెనుకకుఁ బోయి దాని నచటఁ బాఱవైచి పిమ్మట దేవశర్మను గలిసికొనెను.

ఈ చర్య కా సన్న్యాసి కడు నచ్చెరువొందెను. ఆతని నిస్పృహకు మనసున మెచ్చుకొనెను. తాను ధరించుచున్న బొంత మోయుటకు బద్ధకించి దానిని శిష్యునకిచ్చి పదిలముగాఁ దీసికొనిరమ్మని చెప్పెను. వాఁడు మిక్కిలి సంతసించి యాబొంత నెంతయో జాగరూకతతో మోయుచుండెను. మునుపటికంటె గురువునకు విశ్వాస మధిక మగునట్లు మెలఁగుచుండెను.

వా రట్లు పయనించుచు నొక యరణ్యమార్గమున నుండఁగా సూర్యుఁ డస్తమించెను. ఆచటనున్న యొక చెఱువుం-

జూచి యాచమనము చేయుటకై యా సన్న్యాసి యందు దిగెను. ఆసమయమున నాచెఱువుగట్టుమీఁద రెండు పొట్టేళ్లు భయంకరముగా డీకొని పోరాడుచుండెను. తలలు పగిలి కారిన రక్తము గాలికి గడ్డకట్టి వాని నడుమ మాంసఖండము వలె నేలమీఁదఁ గనఁబడుచుండెను.

ఒకనక్క యదిచూచి మాంస ఖండమే యనుకొని జిహ్వాచాపల్యమున దానిం దినఁదలఁచి దగ్గఱి కేఁగెను. ఇంతలో నంతకుముందు డీకొని మరల డీకొనుటకై వెనుకకు దూరముగాఁ బోయిన పొట్టేళ్ళు మహావేగముగా ముందునకు వచ్చి డీకొనఁగా నడుమనున్న యానక్క వాని తాఁకుడునకు నలిగి వెంటనే చచ్చిపోయెను.

చెఱువులలో నాచమనము చేసిన సన్న్యాసి యదిచూచి 'మాంసమందలి యాశయేకదా నక్కకుఁ బ్రాణాంతకమయ్యె' నని తలఁచుచు గట్టెక్కి శిష్యునిఁ గానక గట్టిగాఁ బిలిచెను. అడవి యంతయు నిటునటు వెదకి చూచెను. ఎచటను వాని జాడ గానరాలేదు. తుద కాతఁడు తన్ను వంచించి ధనముతో నిండిన బొంత హరించినాఁడని నిశ్చయించుకొని మిగుల దుఃఖించెను.

కావున స్వయంకృతదోష మనుభవింపకతప్పదు " అని పలికి కొంతసే పాలోచించి "పింగళకసంజీవకులకుఁ జెలిమి యెట్లు గావించితివో యట్లే వా రిరువురకు మిత్రభేదము

గల్పింపవలయును. కార్యభంగము వాటిల్లినపు డెవని బుద్ధి చలింపకయుండునో వాఁడే యాపద గడచి గట్టెక్కఁగలఁడు." అని దమనకుఁడు చెప్పెను.

"ఎట్టి బుద్ధిమంతున కైన నొక్కొక్కమాఱు పొరపాటు కలుగుచుండును. అందుల కై విచారింప నక్కఱలేదు. కాని గాఢముగ హృదయములందు నాటుకొనియున్న పింగళక సంజీవకుల స్నేహమునకు విఘాతము గలిగించుట శక్యమా?" యని కరటకుఁడు సందేహముతోఁ బ్రశ్నింపఁగా దమనకుఁ డిట్లు చెప్పెను.

ఉపాయ మున్నచో సాధింపరాని కార్య మేదియు నుండదు. కాఁబట్టి చక్కని యుపాయ మాలోచింపవలసి యున్నది. పూర్వ మొక వాయస ముపాయముచేత శత్రువయిన కృష్ణసర్పముం జంపెను. నీ కా కథ తెలుపుదును. వినుము.

## ఉపాయముచేఁ ద్రాచుఁబామును జంపిన కాకి కథ

పూర్వకాలమున నొక మఱ్ఱిచెట్టు మీఁద గూడు కట్టుకొని వాయసదంపతులు నివసించుచుండెను. ఆ చెట్టు తొఱ్ఱలో నొక కృష్ణసర్పముండి యా కాకి పిల్లలను దినివేయుచుండెను. అందులకుఁ గాకము మిక్కిలి దుఃఖించెను. మరలఁ బ్రసవసమయము రాగా నాఁడుకాకి ప్రియునిఁ జూచి "నాథా ఈ వృక్షమును విడిచి మఱియొకచోటి కేగుదము. ఇందలి

సర్పము మన సంతతి నెల్లపుడు దినివేయుచుండెను గదా! అవినీతురాలగు భార్య, దుష్టుఁడగు మిత్రుఁడు, నెదురాడు సేవకులు, సర్పము గల యింటిలో నివాసము నిక్కముగా మహాపాయకరము" అని పలుకగా భర్త యిట్లనెను.

"ప్రియురాలా! భీతిల్లకుము. ఇంతవఱకీ సర్ప మొనరించిన యపరాధములు సహించితిమి. ఇఁక నోర్వఁదగదు. తప్పక ప్రతీకార మొనరించెదను."

ఆమాటలకు "బలవంతునితో విరోధము మేల?" యని భార్య పలుకఁగా భర్త "నీకు సందేహము వలదు. బుద్ధిబలముగలవానికి దేహబలముతో నిమిత్తము లేదు. బుద్ధిబలములేకున్న శరీరబల మెందులకుఁ గొఱగాదు. మదించిన సింగమును బుద్ధిబలముచేతనే కదా కుందేలు చంపినది. నీకా కథ మెఱింగించెదను; వినుము.

## బుద్ధిబలమున సింహముం జంపిన కుందేటి కథ

మందర మనెడి కొండమీఁద దుర్దాంత మనెడి సింహము గలదు. అది యెల్లవేళల జంతువు లన్నిటిని వేటాడి చంపుచుండెను. ఆ యుపద్రవమునకుఁ దాళలేక యొకనాఁడు జంతువు లన్నియు సభచేసి యాలోచించుకొని తమ ప్రతినిధిగా నొకజంతువు నాసింహము నొద్దకుఁ బంపినవి. అది సింహమును సమీపించి వినయముతో "మృగరాజా! ఒకేపర్యాయ మనేక జంతువులను జంపినయెడల నీ కేమి లాభము. జంతు

సంతతి యంతయుఁ నశించినవెనుక రాజ్యాధిపత్య మెవరిపై వహింతువు. దయచూపితివేని మేమే నీయాహారమునకై దిన మునకొక్క మృగమువంతునఁ బంపఁగలము.” అని విన్నవిం పఁగా సింగము ‘సరే’ యని యంగీకరించెను. నాఁటినుండియు నాజంతువులు పంపిన యాహారమే తినుచుండెను.

ఇట్లు కొంతకాలము జరగినవెనుక నొకనాఁ డొక కుందేటికి వంతు వచ్చెను. అపు డది యిట్లు తలపోసెను. “భయ హేతువు గలిగినపుడు ప్రతిప్రాణియు జీవితాశచేత నుపాయము వెదకును. మరణ మెట్లులైనఁ దప్పనియప్పుడు సింహమున కేల జడియవలయును?” ఇట్లాలోచించుచు నాకుందేలు నెమ్మదిగా వెడలుచుండెను.

సింగ మాకలికిఁ దాళలేక యాకుందేలు కనఁబడఁగానే కోపముతో “నీవేల యింత యాలస్యము చేసితివి?” అని యడిగెను. దానికి “స్వామీ! కరుణింపుము. నేను బయలు దేఱి వేగముగా వచ్చుచుండ దారిలో నన్నొక సింహము పట్టుకొని తినఁబోయెను. ‘తప్పక తిరిగి రాఁగల’ నని శప థముచేసి యాసింహమును నమ్మించి వచ్చుసరి కింతయాలస్య మయినది.” అని కుందేలు బదు లీయఁగా సింహము కనుల నిప్పులు రాలునట్లు చూచి మిక్కిలి కోపమున “రమ్మి, శీఘ్రముగా నాసింహ మెచ్చటనున్నదో చూపుము. నారా జ్యమునం దింకొక సింహము ప్రవేశించి నాయాహారము నరికట్టు టయా?” యని గర్జించెను.

కుందే లిట్లు సింహమును గొంతదూరము తీసికొని పోయి యచటనున్న యొక లోతైన పాడునూయి చూపి "స్వామీ! యిందున్నది; చూడు" మనెను. ఆసింహము బుద్ధిహీనతచే నూతియందుఁ దన ప్రతిబింబముఁ జూచి వేఱొక సింహ మనిభ్రమించి కోప మాపుకొనఁజాలక గట్టిగా గర్జించుచు నందుఱికి ప్రాణములు గోలుపోయెను.

కుందే లొనరించిన సాహసము విని యాయడవి యందలి జంతువులన్నియు దానిని మిక్కిలి మెచ్చుకొనెను."

ఈ మాటలు విని "యిప్పుడేమి యుపాయ మాలోచించితివి?" అని భార్య యడుగగా వాయస మిటులనెను.

"ఇచటికి సమీపమున నున్న సరోవరమునందు రాజపుత్రుఁడు ప్రతిదినము వచ్చి జలక్రీడ సేయుచున్నాఁడు. స్నానసమయమం దాతఁడు మణులు పొదిగిన తన చేతియుంగరముం దీసి గట్టుపై నిడును. అపుడు దానిని ముక్కునఁ గఱచికొని వచ్చి యీచెట్టు తొఱ్ఱయం దుంచెదను." అని పలికి యొకనాఁ డావాయస మట్లే చేసెను.

రాజభటు లాయుధములు చేతఁబట్టుకొని యుంగరము వెదకుచు నాచెట్టును సమీపించి తొఱ్ఱలో నుంగరముం జూచి యచట 'బుస్సు బుస్సు' మనుచున్న కృష్ణసర్పముం జంపి యాయుంగరముఁ గొనిపోయిరి. కాఁబట్టి యుపాయముచేతనే పింగళక సంజీవకులకు విరోధము గలిగింపవచ్చును" అని పలికి

కరటకుని వీడుకొని పింగళకునియొద్దకుఁ బోయి వందన మాచ రించి దమనకుఁ డిట్లనెను.

## దమనకుఁడు పింగళకుని మనసు విఱుచుట

"ప్రభూ! 'ఆపద గలిగినపుడుఁ, జెడుత్రోవఁ బట్టినపుడుఁ, గార్యసమయము దాఁటిపోవునపుడును మేలుకోరు మంత్రి రాజడుగకున్నను హితముఁ జెప్పవలయు' నని పెద్ద లందురు. రా జుపభోగమునకుఁ దగినవాఁడు. కర్తవ్య మేమఱక మంత్రి కనిపెట్టుచుండవలయును. అట్లు చేయని మంత్రి ద్రోహి యగును. సమయము వచ్చినపుడు స్వామి కార్య ముపేక్షిం చుటకంటె మరణము మేలు."

ఇట్లు పలుకుచుండఁ బింగళకుఁడు "దమనకా! నీకు సందియము వలదు. చెప్పఁదలఁచినది నిశ్శంకముగాఁ జెప్పుము. నీమనసునకు బాధ కలిగించిన విషయ మెయ్యది?" యని యడుగ దమనకుఁ డిట్లనెను.

"దేవా! మీవిషయమై సంజీవకుని నడవడి యేమియుఁ జక్కఁగాలేదు. తొలుత నాతఁ డిట్టివాఁడని యెంత మాత్రముఁ గనిపెట్టలేక పోయితిమి. అచట నచట మీమీఁద నేరము లెన్నుచు మీసామర్థ్యముం దూలనాడుచున్నాఁడు. ఆతని వైఖరిం జూచినచోఁ గ్రమక్రమముగాఁ గొలఁది కాలములో నీరాజ్యమే వశపరచుకొన నూహించు విధము గోచరించున్నది.

ఈసంగతి కొంతకాలమునుండి వినుచుండియు నేసంగతి నైనను స్పష్టముగా గమనింపకయే వ్యవహరింపరాదని యూరకుంటిని. కాని యింక నూరకున్న యెడలఁ గార్యము మించిపోవున ట్లుండుటచేతఁ జెప్పక తప్పినదిగాదు. మంత్రులందఱిం బరిత్యజించి సర్వాధికారము లీతని కిచ్చుటవలన నీయపాయము గలిగినది.

రాజ్యలక్ష్మి, సమర్థుఁడైన మంత్రియం దొకపాదమును, రాజునం దొకపాదమును మోపి నిలిచియుండి స్త్రీసహజమైన చాపల్యముచేత నొకరిని విడిచి మఱియొకరిం జేరుచుండును. ఒక్కనికే రాజు సర్వాధికారము లొసఁగినచో నాతఁడు గర్వించి స్వతంత్రింప నెంచును. స్వాతంత్ర్యమం దిచ్ఛగలిగిన మంత్రి రాజునకుఁ బ్రాణాపాయముఁ గలిగింప సాహసించుటలో వింత యేమి యున్నది ?

విషము గలిసిన యన్నమును, గదలిన పంటిని, దుష్టుఁడగు మంత్రిని సంపూర్ణముగా విసర్జించుటే యుత్తమము. ఎవఁడు రాజ్యలక్ష్మిని సచివాయత్త నొనరించునో వాఁడు మంత్రి దుష్టుఁడైనపుడు గతిలేక దుఃఖ మనుభవించును. సంపద గోరని వాఁడును లోకమున నుండడు." అని దమనకుఁడు చెప్పిన మాటలన్నియు విని కొంచె మాలోచించి పింగళకుఁ డిట్లనెను.

"ఓయీ! దమనకా! శరీరము సకలరోగములకుఁ దావలమైనను దాని నెవ్వరును విడిచిపెట్టుటకు సిద్ధపడరు.

అట్లే ప్రియమిత్రుఁ డొకవేళఁ గొంత తప్పిద మొనరించినను విడిచి వేయవచ్చునా ? నాకు సంజీవకునితోడి చెలిమి మేర లేనిది కదా ! ఇండ్లు, సకల సామగ్రులుఁ గాల్చి వేయునదియే యైనను సకల జనులకు నగ్ని యాదరణీయముగాదా ?" ఇట్లు ప్రశ్నించిన రాజునకు దమనకు డిట్లనియె.

"సుతునియందుఁగాని, యమాత్యుని యందుఁగాని తటస్థునియందుఁగాని మితిమీరిన ప్రీతిఁ జూపు రాజును లక్ష్మి విడుచును. పథ్యపుఁ బదార్థ మంతరుచిగా లేకున్నను దుద కారోగ్యసుఖము గలిగించును. హితము చెప్పువాఁడును, నది చక్కఁగా గ్రహించువాఁడును గలుగుచోట లక్ష్మి నిలిచియుండును. నీవు చిరసేవకుల నీసడించి నూతనముగా వచ్చినవాని కాధిక్య మిచ్చితివి." దమనకుని యీమాట లాలకించి "ఇది కడు వింతగా నున్నది. నన్ను శరణు సొచ్చి; యభయ మొసఁగి పోషించుచున్న నన్నే యాతఁ డెట్లు ద్రోహము సేయును ?" అని పింగళకుఁడు ప్రశ్నింపఁగా మరల దమనకుఁ డిట్లు పలికెను.

"ఎన్ని విధముల యత్నించినను గుక్కతోఁకకు వంకర పోజాలదు. దుర్జనుఁ డెన్ని యుపకారములు పొందినను వాని మనసు పరిశుద్ధము కానేరదు. విషవృక్షము లమృతము వోసి పెంచినను మంచి పండ్లీయఁ జాలవు. వర్ధనము, పోషణము దుష్టునకు మంచిగుణములు గలిగింప లేవు. హానినుండితప్పించు మిత్త్రుఁడును, ననుసరించి వర్తించు స్త్రీయును, గర్వము గలి

గింపని సంపదయు, నింద్రియములకు లోఁబడని పురుషుఁడును నుత్తములు. కాఁబట్టి యడుగకున్నను స్వామికిఁ బరాభవము దటస్థించుట సహింపఁజాలక చెప్పుచుంటిని. సంజీవకుని తప్పు లన్నిటిని వినియుఁ బ్రభు వూరకున్నయెడల నా దోషము లేదని తృప్తి వడుదును.”

ఇంతగా నొక్కి చెప్పుచున్న దమనకుని మాటలు విని “గుణదోషము లెఱుఁగక యేపనియుఁ జేయరాదు. గర్వము చేత నెవఁడు సర్పమునోటఁ జేయిదూర్చును? దోష మున్నచో దండింపక విడచుటయుఁ దప్పే. దోషము లేనిచో దండించుట యెంతమాత్రముఁ దగదు.” అని పింగళకుఁడు మనసున నాలోచించుకొని దమనకునితో “ఆతని నిరాకరించి వెడలఁగొట్టుట యుచితమా? హెచ్చరించి చూచుట మంచిదా?” యన దమనకుఁ డిట్లనెను.

“వలదు, వలదు. ఇంతలోనే మంత్రభంగము గావింప రాదు. మంత్రబీజము భగ్నము గాకుండ బహుయత్నములచేఁ గాపాడవలయును. ఒకసారియది భగ్నమైన నిఁక నది యంకురింపఁ జాలదు. చేయఁదగినది యెవ్వరు నెఱుఁగకుండ వేగముగాఁ జేయుట మంచిది. అధీరుఁడగు యోధుఁడు సర్వాంగములు గవచముచేఁ గప్పుకొనియుండియుఁ బరులు భేదింపఁ గలరను భయమునఁ జిరకాలము యుద్ధరంగమున నిలువఁ జాలఁడు. అట్లే మంత్ర మెన్నివిధములఁ గాపాడుచున్నను జిర కాలము నిలువఁజాలదు.”

ఈమాటలు విని పింగళకుఁడు "ఆతఁడు నిజముగా విరోధించినను నా కపాయుము జేయఁగలుగు సామర్థ్య మాతని కేమిగలదు" అని మరలఁ బ్రశ్నింపఁగా దమనకుఁ డిటులనెను.

"అల్పుఁడని తలఁపరాదు. క్షుద్రశత్రువు కూడ నొకపు డెంత యపకారమైనఁ జేయఁగలడు. ఆతనికిఁ బరం పరగా నెందఱి స్నేహ ముండునో యెవ్వరి కెఱుక ? చూడుము. ఒకటిట్టిభము మిత్రవర్గము తోడుగాఁగా సముద్రమును సాధించెను. నీ కా కథ యెఱింగించెదను వినుము.

## టిట్టిభము సముద్రుని సాధించిన కథ

దక్షిణసముద్రతీరమున నొకపు డొక టిట్టిభము, దాని భార్యయు నొక చెట్టుమీఁద గూడు కట్టుకొని నివసించు చుండెను. భార్యకుఁ బ్రసవదినములు సమీపింపఁగా నొకనాఁ డది భర్తతో నిట్లు సంభాషణము సాగించెను.

భార్య — నాథా! ప్రసవమునకుఁ దగినచోటు వెదకుము.

భర్త — ఇది తగిన స్థలము గాదా ?

భార్య — ఇది సముద్రము నానుకొని యున్నది.

భర్త — సముద్రముచేఁ బీడింపఁ బడునంత యసమర్థులమా మనము ?

భార్య — మనకును సముద్రునకును భేదము చాలఁగలదు. యుక్తాయుక్తములు, శక్యాశక్యములుఁ దెలియు పరిజ్ఞానము

గలుగువాఁ డెన్నడు దుఃఖము పొలుగాఁడు. మఱియుఁ దనకుఁ గలుగఁ బోవు పరాభవముఁ దొలఁగించుకొనఁ గలుగును. అనుచితమైన పనులు చేయుట, బలవంతునితోడి పగ, స్త్రీల యెడ నమ్మకము ననునవి మృత్యువునకు ద్వారములు.

ఇట్లు సంభాషణము జరిగిన వెనుక భర్త భయములేదని భార్యకు నచ్చఁజెప్పెను. తుదకు భార్య యచటనే ప్రసవించెను.

ఆదంపతుల సంభాషణము లన్నియు విన్నవాఁ డగుట చేత సముద్రునకు వారి శక్తి యెఱుఁగవలయునని తలఁపు గలిగెను. తన తరంగములచే వాని గ్రుడ్లన్నియు నపహరించెను.

అందు కాడుతీతువు మిక్కిలి విచారించెను. మగతీతువు భార్య నోదార్చి తనజాతిపక్షుల నెల్ల రావించి తనకుఁ గలిగిన హాని వానికి వివరించెను. వాని సానుభూతి సంపాదించి వాని నన్నిటిం దీసికొని గరుత్మంతునికడ కేఁగెను. వినయపూర్వకముగా వందన మొనరించి "ప్రభూ! తప్పేమియుఁ జేయకున్నను సముద్రుఁడు నా కపకార మొనరించినాఁడు. నా సంతతిని నాశన మొనరించినాఁడు" అని విచారమునఁ బలికి తనకు గలిగిన కష్టములు వివరించెను.

గరుత్మంతుం డీమాటలు విని జాలినొంది తనస్వామి యగు విష్ణువునకు వృత్తాంత మంతయు నివేదించెను. సేవకుని

మనవి యాలకించి విష్ణువు సముద్రుని దండించుట కాజ్ఞ యొసఁగెను.

సముద్రుఁ డా సంగతి విని భయపడి పక్షిగ్రుడ్లన్నియు బంగారు పాత్రమున నిడి తీసికొనివచ్చి యా తీతువునకు సమర్పించెను. కాఁబట్టి సంజీవకుని క్షుద్రుఁడని తేలికగాఁ జూడరాదు. తాము పరాకున నున్నపుడు దర్పమునఁ గొమ్ములతోఁ బొడువ వచ్చినపుడే యా సంజీవకుని స్వభావము గుఱుతింపవచ్చును.” అని శక్య మయినంత వఱకు బోధించి సెలవుఁ బుచ్చుకొని దమనకుఁడు మెలమెల్లగా సంజీవకుని కడకుఁ బోయెను.

## దమనకుఁడు సంజీవకునకు దుర్బోధ చేయుట

దమనకుఁడు చింతాకులుని వలె నుండుటఁ జూచి సంజీవకుఁడు “మిత్రమా! కుశలమే కద! నీవింత దైన్య మొందినవానివలె నుండుటకుఁ గారణమేమి?” యని ప్రశ్నింపఁగా దమనకుఁ డిట్లనెను.

“సేవకునకుఁ గుశల మనునది యెట్లుగల్గును? సంపదలా పరాధీనములు. చిత్త మెల్లపుడు నశాంతమై యుండును. జీవితమందు విశ్వాసముగూడ నుండదు. సేవకునివిధ మిట్టిది.

ధనము సంపాదించి గర్వింపని వాఁడును, విషయాసక్తుఁడై యాపదలకు లొంగనివాఁడును, తరుణులఁ జూచి

మనసు చలింపనివాఁడును, రాజున కెల్లకాలముఁ బ్రియుఁడై యుండఁగలుగువాఁడును, మృత్యువునకు వశుఁడు గానివాఁడును, యాచకుఁడై గౌరవముఁ గాంచువాఁడును, దుష్టుల పన్నాగము లకు లొంగి కుశలముగాఁ దప్పించుకొనఁగలుగువాఁడును లోక మున నుండు టరిది. ''

దమనకుని పలుకులు విని సంజీవకుఁ " డిపు డేమి యాపద దటస్థించినది? తెలుపు '' మనఁగా దమనకుఁడు మరల నిట్లనియెను.

" ఏమని చెప్పుదును? దురదృష్టవంతుఁడను. సముద్ర మున మునిఁగిపోవుచు సర్ప మాధారముగా లభించి నపుడు దానిని గ్రహించుట యెట్లు? విడచుట యెట్లు? ఒకవంక రాజవిశ్వాసము, మఱియొకవంక బంధువినాశము. ఏమి చేయు దును? '' ఇట్లు పలికి నిట్టూర్పువిడిచి యూరకుండఁగా సంజీవ కుఁడు " మిత్త్రమా! ఏది యెట్లు జరిగినను వృత్తాంత మంతయు నున్నది యున్నట్లు వివరింపుము '' అని పలుకఁగా దమన కుఁడు మిక్కిలి సమీపమునకు వచ్చి రహస్యముగా నిట్లనెను.

" రాజవిశ్వాసమువలన నీ సంగతి యెంతమాత్రముఁ జెప్పరానిది. అయినను నీవు నాయందలి నమ్మకముచేత నిచ టికి వచ్చిన వాఁడవు. పరలోకవాంఛవలన నీకు హితము చెప్పుట నా విధి. వినుము. మన ప్రభువు నీపయి నెంతయో యలుకఁ జెందియున్నాఁడు. నినుఁజంపి సేవకులకు సంతర్పణముఁ

జేయుదునని రహస్యముగా శపథముం బూని యున్నాఁడు. ఈసంగతి విన్నప్పటినుండియు నేను పొందుచున్న పరితాపమునకు మేరలేదు."

దమనకుని మాటలు విని సంజీవకుఁడు "సఖుఁడా! విషాద మొందకుము. దైవవశమున నెప్పు డేది వచ్చునో దానికి సిద్ధపడి యుండవలయును. ఆపద వచ్చినపుడు సమయానుసారముగా వర్తించి వీలయినచోఁ దప్పించుకొనవలయును" అని పలికి యించుకసే పూరకుండి తనలో "ఈ వ్యవహారము వలన దుర్జనుల చిత్తవృత్తి యెట్టిదో తెలియుచున్నది. ఈలోకమున స్త్రీలు దుర్జనులకే వశులగుదురు. రాజపాత్రులనే యాదరించును. లోభికే ధనము లభించును. మేఘుఁడు కొండల యందు వర్షించును. ఎంతహాని సంభవించినది? ఎన్ని విధముల యత్నించి కొలిచినను రాజనకుఁ దృప్తికలుగ దనుమాట ముమ్మాటికిని నిజము. ఇది యుపాయము గానరాని యపాయము. ఏలయన నెవ్వరైనఁ గారణముండి కోపించినచో నా కారణము తొలఁగఁగానే యదియుఁ బోవును. కారణము లేకుండ బగఁ బూనినవాని కోప మెవరు పోఁగొట్టఁగలరు? రాజునకు నే నేమి యపకార మొనరించితిని? రాజు లనఁగా నకారణముగనే హాని సేయువారా? ఒక్కొకరాజు తనకు మేలు చేసిన వారి యెడనే పగవహించును. కీడొనరించిన వారియందమిత మగు ప్రీతిఁ జూపును. సేవాధర్మమిట్టిది. ఇందలిరహస్యము యోగులకైన నెఱుఁగ రానిది.

మంచిగంధపుఁ జెట్టునఁ ద్రాచుఁ బాములుఁ, జక్కని కమలములుగల చెఱువులందు మొసళ్లు, సుఖములయందు విఘ్నములుఁ జేరియుండును.

మంచిగంధపుఁ జెట్టున మొదట సర్పములు చుట్టుకొని యుండును. కుసుమములయందుఁ దుమ్మెదలు క్రమ్ముకొని యుండును. శాఖములపై నెలుఁగుబంటులు నివసించును. శాఖాగ్రములపైఁ గోఁతు లల్లరిచేయుచుండును. దానియందు దుష్టులాశ్రయింపని భాగము గొంచెమైనను లేదు. ఈ ప్రభువు మాటలు తియ్యఁగాఁ బలుకును. హృదయమున విషము ధరించియుండును. చేష్టలన్నియుఁ బ్రేమమయముగఁ గానఁబడును. ఈతఁ డీవిద్య యెచ్చట నేర్చినాఁడో కదా!

సముద్రము దాఁటుటకు నావయుఁ, జీకటి దొలఁగించుటకు దీపము, గాలి లేనపుడు విసనకఱ్ఱయు, నేనుఁగుల మద మణఁచుట కంకుశము ననెడి యుపాయములు దేవుఁడు కల్పించియున్నాఁడు. కాని దుష్టుని మనసు మార్చుట కే యుపాయములుఁ జూపఁజాలక భగ్నమనోరథుఁ డయినాఁడు." అని తలపోసి మరల నిట్టూర్పుపుచ్చి యిట్లు చింతించెను.

"కేవలము సస్యముఁ దిని జీవించు నన్ను మృగరాజేల చంపవలయును? విత్తము, బలము, సమముగాఁ గలవారితోఁ గలహించుటకుఁ గారణముండును గాని నావంటివానిపైఁ గోప

మేల కలుగవలయును. ఎవఁడు నాపై రాజున కలుకపుట్టిం చెనో తెలియదు.

స్ఫటికముతోఁ జేయఁబడిన వలయము విఱిగినచో మరల నదుకరాని యట్లు రాజునకు విముఖత గలిగినపుఁ డాతని మనసు మరలుప శక్యముగాదు.

పిడుగు, రాజతేజము మిక్కిలి భయంకరములు. అందు మొదటిది యొక్కచోటనే పడును. రెండవది యన్నిప్రదేశము లందుఁ బడును.

ఇఁక నాతని యాజ్ఞ కెదురు చూచుట మంచిదిగాదు. మరణించిన స్వర్గము గలుగును. శత్రునిఁ జంపిన సుఖము గలు గును. శూరునకీ రెండే మంచిదారులు. యుద్ధము చేయ కున్నను మరణము తప్పనిసరియై, యుద్ధము చేయునెడ బ్రదుకు టకుఁ గొంచెమైన వీలున్నపు డది యుద్ధముచేసి తీరవలసిన సమయమని బుద్ధిమంతులు తలఁచెదరు. కావున యుద్ధమొన రించి చచ్చుటయే మేలు.” సంజీవకుఁ డీవిధమున నాలోచించి దమనకునితో నిట్లనెను.

“మిత్రమా ! ఆతఁడు నన్నేవిధమునఁ జంపఁ దలఁచె నని నీయభిప్రాయము ?”

దానికి దమకుఁడు “పింగళకుఁడు చెవులు నిగిడించి నోరు దెఱచికొని, చరణములెత్తి నీమీఁది కుఱుకుటకు సిద్ధ

పడినపుడు కొలఁది గడియలలో నీవే తెలిసికొనఁగలవు. కాని యీ విషయ మంతయు గుప్తముగా నుంచుము. రహస్య మేమాత్రము వెల్లడియైనను నీతోఁబాటు నాకును జీవితము నేఁటితో సరి.” యని సమాధాన మిచ్చెను. కొంతసే పిట్లు తగని వగలు నటించి సంజీవకునిఁ బింగళకుని మీఁద యుద్ధము నకుఁ బురికొల్పి యాతని వీడుకొని కరటకుని కడకుఁ బోయెను. ఆతఁ “డేమి జరిగినది” యని యడుగఁగా దమ నకుఁ డిట్లు చెప్పెను.

“సందియమేల? దుష్టులకుఁ జుట్టములును, యాచించి నచోఁ గోపింపనివాఁడును, విత్తముతో సంతుష్టినొందువాఁ డును నెందైన నుందురా?”

ఈ విధముగాఁ బలికి తిన్నఁగా దమనకుఁడు పింగళకుని కడ కేఁగి వందన మాచరించి యెంతో దిగులు చెందిన వాని వలెఁ గూరుచుండెను. పింగళకుఁడు “దమనకా! సంజీవకుని వైఖరి యేమైన మరలఁ దెలియవచ్చినదా?” యని ప్రశ్నిం పఁగాఁ “బ్రభూ! చెప్పుటకు నోట మాట రాకున్నయది. ఆతఁ డెంతదుష్టుఁ డయినను నేమైనను మంచి యూహ కలుగు నేమో యని యాసించి యాతనిజాడ గనిపెట్టి యుంటిని. ఆతఁడు తనపాపపుఁ జింత విడువలేదు సరికదా! యిఁక నెంత మాత్రము నాలసింపక ప్రభువువారి కాపదగలిగింప నుద్యుక్తుఁడై యున్నాఁడు. కొలఁది నిముసములలోనే ప్రభువు వారి

మీఁది కాతఁడు రాఁగలడని యాతని వైఖరింబట్టి నాకుఁ దోఁచినది. కావునఁ బ్రభువువా రేమఱక యుండుదురు గాక యని నా మనవి. ”

## సంజీవకుని వధ

దమనకుఁ డిట్లు పలుకుచుండఁగనే పింగళకునకు దూర మున సంజీవకుఁడు వచ్చుచున్న జాడ తోఁచెను. అంతటఁ బెల్లు బికి వచ్చుచున్న కోపము నడఁచుకొనఁ జాలక నోరు దెఱచి కొని చరణము లెత్తి మీఁదికి దుమికి సంజీవకు నొక్కుమ్మడిఁ జీల్చివేయుటకు సంసిద్ధుఁడై యుండెను.

సంజీవకుడును దూరమునుండియే పింగళకుని వైఖరిం జూచి దమనకుఁడు చెప్పిన దంతయు ‘ అక్షరాల ’ నిజము కదా! యని యెంచి తనశక్తి కొలదియు విక్రమముఁ జూప దలఁచి తలవంచి కొమ్ము లేటవాలుగాఁ జేసి యతి వేగమున సింహము నొక్క క్రుమ్ము క్రుమ్మెను. పింగళకుఁడు నాదెబ్బకు నొచ్చుకొనియు సంజీవకుని బలమునకు మెచ్చుకొని, తనకు గలిగిన యవమానము భరింపలేక మండిపడి యావృషభముం జిత్రవధ గావించి కసిదీర్చుకొనెను.

పిమ్మటఁ గొంతసేపటికిఁ బ్రాణమిత్రుడగు సంజీవకుని జంపుట యక్రమమని తలఁపు గలిగి పింగళకుఁడు దుఃఖా క్రాంతుఁడై యిట్లు చింతించెను.

" పాపము లన్నిటికి రాజే పాత్రుం డగును. ఇతరులు రాజ్యసుఖ మనువింతురు. రాజ్యమునఁ గొంతభాగముం గోలు పోయిన నెన్నఁడైనను మరల సంపాదింపవచ్చును. ఉత్తము లగు సేవకులం గోలుపోయిన యెడల నట్టివారు తిరిగి లభించుట యసంభవము. "

ఇట్లు విచారించుచున్న పింగళకుం జూచి దమనకుఁడు " స్వామీ ! పగవానిం జంపి విచారించుట పాడిగాదు. సుతుఁడుగాని, సోదరుడుగాని, సఖుఁడుగాని, యపాయముఁ గలిగింపఁ దలఁచెనేని సంపదల నందగోరు రాజు వారిం జంపితీర వలయును. ధర్మార్థ కామముల తత్త్వమెఱింగిన వారెవరు నతి దయకు లోనుగారాదు. మితిమీఱిన యోరిమిగలవాఁడు చేతఁ జిక్కిన ఫలమయిన ననుభవింపఁ జాలఁడు. మిత్రుల యెడలను, శత్రుల యెడలను సమానముగా శాంతిఁ బూనుట యోగులకు మాత్రమే తగును. ఆశాంతియే యపరాధులందు జూపుట రాజులకు దోసమగును. అహంకారము చేతను, రాజ్యమందలి యాశచేతను బ్రభుపదము నాక్రమింపఁ దలచు వానికి మరణదండన మొక్కటియే ప్రాయశ్చిత్తము.

జాలిగలరాజు, సర్వభక్షకుఁడగు బ్రాహ్మణుఁడు, వశము దప్పిన భార్యయు, దుష్టచిత్తుఁ డగు మిత్రుఁడును బ్రమాదముఁ గలిగించు నధికారియుఁ, జేసినమేలు మఱచు వాఁడును సర్వదా విడువందగువారు. రాజనీతి వేశ్యాంగన

వంటిది. ఒకపుడు సత్యముతోను మఱియొకపు డసత్యముతోను గూడినదై యుండును. ఒకపుడు గాఠిన్యము గలిగియుండి మరియొకపుడు ప్రియవచనములతోఁ గూడినదై యుండును. ఒకపుడు క్రూరముగను నింకొకపుడు దయా యుక్తముగను నుండును. ఒకపుడు లోభముగలిగియుండి మఱియొకపుడు దానగుణముతో నొప్పు చుండును. ఒకపు డతివ్యయము గలదియు, మఱొకపుడు విస్తారమయిన ధనము, రత్నములు సంపాదించునదియునై యుండును.” అని బోధించి యోదార్పఁగాఁ బింగళకుఁడు సరిపెట్టుకొని యూరడిలి యుండెను. దమనకుఁడును సంతసిల్లి ‘సకలజనులకు శుభమును, రాజునకు జయమును వర్ధిల్లునుగాక’ యని పలికి తిరిగి రాజాదరము నొంది సుఖముగా నుండెను.”

అని వినిపించి విష్ణుశర్మ రాజపుత్రులతో నిటులనెను. “ మీరిపుడు మిత్రభేదము సాంతముగా వినియుంటిరి. మీరును శత్రునిలయములం దిటులే మిత్త్రభేదముఁ గల్పించి విజయముం గాంచి వర్ధిల్లుఁ” డని పలికెను.

# సంపూర్ణ నీతిచంద్రిక

[ ద్వితీయ భాగము ]

విగ్రహము - సంధి

2

విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# వి ష య సూ చి క



పుట

## విగ్రహము :

## సంధి :



---

# సంపూర్ణ నీతిచంద్రిక

## ద్వితీయ భాగము

## విగ్రహము

అనంతరము రాజకుమారులు విష్ణుశర్మతో "ఆర్యా! మీదయవలన మిత్రభేదము సాంతముగా వింటిమి. విగ్రహము వినఁ గుతూహలముతో నున్నాము." అని పలుక, విష్ణుశర్మ యిటులు చెప్పఁదొడఁగెను.

"సమానబలముగల హంసలకు మయూరములకు విరోధము గలిగినపుడు వాయసము శత్రుమందిరమం దుండి నమ్మించి హంసలను వంచించినవి. మీకా కథ వివరించెదను వినుఁడు.

### హిరణ్యగర్భుని వృత్తాంతము

కర్పూరద్వీపమున పద్మకేళి యను పేర నొప్పు నొక చెఱువు గలదు. అందు హిరణ్యగర్భుడను రాజహంస నివసించుచుండెను. అది జలచరములగు పక్షు లన్నిటిచే పక్షి రాజుగా నభిషేక మొందెను. ప్రజలు, చక్కఁగా నడపు నాయకుఁడు లేకున్నచో కర్ణధారుఁడులేని నావవలెఁ బ్రమాద మొందుదురు. ప్రజను రాజు రక్షించినచో ప్రజ రాజును గాపా

డును. పెంపుసేయుట కన్న ఉన్నదానిని రక్షించుట మంచిది. రక్షణము లేకున్న పోషణమున కవకాశమే యుండదుకదా!

ఒకనాడు రాజహంస చక్కగా పఱుపఁబడిన కమల పర్యంకమున గూరుచుండి పరివారముతోఁ గొలువుదీరి యుండెను. అపుడు దీర్ఘముఖమను నొకకొంగ యెచట నుండియో వచ్చి ప్రభువునకు నమస్కరించి కూర్చుండెను.

రాజపుడు "దీర్ఘముఖుఁడా! దేశాంతరమునుండి వచ్చి యుంటివి. విశేషము లేమైన నున్నఁ జెప్పుము." అనెను. అపుడా బకము "ప్రభూ! గొప్ప విశేషము గలదు. అది తమకు మనవి చేయుటకై తొందరపడి వచ్చితిని. జంబూ ద్వీపమున వింధ్యమను పేరుగల కొండ గలదు. అచట చిత్ర వర్ణుఁ డను మయూరము పక్షులకు రాజై యుండెను. నే నొక యడవిలోఁ దిరుగుచుండగాఁ జిత్రవర్ణుని యనుచరులు నన్ను జూచి 'నీవెవఁడవు? ఎచటనుండి వచ్చితివి?' అని యడుగ నే నిటుల చెప్పితిని.

"కర్పూర ద్వీపమునకు జక్రవర్తియైన హిరణ్యగర్భు డను రాజహంసుని యనుచరుఁడను. దేశాంతరములఁ జూడ వలయు నను వేడుకతో నిచటికి వచ్చితిని."

అపుడు వారు 'మీ దేశము, మా దేశముఁ జూచితివి గదా! ఈ రెండు దేశములలో నేది యుత్తమమైనది? ఏ దేశపు

రాజు యోగ్యుఁడు, సమర్థుఁడు నై యున్నాఁ' డని ప్రశ్నింప; నే నిటు లంటిని :

" ఏమి పలుకుచుంటిరి ? చాలభేదము గలదు. కర్పూర ద్వీప మనగాఁ గేవలము స్వర్గమే. మరియు రాజహంస యపర దేవేంద్రుఁడు. ఈమరుస్థలమున బడియున్నచో మీ కేమి ప్రయోజనము ? మా దేశమునకు రండు. "

నాపలుకులకు వానికన్నింటికిఁ గడుంగడుఁ గ్రోధము కలిగినది. అది యుచితమే. ఎట్లన ; పామునకుఁ బాలువోసి పెంచిన వాని విషము వర్ధిలునటులు మూర్ఖుల కొనరించిన మంచిబోధ వారికిఁ గోపము కలిగించునే కాని శాంతి నొసఁ గదు. మఱియు నెఱుక కలవానికి బోధింపవలయుఁ గాని మూర్ఖున కెన్నఁడును బోధింపరాదు. వానరముల కుపదేశించి పక్షులు స్థానభ్రష్టములైన కథయొకటి కలదు. దాని నెఱిం గింతును వినుము.

## వానరములకుఁ బోధచేసి చెడిన పక్షుల కథ

నర్మదాతీరమున నొక విశాల మైన బూరుగుచెట్టు గలదు. అచట గూళ్ళు కట్టుకొని పక్షులు కొన్ని సుఖముగా వాసము చేయుచుండెను. వర్షాకాలమున నొకనాఁ డచట నాకస మంతయు మబ్బు లావరించి ధారాపాతముగా వాన పడెను.

కొన్ని వానరములు వానకుఁ దడిసి, చలికి బాధపడుచు బూరుగుచెట్టుక్రిందకుఁ జేరినవి. వాని పట్ల జాలికలిగి పక్షులు 'ఓ వానరములారా! మేము మా యల్పశక్తిగల ముక్కులతో నెట్లో తృణములు సేకరించి గూండ్లుకట్టుకొని యుంటిమి. కరచరణాదులు కలిగియు మీ రిట్లేల దుఃఖపడవలయును?" అని పలికినవి. పక్షులపలుకులు వినుసరికి కోఁతుల కసూయ కలిగినది. 'చలిగాలి తగులని గూండ్లనడుమ సుఖముగా నుండి యీపక్షులు మనలను నిందించుచున్నవి. వాన వెలిసిన వెనుక వానిపని పట్టెంతు' మని కూడఁబలికికొని వానరములా బూరుగుచెట్టెక్కి పక్షిగూండ్లన్నిటిని భగ్నపఱచి గ్రుడ్లను చిదిపి క్రిందఁబడవైచినవి. కావున మూర్ఖులకు బోధింపరాదు."

అని దీర్ఘముఖుఁడు పలికిన మాటలు విని రాజహంస "పిమ్మట నా పక్షు లేమి చేసినదియుఁ జెప్పు" మని యడిగెను మరల బక మిట్లు చెప్పఁదొడఁగెను. 'ఆ పక్షులు గోపగించి 'రాజహంసను రాజును చేసిన వా రెవ' రని ప్రశ్నించినవి. 'మీ మయూరమునకు రాజ్యాభిషేకము చేసినవా రెవ' రని నేను కోపమునఁ బ్రశ్నించితిని. నాప్రశ్న కలిగి యవి నన్నుఁ జంప సిద్ధపడినవి. నేను నూరకుండక నా విక్రమముఁ గొంతఁ జవి చూపితిని.

స్త్రీలకుఁ సిగ్గు సొగసు కూర్చునటులు పురుషులకు నోరిమి యొకపుడు భూషణ మగును. కాని పరిభవము

రాఁబోవునపుడు విక్రమింపక తప్పదుగదా!" యన రాజ హంస "తనబలము నెదిరిబలముఁ జక్కఁగాఁ బరిశీలించి తారతమ్యము గుర్తింపనివాఁడు శత్రువులచేఁ నవమానింపఁ బడును. అది గ్రహింపక వాగ్దోష మొనరింపరాదు. చిర కాలము పులిచర్మము గప్పుకొని సస్యముతోనిండిన పొలమున సుఖముగాఁ దిరుగుచు వాగ్దోషమువలన గదా పూర్వ మొక గాడిద చనిపోయినది? నీ కాకథ వినుతు" నని బకముతో నిట్లు చెప్ప మొదలిడెను.

## వాగ్దోషము వలనఁ జెడిన గాడిద కథ

హస్తినాపురమున విలాసుఁడను నామముగల చాకలి యొక్కఁడుగలఁడు. వాని గాడిద బరువుమోసి మోసి, చిక్కి శవమువలె నయ్యెను. దానిఁజూచి యారజకుఁడు పులితోలు సంపాదించి దానిపై గప్పి యరణ్యసమీపమున నొక పంట పొలముమీఁద విడిచెను. అనంతరము దానిని జూచి పులి యని భ్రమసి పొలముకాపులు పాటిపోవఁజొచ్చిరి.

కొంతకాలమట్లు గడచిన వెనుక నొక పొలము కాపరి బూడిదరంగు గల కంబళము గప్పుకొని, విల్లమ్ములు సిద్ధ పఱచుకొని, యొకచో దాగి యుండెను. స్వేచ్ఛతో సస్యములు దినుటచే బలిసిన యాగార్దభ మాతనిఁజూచి, వేఱొక గాడిద, యని భావించి, జాతిస్వభావముచే బిగ్గరగా నోండ్ర పెట్టుచు నెదురుగాఁ బరుగిడెను.

సస్యరక్షకుఁ డా ధ్వనింబట్టి 'యది గాడిదయే కాని పులి కాదని నిశ్చయించి యవలీలగా దానిని జంపివైచెను. కావున బరబల మెఱుగక వర్తింపరాదు; వాగ్ఘోషమునకుఁ బూను కొనరాదు" అని రాజహంస చెప్పినది విని దీర్ఘముఖుఁడు మరల నిట్లు చెప్పఁదొడఁగెను.

"ఆపక్షులు నాపలుకులు విని 'యోదుష్టబకమా! మా భూమియందుఁ జరించుచు మాస్వామి నాక్షేపించు చుంటివి. ఇది యెంతమాత్రము క్షమింపరానిది.' అని చెప్పుచు నవి యన్నియు ముక్కులతో ననుఁ బొడిచి కోపముతో నిట్లు పలికి నవి. 'ఓమూర్ఖుఁడా! మీరాజయిన హంస సర్వవిధముల మృదు వైనవాఁడు. వానికి రాజ్యాధికారము నిండుసున్న. ఏలయన మిక్కిలి మెత్తనివాఁ డఱచేతి యందలి యర్థమునైన రక్షించు కొనఁజాలఁడు. అట్టివాఁడు నేల యెల్లెలఁ గలుగును? వానికి రాజ్యాధికార మెట్లు పొసఁగును? మఱియు నీవు కూపస్థ మండూకమవు. కాఁబట్టియే యట్టివాని నాశ్రయింపుమని మా కుపదేశించుచుంటివి.

ఫలచ్ఛాయా సమన్వితమైన వృక్షము నాశ్రయించినచో దైవికముగా దాని ఫలము లనుభవింప జాలకున్నను దానినీడ ననుభవించుట కేయాటంకము నుండదు. కావున ఘనుల నాశ్రయింప వలయునే కాని హీనుల నెన్నఁ డాశ్రయింపరాదు. క్షీరమైనను గవండ్లదాని హస్తమునఁ బడినచో మద్యమని తలఁప బడును. గుణరహితమైన యాశ్రయమును బొంది

ఘనుఁడు గూడ నల్పుఁడుగాఁ గానఁబడును. మహాగజముచిన్న యద్దమున నల్పజంతువుగాఁ గానఁబడునుగదా! అతిసమర్థుఁ డగు ఱేని పేరు చెప్పికొన్నను నొకపుడు ఫలసిద్ధి యగును. చంద మామ పేరుచెప్పుకొని చెవులుపిల్లులు సౌఖ్యమొందిన కథ యొకఁడు కలదు. నీకాకథ తెలుపుదుము వినుము.

## చంద్రుని పేరుచెప్పుకొని మేలొందిన కుందేళ్ళ కథ

ఒకపుడు వానలు నేమి దాహాపీడితమైన యేనుఁగుల గుంపు తమస్వామినిజేరి 'ప్రభూ! మన కిఁక జీవనోపాయమేమి? క్షుద్రజంతువులైన మునుఁగుటకుఁ దగు గుంట కానరాదు. మనము స్నానమొనరించుటకు దగు వెరవులేక మృతప్రాయు లమై యున్నాము. మనమేమి చేయుదము? ఎచటికిఁబోవుద' మని విలపింప గజరాజు కొంతదూరము తిరిగి నిర్మల జలముతో నిండినయొక చెఱువు గనుఁగొని వానిబాధ తొలగించెను.

ఏనుఁగులన్నియు నామడువునకు వచ్చుచుఁబోవుచుండ గట్టున నివసించుచున్న కుందేళ్లు వానిపాదములద్రొక్కుడుచే మడియుచుండెను.

వానిలో శిలీముఖుఁ డను నొక కుందేలు 'ఈయేనుఁ గుల గుంపు దప్పికచే నిట్లు రోజు నీచెఱువునకు వచ్చుచుండును. అందువలన మన కుల మంతయు నశించునటు లున్నది.' అని పలుక విజయుఁ డను నొక ముదుసలికుందేలు 'విషాదము

నొందకుఁడు. నేను దీనికిఁ బ్రతిక్రియ చేయఁగలఁను' అని శపథముచేసి వెడలెను.

"ఏనుఁగు, స్పర్శమాత్రముననే చంపఁగలదు. పాము, కాటుచే మరణము గలిగించును. భూపాలుఁడు, పరిపాలించుచునే ప్రజను హతమార్చును. దుర్జనుఁడు, నవ్వుచునే హానికలిగించును. కావునఁ గొండశిఖరమెక్కి మఱియు గజనాయకునితో సంవాదమునకు దిగుదు" నని యాలోచించి విజయుఁడట్లు గిరిశిఖర మెక్కెను.

అంతలోఁ గజరాజువచ్చి యాతనిఁజూచి 'నీవెవఁడ, వెచటనుండి వచ్చితి' వని ప్రశ్నింప 'నేను చెవులపిల్లిని. భగవానుఁడగు చందమామ నన్ను నీకడ కనుప వచ్చితిని' అని జవాబిచ్చెను. 'నీవు వచ్చినపనియే' మని హస్తి యడుగ విజయుఁ డిటులనియెను.

"శస్త్రము లెదుటఁ గానబడుచున్నను దూత యథార్థము పలుకవలయునేకాని మఱుగుపఱుపరాదు. కావున దూత యెల్లప్పుడు వధింప నసర్హుఁడు. నేను చంద్రుని యాజ్ఞచొప్పన నుడువుచుంటిని. వినుము. 'ఈ చంద్రసరోవరము గాపాడుచున్న శశకములను నీవు బాధించుచుంటివి. నీవు చేయు పని కడు ననుచితము. చిరకాలమునుండి యవి నారక్షణమున నున్నవి. కావుననే నాకు శశాంకుఁడని ప్రసిద్ధి. కావున జీవితమం దాశ గలదేని యిఁకెన్నఁడు నీ సరోవరము చెంతకు

రావల ' దని చంద్రభగవానుని సందేశము " అని పలుక నాగజపతి ' చంద్రభగవానుఁ డిపు డెచట నున్నాఁ'డని యడిగెను. దానికి విజయుఁడు మీా త్రోక్కుడుచే నశింపఁగా మిగిలిన కుందేళ్ల నూరడించు నిమిత్తము మీా సరసునకు వేంచేసియుండి నన్ను నీకడ కంపె ' ననెను.

అది విని యాగజము ' కరుణింపు. తెలియక యీతప్పు చేసితిని. ఇంకెన్నఁడు నిట్టిపని జరుగదు ' అని పలికి, ' మీా స్వామి నొకపరి చూపుము ప్రణామ మొనరించి వేఱు చోటికిఁ బోవుదు ' నని గజము కోరెను. ' అట్లైన నీ వొంటరిగా ర ' మ్మని యర్ధరాత్రమున నేనుఁగును దీసికొనిపోయి నిర్మలజలము నడుమనున్న చంద్రబింబముఁ జూపి ' స్వామి సమాధియందున్నారు. కావున నెమ్మదిగా నమస్కరించి వెడలిపొమ్ము. కాదేని సమాధిభంగమున కాతఁడు మిక్కిలి కోపించును. ' అని శశకము చెప్పెను.

ఏనుఁగును మిక్కిలి భీతిల్లి యట్లే వందన మాచరించి వెడలిపోయెను. కుందేళ్లాదినమునుండి నిర్భయముగా తమ తమ తావులందు వసించి సుఖముగాఁ గాలక్షేపము చేయుచున్నవి."

అని యాబకములు చెప్పిన పలుకులకు నేను "మాప్రభువగు రాజహంస మహాప్రతాపవంతుఁడు. ఆతఁడు ముల్లోకములు నేలఁగల దిట్ట. ఒక రాజ్యమే యననేల ? " యంటిని.

## దీర్ఘముఖుఁడు చిత్రవర్ణుని దర్శించుట

అపు డవి కోపించి వారి రాజగు చిత్రవర్ణునొద్దకు నన్నుఁ జేర్చి 'ప్రభూ! అవధరింపుము. ఈ దుష్టమగు కొంగ మన దేశమున సంచరించుచు దేవర నాక్షేపించుచున్నది' అని విన్నవించినవి. 'ఈతఁ డెవఁ' డని రా జడుగ 'హిరణ్యగర్భుఁ డను రాజహంసుని యనుచరుఁడు కర్పూరద్వీపమునుండి యీతఁడు వచ్చినాఁడు.' అని దెలిపినవి.

అపు డచటనున్న మంత్రియగు గృధ్రము నన్నిట్లు ప్రశ్నించెను. "మీరాజ్యమున ముఖ్యమంత్రి యెవరు?" "సకలశాస్త్రమర్మము లెఱిగిన సర్వజ్ఞుఁ డను చక్రవాము మాకు మంత్రి" యని నేనంటిని. "ఇది యుచితముగా నున్నది. మీమంత్రి స్వీయదేశస్థుడే; 'దేశస్థుని, కులాచారముల శుద్ధుడైనవానిని, వ్యసనములు లేనివానిని, మంత్రజ్ఞునిఁ, బండితునిఁ, గోశముఁ బెంపొందింపఁ గలవానిని మంత్రిగా నియమించుకొనవలయు' నని ఆర్యులు పలుకుదురు" అని యా గృధ్రము చెప్పుచుండునంతలో నచటి చిలుక కల్పించుకొని యిట్లనెను.

"ప్రభూ! కర్పూరద్వీపము మున్నగునవి జంబూద్వీపమున నంతర్గతమైన చిన్న దీవులు. వానిపై నధికారము దేవరవారిదే."

దాని కా రాజు "ఔనౌను. రాజు, మత్తుఁడు, శిశువు, ధనికుఁడు నలభ్యము లైన వానిం గూడ వాంఛించును. సులభముగా లభించువాని నేల యుపేక్షింపవలయును" అని పలుక నపుడు నేను "మాటాడిన మాత్రమున నాధిపత్యము లభించునట్లైన మాప్రభువునకు జంబూద్వీపముపై నధికారము గల" దంటిని. 'దీనిని నిర్ణయించు టె' ట్లని చిలుక ప్రశ్నించెను. 'దీని నిర్ణయించునది యుద్ధమే' యని నేను బదులు పలికితిని.

అపుడు రాజు 'మీస్వామి కడకేఁగి సిద్ధపఱుపు' మని నుడివెను. 'మీదూతను కూడ నావెంట పంపుఁ' డని నే నన; రాజు "మీలో దూతగా నెవ్వరు వెడలుదురు? భక్తుఁడు, గుణవంతుఁడు, పవిత్రుఁడు, సమర్థుఁడు, శత్రుమర్మములనెఱుఁగఁ గలవాఁడు దూత కృత్యమున కర్హుఁ" డని పలుక గృధము "ఇట్టివారు పెక్కుమంది కలరు; కాని వారిలో బ్రాహ్మణుడే పంపదగువాఁడు. ఆతనికి రాజధనమం దపేక్ష యుండదు." అను మాటలు పలుక రాజు "అట్లైనఁ జిలుకయే యీపనికి వెడలవలయును. ఓశుకమా! నీ వీతనితో నేఁగి నా యభిలాషను రాజహంస కెఱింగింపుము" అని యాజ్ఞాపించెను.

ఆయాజ్ఞ విని శుక మిట్టు లనియె. దేవరవారి యాజ్ఞకు విధేయుఁడను. కాని యీబకము కడుదుష్టమైనది. కావున దీనితో వెళ్ళఁజాలఁను. దుష్టు లొనరించు నేరమునకు ఫలితము

వారివెంటఁ జను సాధువు లనుభవింతురు. సీతను రావణుఁడపహ రింపగా మహోదధికి బంధనము ప్రాప్తించెనుగదా! కావున దుష్టునితో వసించుట, పయనము సేయుట యుక్తము కాదు. కాక స్నేహమువలన నొక హంసయు, నొక వర్తక పక్షియు హాని చెందెను. నీ కా కథ యెఱింగింతును వినుము.

## కాక స్నేహమున మరణించిన హంస కథ

ఉజ్జయినీ మార్గమున నొక జువ్విచెట్టు గలదు. అచట హంస కాకములు వసించుచుండెను. గ్రీష్మకాలమున నొక నాఁడు బాటసారి యొకఁడు మార్గశ్రాంతుఁడై యాచెట్టు నీడను విల్లమ్ములు నిడుకొని నిదురించెను. క్షణకాలమున నాతని ముఖమునుండి నీడ తొలఁగిపోయెను. ఆతని ముఖమున గాటమగు నెండ సోకుచుండెను. అది చూచుచున్న చెట్టు మీఁది యంచకు జాలికలిగెను. అది తన ఱెక్క లాతని ముఖ మున్పై నీడ పడునట్లు విప్పియుంచెను. కొంత సేపైన పిదప సుఖనిద్ర నొందిన యాతఁడు నోరు తెఱచి యావులించెను. అపుడు పరసుఖమును సహింపనిదియు, సహజముగా దుష్ట మైనదియు నగు కాకి యాతని నోట రెట్టవైచి పాఱిపోయెను. బాటసారి తలపైకెత్తి చూచుసరికి హంస కానఁబడియె. ఈపని చేసిన దిదియే యని తలఁచి యాతఁడు తన వింటిచేఁ గొట్టి దానిం జంపివైచెను.

## కాక స్నేహమువలనఁ జనిపోయిన వర్తక పక్షి కథ

ఒకపుడు గరుడయాత్ర నిమిత్తమై పక్షులు బయలుదేరి సముద్రతీరమున కేఁగినవి. అపు డొక కాకివెంట నొక వెలిచె పిట్టకూడ జనుచుండెను. గోపాలుఁ డొకఁడు పెరుగు కడవ తలపై నిడుకొని పోవుచుండెను. కాకి యా కుండ యందలి పెరుగు మాటిమాటికి దొంగిలించి తినుచుండెను. పెరుగుకుండ క్రిందనుంచి గొల్లఁడు పైకి చూచుసరికి కాకవర్తకములు గానఁ బడియె. అద నెఱిఁగి కాకి పాఱిపోయెను. ఆ వర్తకపక్షి నిజముగా నిరపరాధి కావున మెల్లగా నెగురుచుండ గొల్లఁడు దానింబట్టి చంపివైచెను. కావున నే నిట్లు చెప్పవలసివచ్చెను.''

ఆ శుక మిట్లుపలుకఁగా, నే నిట్లంటిని. "సోదరశుకమా ! యిట్లు పలుకుట దగదు. నాకు ప్రభు వెంతయో నీవు నంతియ.'' నామాటల కది 'యగుఁగాక దుష్టుల పలుకులు ప్రియముగాఁ గానఁబడినను నకాల కుసుమముల వలె భయ సంజనకము లగును. నీ మాటలవలననే నీ దుర్జనత్వము వెల్లడి యగుచున్నది. మన, భూపాలు రిర్వురకు యుద్ధకారణము నీ మాటయే కదా!' యని బదులాడెను.

అపుడు రాజును నన్నుఁ దగురీతి సత్కరించి పంపెను. చిలుకయు వెనుక నుండి వచ్చుచుండెను. ఈ వృత్తాంత మంతయుఁ జిత్తగించి కర్తవ్య మాలోచింపు'' డని దీర్ఘ ముఖుఁడు రాజహంసతో బలికెను.

అపుడు మంత్రి యగు చక్రవాక మిటు లనియెను. "దేవా! ఈకొంగ విదేశములకుఁగూడ నేఁగి తనకుఁ దోఁచిన రీతి రాజకీయములు నడిపెను. మూర్ఖుల విధ మిట్టిదియే నూ ఔసఁగియైన వివాద ముడిపికొనుట విజ్ఞుని లక్షణము. కారణము లేకున్నను వివాదమునకు దిగుట మూర్ఖుని చిన్నె."

ఆ పలుకులు విని రాజహంస "నిందించుటవలన నేమి లాభము ప్రస్తుత కర్తవ్య మాలోచింతము" అనియెను. అపుడు మంత్రి "స్వామీ ఏకాంతమున మాటాడుదము. వర్ణాకార నేత్రముఖసంజ్ఞాదులచే మనసు నూహింపఁ గలరు. కావున మంత్రాలోచనము రహస్యమునఁ జేయఁదగును." అను పలుకులు విని యితరు లందఱు వెడలిపోయిరి.

అపుడు చక్రవాకము "ప్రభూ! నా కిటులు దోఁచు చున్నది. మన యుద్యోగులలో నెవరో యొకరి ట్టీ బకమును పురికొలిపి యుందురు. వైద్యులకు రోగార్తుఁ డవసరము. ఉద్యోగులకు వ్యసనపరుఁడగు ప్రభువు ప్రియుఁడు. పండితులకు మూర్ఖుఁడన్న వింత. సత్పురుషులకు మాత్రము మంచి విషయములం దిష్టము" అని పలికెను.

దానికి రాజు "అగుఁగాక! కారణము పిమ్మట నిశ్చ యింతము. ముందు కర్తవ్యము నిరూపింపవలయును." అనెను. అపుడు చక్రవాకము "దేవా! గూఢచరు నొకనిఁ బంప వలయును. పిమ్మట వారిజాడ, బలాబలము తెలియుంగఁ దగును.

పరరాష్ట్రము లందలి కార్యాకార్యము లెఱుఁగఁ జాలిన గూఢచారులులేని రాజు నిక్కముగా నంధుఁడు.

ఆ దూత యొక విశ్వాసపాత్రుఁడగు ననుచరునిఁ దీసి కొని వెడలుట మేలు. ఒకఁ డచటనుండి అచటి మంత్రకార్యము చక్కగా రహస్యముగా నెఱింగి రెండవవానికిఁ దెలిపి పంప గలఁడు. గూఢచారుఁడు జలస్థలముల రెండింటఁ జరించువాఁ డగుట మంచిది. కావున నీబకమునే పంపుము. ఇట్టి మఱొక బకమునే సహాయునిగా బంపుము. ఈసంగతి యతిరహస్య ముగాఁ గావింపుము ముర్వురిచెవుల బడిన మంత్రాలోచనము వెల్లడియైపోవును. కావున రాజెపుడు మూఁడవవాఁ డుండగా మంత్రాలోచన చేయరాదు. 'మంత్రము భగ్నమైనందున కలుగు ననర్థములు చక్కబఱుప నశక్యము' లని నీతివిదులు పలుకుదురు." అను మంత్రిమాటలకు రా జాలోచించి "నాకుఁ దగిన గూఢచరుఁడు లభించినాఁ" డని పలికెను. దానికి మంత్రి "యత్నైన సంగ్రామమున విజయము లభించినట్లే" యనెను.

## చిలుక రాయబారము

ఇంతలో ద్వారపాలకుఁడువచ్చి నమస్కరించి "జంబూ ద్వీపమునుండి వచ్చిన యొకశుకము తమ దర్శనార్థము ద్వార మున నుండె నని విన్నవింప రాజహంస చక్రవాకమువైపు చూచెను. అపు డా చక్రవాకము "ఆతని నతిథి బసయం

దుంచుము. పిమ్మటఁ జూడవచ్చు నన ద్వారపాలకుఁ డాతనిఁ దీసికొని వెడలిపోయెను.

రాజు జక్రవతో "మనకిఁక యుద్ధము సంప్రాప్తమయి నట్లే" యనఁ జక్రవాకము "ముందుగనే యుద్ధము చేయ రాదు. ముందుగనే యుద్ధమునకును, స్వభూమిఁ ద్యజించుట కును ననాలోచితముగాఁ బ్రభువును బ్రోత్సహించు నాతఁడు దుష్టమంత్రి యనఁబడును. శత్రువులను రణముచే జయింపవలె నని యెన్నఁడు దలఁపరాదు. యుద్ధములో జయ మెవ్వరి కగునో యేరి కెఱుక? సామదానభేదములలో నే యొకదానిచేఁ గాని; లేదా యన్నింటిచేఁగాని వైరులను సాధించుటకు యత్నింపవలయును. యుద్ధమునఁ జొరబడి యరుల సామ ర్థ్యముఁ జవిచూడనంతవఱ కందఱును శూరులే.

ఇఁక యుద్ధము సమీపించినదను సంగతి గమనింపఁ దగినది. సకాలప్రయత్నమువలనఁ గృషిఫలించునటులు నీతి చక్కగా రక్షింపబడినచోఁ జిరకాలము ఫలింపగలఁదు. యుద్ధము దూరముననున్నపుడు భయమును, సమీపించిన కొలఁదియు శూరత్వమును మహాత్ములలక్షణములు. ఆపద కలిగినపుడే మహాత్ముఁడు ధైర్యము నొందఁగలఁడు. తొందర పాటు సకలసిద్ధులకుఁ గడు నంతరాయము. అతిశీతలమైన జలము పర్వతముల గదల్చివేయలేదా ?

మఱియు మయూరరాజగు చిత్రవర్ణుఁడు మహాబలుఁడు. బలవంతునితో సంగర మొనర్పవలె ననుట కెచటను దృష్టాంతము

గానరాదు. ఆయుద్ధము తగరుకొండను డీకొనుటయే కూర్మము వలె కాలము కానపుడు సంకోచ మొంది యవమానమైన సహింపఁదగును.

సమయము సంప్రాప్తించినపుడు నీతిజ్ఞుడు క్రూరసర్పము వోలె విజృంభింపవలయును. నదీవేగము తృణములను సమాన ముగా పెకలింపఁ గలుగున ట్లుపాయశాలి యెట్టివానినైన నున్మూలింప శక్తుఁ డగును.

కావున నాదూతను రావించి దుర్గము సన్నద్ధ మొనర్పఁ బడువఱకుఁ గాలయాపన చేయఁదగును ఏలయన ; గోటయం దున్న యొక్క యోధుఁడు బయటి నూఱుగురితోఁ బోరఁగలడు. నూఱుగు రైనచో లక్షమందితో యుద్ధ మొనరింపవచ్చును.

కావున దుర్గమం దిట్టి విశేషము గలదు. దుర్గమున లేని రాజు తెప్పనుండిజాఱిన మనుజునివంటివాఁడుఁ అట్టివాఁడు శత్రుపరాభవమునకు సులభుఁడు.

దుర్గముచుట్టుఁ బెద్ద యఖాతముఁ ద్రవ్వింపవలయును. ఉన్నతమైన ప్రాకార ముండదగును. కొండలనుగాని, నదుల లనుగాని, వనములనుగాని, యాశ్రయించి యుండవలయును. విస్తీర్ణత, అతివిషమత్వము జలసమృద్ధి, ధాన్యసమృద్ధి, కట్టెల సమృద్ధి, ప్రవేశము, నపసారము ననునవి దుర్గమునకు సప్తసంపద లనఁబడును." అని చక్రవాకము పలుక; రాజహంస 'అయిన

దుర్గ సన్నాహమున నెవరు నియమింపఁదగుదు' రనఁ జక్ర వాకము మరల నిటు లనియె.

"ఎవ డేపనియందు సమర్థుడో వాఁడాపనియందు నియోగింపఁదగినవాఁడు శాస్త్రపండితుఁడు కూడ వ్యవహారానుభవము లేమి బ్రమాద మొందుటగలదు. కావున సారస పక్షిని రప్పించుట యుచితము"

ఆప్రకారము పిలువఁబడి వచ్చిన బెగ్గురుపక్షితో రాజిటు లనియెను. 'ఓయీ, సారసా! నీవు శీఘ్రముగా నొక దుర్గము నిర్మింపు' మన నా సారసము "ప్రభూ! ఇప్పటికపుడే దుర్గము సునిర్మితమై యున్నదనియే భావింపుము. ఈ మహా సరోవరమధ్యమందలి ద్వీపమున ద్రవ్యములన్నియుఁ జేర్చుటయే తరువాయి. అన్నిటికంటె నాహార ధాన్యాదిక సంగ్రహమే కడుంగడు ముఖ్యము. ముఖమున మణు లునిచినను నాహారము లేనిదే ప్రాణధారణ మసంభవము కదా! సర్వ రసములకు నుత్తమము లవణము. అది లేనియే వ్యంజనమైనను గోమయ తుల్య మగును." అని విన్నవింప; రా 'జటులైనఁ ద్వరితముగఁబోయి సకలము సమకూర్పుము' అని యాజ్ఞాపించు నంతలోఁ బ్రతీహారి ప్రవేశించి 'దేవా సింహళద్వీపము నుండి మేఘవర్ణమను వాయసము సపరివారముగా నరుదెంచి 'భవదీయదర్శనాపేక్షతో ద్వారమం దుండె' నని విన్నవించెను.

## హిరణ్యగర్భుడు మేఘవర్ణుని గొలువునఁ జేర్చుకొనుట

'కాకములకు బహువిషయములు తెలియును గానఁజేర్పఁ దగు'నని రాజు పలుకఁ, జక్రవాకము 'నిజమేకాని కాకము స్థలచరము, మఱియు శత్రుపక్షమున నుద్యోగి; కాన నెటులు చేర్పఁ దగును ? ఆత్మపక్షము విడిచి పరపక్షముం జేరు మూఢుఁడు నీలివర్ణపు నక్కవలెఁ బరులచే హాని నొందును. నీ కా జంబుకము గాథ తెలుపుదును వినుము.

## ఆత్మపక్షము విడిచి పరపక్షముఁ జేరి మరణించిన నక్క కథ

ఒక యరణ్యమున నొక జంబుకము గలదు. అది యొక నాఁడు నగర పరిసరములందు స్వైరముగాఁ దిరుగుచుఁ బ్రమాదమున నొక నీలిమందుకుండయందుఁ బడెను. పడి దానినుండి లేవఁజాలక ప్రాతఃకాలమునఁ, జనిపోయినదానివలె నటించెను. అపుడు యజమానుఁడు వచ్చి, యది చచ్చినదని తలఁచి దూరముగాఁ బాఱవైవ నది యచటినుండి పాఱిపోయెను.

అనంతర మది యడవిలోనికిఁ బోయి తన నీలవర్ణముఁ జూచుకొని యిటులు తలపోసెను. 'నా రం గిపుడు ప్రశస్తమైనది కావున నేను నా గొప్పతనముఁ జాటుకొనవలదా?' అని యాలోచించి, తన జాతి నక్కలను బిలిచి యిటు లనియె. 'నా కీ వనదేవత స్వహస్తములతో వన రాజ్యమున సకలౌషధి రసములచే నభిషేక మొనరించెను. కావున నేఁటినుండి యీ

యరణ్యమున నాయాజ్ఞచే వ్యవహారములు నడుపుకొన వల యును' అని పలుక, నక్కలన్నియు దాని వర్ణవిశేషముం జూచి, సాష్టాంగ నమస్కారములు చేసి దాని యాజ్ఞ లంగీక రించెను. ఈ రీతిగా సకలారణ్య వాసులయందు నధికారము దానికి లభించెను. అనంతర మా జంబుకముజాతి వార లందఱి సహాయ ప్రోత్సాహములచే ఘనత నొందెను. పిమ్మట నా జంబుకంబునకు వ్యాఘ్రములు, సింహములు మున్నగు మహా సత్త్వములు గూడఁ బరిజనులై కొలువ జొచ్చెను.

ఇట్లు జరుగుచుండఁగా నొకనాఁ డానక్క సభలోఁ దన జాతి జంబుకములఁ జూచి సిగ్గిలి వాని నవమానించి దూర ముగాఁ దఱుమఁ గొట్టెను. అందుచే నక్కల కన్నిటికి మిక్కిలి విషాదను గలిగెను. ఒక వృద్ధజంబుకము కడమ వానిం జూచి "చింతింపకుఁడు. మన కవమానము గలిగించిన యీజంబుకము నశించు నుపాయ మొండుగలదు. మనము దాని రహస్య మెఱుంగుదుము. నీతివేత్తలము కావున నాయుపాయ మవలంబింతము. ఈ వ్యాఘ్రాదిజంతువులు వర్ణ మాత్రమున మోసపోయి నక్క యని యెఱుగక దీనిని రాజుగా గుర్తించినవి. కావున మన మందరము సంధ్యాకాల మున సమీపమునకేఁగి ఒక్కసారిగా గొప్పధ్వని చేయుదము. మన కూఁతలు విని జాతిస్వభావముచేత రాచనక్కయుఁ గూయును. కూఁతవలన నదియు జంబుకమేయని వ్యాఘ్రాది జంతువు లెఱుంగలవు." అని పలికెను.

అనంతర మవి యన్నియు ననుకొన్నట్లు చేరి కూఁతలకు మొదలిడగానే నీలివర్ణ జంబుకమును కూయఁ జొచ్చెను. ఎవ్వరి కైనను స్వభావము దాఁటరానిది. కుక్కను పసిడిగద్దె యెక్కించినను నది చెప్పు గొఱుకకుండునే?

పిదప నాసవ్వడి విని వ్యాఘ్రము నీలివర్ణపు సృగాలమును జంపివైచెను. కావున నాత్మపక్షము విడిచి పరపక్షమును జేరదీయరాదు.” అను మంత్రిమాటలు విని రాజహంస యిట్లు నియెను.

“ఈ సంగతి నిజమే యయినను; ఈ శుకము దూరము నుండి వచ్చియున్నది. కావున దీనిఁ జూచుట యుచితము. దానిం జేర్చు విషయము పిమ్మట నాలోచింపవచ్చును.”

చక్రవాక మా మాటలు విని ‘దూతను పంపుటయైనది. దుర్గము సర్వసంసిద్ధము కావున శుకమును బిలిచి మాటాడి పంపవచ్చు’ ననెను. అనంతరము శుక కాకములు కొలువు కూటమునకుఁ గొనిరాఁబడెను.

ఉచితాసనమునఁ గూరుచుండి కొంచెము తలయెత్తి చిలుక “ఓ హిరణ్యగర్భుఁడా! మహారాజాధిరాజు శ్రీమచ్చిత్ర వర్ణులవారు ‘నీకు జీవితముననుు, సంపదల యందును గోరిక గలదేని, త్వరితముగవచ్చి నాచరణములకు నమస్కరింపుము. లేదేని వెంటనే మఱొక చోటికి లేచిపొమ్ము.’ అని యాజ్ఞాపించుచుండి” రని పలికెను. ఆ పలుకులకు హిరణ్యగర్భునకుఁ

గోపమువచ్చి 'ఈ దుష్ట శుకమును మెడఁబట్టి గెంటివేయువా రెవరు నిచటలేరా!' యనెను. అపుడు కాకియైన మేఘ వర్ణుఁడులేచి 'ప్రభూ! ఆజ్ఞయైనచో నీ చిలుకను దునిమివై చెద' ననెను. సర్వజ్ఞుఁ డపుడు రాజును, గాకమును వారించి ప్రభువుతో నిటు లనియెను.

"పెద్దలులేనిసభ సభ యనిపించుకొనదు. ధర్మమును బలుకువారే పెద్ద లనఁబడుదురు. ధర్మము సత్యమును వీడి యుండదు. 'మిషతోఁగూడిన యది సత్యము కానేర' దని పెద్దలు వచింతురు. ఇచట ధర్మ మేమన; రాజు దూతముఖము ననే సందేశ ప్రతిసందేశములు నడుపును. కావున దూత యెట్టి వాఁడైనను వధ్యుఁడుగాఁడు. కత్తులుచూపి బెదరించుచున్నను దూత యథార్థము వచింపక తప్పదు. దూతవాక్యముల వలన దన హీనత్వమునుగాని, పరులయున్నతిని గాని భావింప రాదు." చక్రవాకమాడిన యీ హితమును విన్నపిదప హంస కాకములు శాంతి నొందినవి. చిలుక లేచి కదలెను. చక్ర వాకము చిలుకను బిలిచి యాదరించి బంగారునగలు మున్నగు కానుక లిచ్చి పంపెను.

ఇట్లు రాయబారము నడపి చిలుక వింధ్యపర్వతము మీఁదికిఁ బోయి తన రాజునకు వందన మాచరించెను. "విశేష మేమి?" యని రాజు ప్రశ్నింప "సంగ్రహముగఁ జెప్పు చున్నాను వినుము. వెంటనే యుద్ధ ప్రయత్నము చేయ వలయును. ఆ కర్పూరదేశము స్వర్గములోని యొక భాగమని

తోఁచినది. దాని రా జపరశచీపతియే. ఇంతకు మించి వర్ణించుట కష్టము" అని విన్నవించెను.

అనంతరము రాజు, పెద్ద లందఱను రావించి వారితో మంత్రాలోచనమునకుఁ గూరుచుండి యిటుల నెను. "ఇపుడు సంభవించిన యుద్ధము విషయమునఁ గర్తవ్యమే మో యాలోచించి తెలుపుఁడు. యుద్ధముమాత్రము తప్పదు. ఏల యన, బ్రాహ్మణులు సంతుష్టిలేకున్న లజ్జాహీనయగు కులస్త్రీ వలె జెడిపోవుదురు. మహీపాలురు సంతుష్టినొంది యున్నచో లజ్జావతులగు గణికలవలెఁ జెడిపోవుదురు."

ఆపలుకులు విని దూరదర్శియను గ్రద్ద యిటు లనెను. "రాజా! వ్యసనముఁ జెంది యుద్ధమునే ముఖ్యముగాఁ గోరుకొనరాదు. యుద్ధమునకుఁ బ్రయోజనములు మూఁడు. భూమి, మిత్రుఁడు, ధనము నను నవి. ఈమూఁడిటిలో నేయొకటియైనఁ దప్పక లభించునను నిశ్చయ మున్న యెడల యుద్ధ మొనరించుటలోఁ దప్పు లేదు."

గ్రద్ద మాటలువిని రాజు. "ముందు మంత్రి నాబలము గుర్తింపవలయును. అపుడు దీనియుపయోగము నెఱుంగ గలఁడు. అనంతరము దైవజ్ఞునిఁ బిలిచి ముహూర్త నిర్ణయ మొనరింపఁ దగును." అని పలికెను. దానికి మంత్రి "ఒక వేళ యుద్ధమే నిశ్చయింపఁబడినను వెంటనే దండెత్తుట యుచితము గాదు. శత్రుబలముఁబరిశీలింపక యుద్ధమునకుఁ జొరవ సేయు

వారు ఖడ్గధారల యాలింగనములు దప్పక పొందఁగలరు"
అనెను.

అపుడు రాజు 'మంత్రీ! యేమైనఁ నీక నా కుత్సాహ
భంగముఁ గల్పింపక శత్రువిజయమున కుపాయ మెఱింగిం
పుము.' నాపుడు 'సరే! చెప్పుచున్నాను. అది యనుష్ఠింప
బడినపుడు తప్పక ఫలితము చేకుఱును. ఆచరణము లేని
మంత్రాలోచనము నిరుపయోగము. ఔషధము పేరుచెప్పిన
మాత్రాన రోగము కుదురదుగదా! ప్రభువులయాజ్ఞ దాఁట
రానిది. నద్యద్రివనదుర్గములలో నెచ టెచట భయమునకవకాశ
మున్నదో యచటనచట సేనానులు వ్యూహములు పన్నుకొని
యుండవలయును. సర్వసేనాని ముఖ్యులగు వీరులతో ముందుగా
నేఁగవలయును. మధ్యమునఁ బ్రభువు, భార్య, కోశము, బల
హీనమగు సేనయు నుండవలయును. ఉభయపార్శ్వములందు
గుఱ్ఱములు, వాని కిరువైపుల రథములు, వానిప్రక్క నేనుఁగులు,
వానిప్రక్క పదాతులు, వెనుక సేనాపతులు నుండి ఖిన్నుల
నోదార్చుచుండవలయును.

రాజునకుఁ గోశము ముఖ్యము. కోశములేని రాజునకు
రాజ్య మొక్కనాఁటికి నిలువదు. మానవుఁ డింకొక యెట్టి
మానవునకు దాసుఁడు గాఁజాలఁడు. ధనమునకే దాసుఁ డని
నమ్ముము. గౌరవాగౌరవములకుఁ గలిమిలేములే కారణము.
సకల సేనలకు గజములు ముఖ్యములు. గజము తన యవయవ
ములుచేతనే యష్టాయుధ మనఁబడును. అశ్వములు సేనకు

ప్రాకారము వంటివి. కావున నధికమగు గుఱ్ఱపు దళముగల వానికి విజయము తప్పదు. అశ్వము లధిరోహించి యుద్ధము చేయువారిని దేవతలైన జయింపలేరు. దూరమందలి శత్రువులును వారికిఁ జేతిలోనివారే. సైనికులకు బహుమానము లొసంగవలయును. అట్లుచేసిన, వారు ద్విగుణమగు నుత్సాహముతో యుద్ధముచేయుదురు.

శత్రువులలో భేదము పుట్టించుటకు జ్ఞాతిని మించిన యుపాయము లేదు. కావున నెట్టైన శత్రువునకు దాయాదు నొకని లేవదీయవలయును. యువరాజునుగాని, ముఖ్యమంత్రిని గాని లోబఱచుకొనవలయును. దానివలన వారిలో నంతర్ద్వేషము రగులుకొనును.

అహితులు తమలోఁ దాము విరోధించుకొనుటవలన మిక్కిలి మేలుకలుగును. ఈయర్థము వివరించు కథ యొక్కటి గలదు. నీకు దానిం జెప్పెదను. వినుము.

## చోరబ్రహ్మరాక్షసులు కలహించుకొని యింటియజమానునకు మేలు చేసిన కథ

ఒకానొక యగ్రహారంబునఁ గర్మవిదుఁడైన యొక బ్రాహ్మణోత్తముఁ డుండెను. ఆతఁడు హోమ క్రియాదుల నిమిత్తము రెండు ప్రశస్తమైన గోవులను గొని వానిం జక్కగా

మేపుచుండెను. ఆగోవుల నెట్లైన నపహరింపవలయునని యొక దొంగ తగిన సమయమునకై నిరీక్షించుచుండెను.

ఒకనాఁ డాకసమున మబ్బులు క్రమ్మి సన్నని చినుకు రాలుచుండెను. అపు డర్ధరాత్రము గూడ నై యుండుటవలనఁ జీఁకటి మఱింత దట్టముగా నుండెను. మనుష్య సంచార మెచటను లేదు. గోవులను దొంగిలించికొని పోవుట కిదే మంచి యదనని యూహించి దొంగ బ్రాహ్మణు నింటికి మెల మెల్లన నరుగుచుండెను.

ఆచీఁకటిలో నట్లు కొంతదూరము పోయిన యనంతర మెదురుగా వచ్చుచున్న యెవ్వఁడో యొకవ్యక్తి యా దొంగకుఁ దగులుకొనెను. చోరుఁడు కొంచెము బెదరి "ఎవ్వఁడవు నీ" వని ప్రశ్నించెను.

"నేను బ్రహ్మరాక్షసుఁడను. నన్నుఁ దాఁకఁ గలిగి నంతటి ఘనుఁడవైన నీవెవ్వఁడ?" వని యాతఁడు తిరిగి ప్రశ్నించెను.

"నేను దొంగను లెమ్ము" అని యా చోరుఁడు పలుకఁగా "నింత ప్రొద్దుపోయి యెచటి కేఁగుచుంటి" వని యా బ్రహ్మరాక్షసుఁ డడిగెను.

"ఈ గ్రామమున నొక బ్రాహ్మణోత్తముఁడు గలఁడు. ఆతనికడ ప్రశస్తములైన రెండు ధేనువులు గలవు. వాని నపహరించుటకై పోవుచుంటి" నని దొంగ బదులుచెప్పెను.

" నేనుగూడ నాబ్రాహ్మణునిఁ బట్టుటకై పోవుచుంటిని మన మిర్వురముఁ గలిసియే పోవుదము రమ్ము" అని యా బమ్మరక్కసుఁడు పలికెను.

ఈవిధమున వా రిరువురు నడచి నడచి యాభూసురుని యింటి దరి కేఁగిరి. గృహద్వారముకడ నిలిచి బ్రహ్మరాక్షసుఁడు చోరునితో "నేను ముందుగాఁ బోయి యా బ్రాహ్మణునిఁబట్టి లేపుదును. ఆతఁడు నాకింత భుక్తి యిడి పంపును. అనంతరము నీవు గోవులను దోలుకొని పొమ్ము" అని పలికెను. దాని కంగీరింపక యాచోరుఁ డిట్లనెను.

"నీవు ముందుగానే యాబాపని మేలుకొలిపిన నిఁక నేను గోవులఁ దోలుకొనిపోవుట యెట్లు? ఆయింటి వారుఁ బొరుగువారు మేలుకొన్న గోవులను విడిచి నేను పలాయన మొనరింప వలసివచ్చును. కావున నేను ముందుగా ధేనువులఁ దోలుకొని శీఘ్రముగా నూరు విడిచి పోవుదును. అనంతర మా బ్రాహ్మణునిఁ బట్టుకొని నీ కోరిక యీడేర్చుకొనుము"

ఈవిధముగా మాటమీఁద మాటవచ్చి వా రిరువురకుఁ గలహము ముదిరెను. వారిరొద కింటిలో నిదురించు చున్న బ్రాహ్మణునకు మెలఁకువ గలిగెను. ఆతఁడు వెంటనే లేచి ద్వారముకడకు వచ్చి తలుపుతీయకుండఁగనే "యర్థరాత్ర సమయమున వచ్చి మావాకిటఁ గలహ మాడుచున్నా వారెవ్వ" రని ప్రశ్నించెను.

"ఈతఁడు బ్రహ్మరాక్షసుఁడు. నిన్నుఁబట్టి బాధించు టకై యదను జూచుకొని వచ్చినాఁడు" అని చోరుఁడు ప్రత్యుత్తర మిచ్చెను.

"ఈతఁడు దొంగ నీగోద్వయమును దొంగిలించి తోలు కొని పోవుట కీయర్ధరాత్రమున వచ్చి యున్నాఁడు" అని బ్రహ్మరాక్షసుఁడు బదులు పలికెను.

బ్రాహ్మణుఁడు వారి సమాధానముల వలన సంగతి యంతయు గ్రహించెను. వెంటనే యెలుఁగెత్తి పిశాచోచ్చా టనమంత్రములు పఠించెను. వాని ప్రభావమున నచట నిలువ లేక యా బ్రహ్మరాక్షసుఁడు పాఱిపోయెను. ఎవరైన మేలు కొన్నఁ దన్నుఁ బట్టుకొందురని యాచోరుఁడు సందులం బడి పలాయన మొనరించెను.

ఇట్లు మంత్రి చెప్పినకథ యాలించి రా జిటు లనియెను. "వేయిమాటలేల! ఆత్మోదయము, పరుల క్షీణత నను రెండు తెఱంగులు కలదియే నీతి. ఆరెండింటి నెఱుగజాలువాఁ డింద్ర పదవి నొందఁ గలుగు" నని వచించెను. పిదప దైవజ్ఞుఁ డిడిన మూహూర్తమున దండయాత్రకు బయలుదేఱెను.

అచట హిరణ్యగర్భు డంపిన దూత తిరిగి వచ్చి ప్రభూ రా జగు చిత్రవర్ణుఁడు దండెత్తి వచ్చి మలయపర్వతపుఁ జరియ లలో విడిసియున్నాఁడు. ప్రతిక్షణ మేమఱుపాటులేక దుర్గ శోధనముఁ జేయవలయును. ఏలయన మహామంత్రి యగు

గృధ్రము విశ్వాసపాత్రుఁడగు నొకనితో ముచ్చటించుచుండ వింటిని. మన దుర్గమున నీవఱకే శత్రువులచే నియుక్తుఁడగువాఁ డొకఁడున్నట్లు నాకవగతమైనది.' నావుడు నామాట యందుకొని చక్రవాకము 'ప్రభూ! అట్లు నియోగింపఁబడినది కాకమే కాని వేఱొండు కా' దనెను.

అపుడు రాజు "అట్లెన్నడును గాదు. అదియే కదా చిలుకను జంపుటకు సిద్ధపడినది! మఱియుఁ జిలుక యిచటికి వచ్చిన నాఁటినుండి యది యుద్ధమునకు కాలుదువ్వుచుండెను. నావుడు మంత్రి "అయినను నూతనాగంతుకుఁడు నమ్మదగఁడు" ఈయర్థము నెఱిఁగించు కథ యొకటిగలదు? నీకది యెఱింగింతను వినుము.

## నూతనాగంతుకుని నమ్మిచెడిన మందవిసర్పిణి కథ

మందవిసర్పిణి యను పేరుగల యొక చీరపేను రాజశయ్యం జేరి యెచటికిఁ బోక చిరకాలము నివసించి యుండెను. రాజు గాఢ నిద్రావశుఁడై యున్న సమయమున నాతని రక్తము గ్రోలుచుండెను.

ఒకనాఁడు డిండిక మను పేరుగల నల్లి యారాజ శయ్యఁ జేరి చీరపేనితో నిట్లనెను.

"నీపాదములకు మ్రొక్కెదను. నేఁటినుండి నీవాఁడను. నీచుట్టముగా భావించి నన్నుఁ గాపాడుము"

ఆమాటలు విని మందవిసర్పిణి "యీవిధముగా స్తోత్రము చేయనేల? నాపుణ్యమువలన నీచటికి వచ్చితివి. నా వంశము పావనమయినది. నే నీరాజశ్రేష్ఠుని పానుపున సుఖినై యుంటిని. నన్నేమి కోరఁదలఁచి యిచటికి వచ్చితివి? నాకిచట నేమి యైశ్వర్యము గలదని యెంచితివి?" యని పలుకఁగా నా డిండిక మిటు లనియెను.

"యాచకుఁడు తన యవసరము కొలఁది యాచించును గాని యెదుటివాని కలిమిలేములు పాటింపజాలఁడు. ధనాపేక్షచే మిక్కిలి యడుగునుగాని 'యీతఁడు లోభి, యీతఁడు దాత' యని యెఱుంగలేఁడు. విత్తముంగోరి సభలలో నుపన్యసింపఁ బోవునుగాని, తన విద్య చాలదని గుర్తింపఁ జాలఁడు. డాబుగానున్న వాని నెల్లఁ జేరి నేర్పుకొలఁది మాటలాడి విత్తమడుగును. ఏదాతయైన నిచ్చిన సంతసించును. లోభియై యేమియు నీయకున్నఁ జిన్నవోవును. మాటల సందర్భమునఁ జెప్పితిని గాని ని న్నేయర్థము యాచింపఁ దలఁచిరాలేదు.

నాకు నీవు చేయవలయు సాయ మాహార మొసఁగుట మాత్రమే. పూర్వమునుండియు నేను చెనఁటులగు మానవుల రక్తముఁ ద్రావుచుంటిని. యెన్నఁడు మహీపతుల రక్తము గ్రోలి యుండలేదు. అందువలన నాకు సంపూర్ణ సంతృప్తి గలుగలేదు. ఆకోరిక నెఱవేర్చుకొనుటకై నేఁడు నీదర్శనము నకు వచ్చితిని. కావున నాయభిమత మంగీకరించి నన్ను సంతోష పెట్టుము.

నాకిట్టి యభిలాష పుట్టుటకుఁ గారణమేమన; రాజులు మహా భోగులు అమూల్యములై రసవంతములైన బహువిధ భోజ్య పదార్థములు వారు భక్షింతురు. మిక్కిలి పరిమళము గల రకరకములయిన సుగంధ ద్రవ్యముల నుపయోగింతురు. అనుదినము విలాసవతులయిన కోమలాంగులతో సకల సుఖము అనుభవింతురు. అట్టివారి రుధిర పానమునకై యెన్నియో తావులఁ దిరిగి యుంటిని. ఇంతవఱకు నాయభిలాషము సిద్ధింప లేదు. ”

డిండికము మాటలు విని, జాలిగొని దాని యభిలాష కంగీకరించి మందవిసర్పిణి యిట్లనెను. “ కడు జాగరూకతతో వర్తింపుము. వేగిరపాటుఁ జెంది కార్యహానిఁ దెచ్చుకొనకుము. రాజు గాఢ నిద్రాపరవశుఁడై యున్న తఱి నాతని రక్తముఁ గ్రోలి తటాలునఁ దప్పుకొనవలయును.

ఉపాయ మెఱుఁగక కక్కుఱితిపడి సంజజామున నాతని గఱచిన యెడల మనకుఁ బ్రమాదము కలుగవచ్చును.

ఇట్లు బోధించిన యనంతరము మందవిసర్పిణియు, డిండికము నాశయ్యయందుఁ బ్రీతితో నుండెను. కొంతసేపయిన తరువాతఁ జీరపేను కునుకు దీసెను. అపు డభిలాష నిలుపుకొనలేక యానల్లి సందెజామునసే భూమీశునిఁ గఱచెను. అంతట నిద్రాశూన్యుఁడై యున్న యా రా జదరిపడి, పాదము లొత్తుచున్న సేవకులతో “ దీపము దెచ్చి చూడుఁడు. నా దేహమున దేలుకుట్టిన యట్లైనది ” అని పలికెను.

సేవకులు దీపము దెచ్చునంతలో డిండికము కడు వేగముగా మంచము పట్టె రంధ్రములోనికిఁ బోయి దాగుకొనెను. సేవకులు దానిం గనుఁగొనక పాన్పు నడుమ నేమియు నెఱుంగక కునుకుచున్న మందవిసర్పిణిం జంపివైచిరి." కావున నూతనాగంతుకుని నమ్మి చేరనీయరాదు.

రాజు "ఆగంతుకులు నొకపుడు మహోపకారము జేయఁగలరు. పరుఁడైన నొకపుడు మేలుకూర్చు బంధువగును. బంధువు నొకప్పుడు పరుఁడై కీడొనరించును. స్వశరీరమున జనించిన దైనను వ్యాధి యపాయకరము. అడవిలోఁ బుట్టినదైన నౌషధి మేలొనరించును గదా! వీరవరుఁ డను నొక యాగంతుకుఁడు శూద్రక మహారాజు నచిరకాలముననే తనకుమారుని ప్రాణము లొసఁగి కాపాడఁబోయెను. నీ కా కథ వినిచెద వినుము.

## వీరవరుఁడు తన కుమారుని ప్రాణము లొసఁగి శూద్రక మహారాజును గాపాడఁబోయిన కథ

నేను పూర్వము శూద్రకమహారాజు క్రీడాసరస్సునందలి కర్పూరకేళియను రాజహంస పుత్రికయగు కర్పూరమంజరిపై వలపుగలిగి యుంటిని. అపుడచటికి వీరవరుఁ డను నొక మహారాజపుత్రుఁ డేదేశమునుండియో వచ్చి రాజద్వారమునొద్దకు వెళ్లి ద్వారపాలకునితోఁ దా నొక రాజపుత్రుఁడనియు, రాజదర్శనమునకై వచ్చెననియుఁ జెప్పెను. ద్వారపాలకుఁ డాతని

రాజదర్శనమునకు గొంపోయెను. వీరవరుఁడు ప్రభూ! ఈసేవకుని సేవ తమకంగీకార మగుచో దినమున కైదువందల సువర్ణముల జీత మేర్పఱుపుఁ డని కోరెను. దానికి రాజు 'నీయొద్ద గల సరకేమి' యని ప్రశ్నింప నాతఁడు 'రెండు బాహువులు, నొక ఖడ్గము' నని బదులు వలికెను. 'అంతమాత్రము చాల' దని రా జనఁగా వీరవరుఁడు కదలిపోయెను.

అపుడు మంత్రి 'నాలుగు రోజు లా వేతనమిచ్చి యాతని సామర్థ్య మెఱుంగవచ్చు' నని పలుక రాజు వీరవరునిఁ బిలిపించి తాంబూలముతోఁ బంచశత సువర్ణము లొసగెను. ఆసొమ్ము దీసికొని, యాతఁడు దేవబ్రాహ్మణుల నిమిత్త మందు సగము ఖర్చుపెట్టెను. మిగిలినదానిలో సగము దీనుల కొసఁగెను. మిగిలినది భోజ్యవస్తువులకు, విలాసవస్తువులకు నుపయోగించెను. ఇట్లు నిత్యకృత్య మొనరించుచుఁ గత్తి చేతఁబూని రేయుంబవళ్లు రాజద్వారమును గనిపెట్టుకొని సేవించుచుండెను. రాజు సెలవైనపుడు మాత్రమే యింటికేఁగుచుండెను.

పిమ్మట నొకనాఁటి రాత్రి రాజున కొక రోదనధ్వని వినఁబడెను. ద్వారమందున్న వీరవరునిఁ బిలిచి 'యా రోదన మేమో తెలిసికొని ర' మ్మనెను. వీరవరుఁడు సెలవు గైకొని వెడలిన పిమ్మట 'గాఢాంధకారమున నీ రాకొమరునిఁ బంపితిని. నేను నీతనివెంట నేఁగి విషయము దెలిసికొందు' నని తలఁచి శూద్రకమహారాజును బయలుదేఱెను.

వీరవరుఁ డట్లు వెడలి రూపయౌవన సంపన్నురాలును, సర్వాలంకారములును ధరించినదియు నగు నొకసుందరింగాంచి 'నీవెవ్వతెవు? యేల యేడ్చుచుంటి వని యడిగెను. "నేనీ శూద్రకుని రాజ్యలక్ష్మిని. చిరకాలమునుండి యీతని బాహువుల నీడను సుఖముగా విశ్రమించియుంటిని. ఇపుడు వేఱొక్కచోటికిఁ బోవలసివచ్చినది" అని యామె బదులు పలుకగా వీరవరుడు "అపాయమున్నచోట నుపాయముగూడ నుండును. కావున; నీవిచటనే యుండుటకుఁ దగు నుపాయ మేమైనఁ దెలువు" మని మరల నడిగెను. 'ముప్పదిరెండు శుభలక్షణములతోఁ గూడిన నీసుతుఁడగు శక్తిధరుని నీవు భగవతియగు సర్వమంగళకు బలియొసంగినచో నే నిచ్చోట గదలక చిరకాలము సుఖముగా నివసింపఁగల' నని పలికి యామె యంతర్ధాన మయ్యెను.

వీరవరుఁ డంతట నింటికేఁగి నిద్రించుచున్న సతిని, సుతుని మేలుకొలిపెను. వారు మేలుకొని లేచి కూరుచుండిరి. వీరవరుఁడు రాజ్యలక్ష్మి తెలిపిన సంగతి యంతయు వారికిఁ బూస గ్రుచ్చినటులువివరించెను. అదివిని యానందముతో శక్తిధరుఁడు 'స్వామిని, రాజ్యమును గాపాడు నిమిత్త ముపయోగపడుట వలన నేను మిక్కిలి ధన్యుఁడను. ఇందుల కింక నాలసింపనేల? ప్రాజ్ఞుఁడు సకలసంపదలును, దుదకు జీవితమును పరార్థమై విడువఁగలఁడు. వినాశ మెపుడో యొకప్పుడు తప్పనపు డిట్టి వినియోగము మేలుకదా!" యన విని యాతని తల్లి యిటులు

పలికెను. "ప్రభువునొద్ద గొప్పజీతము తీసికొనుచు సమయము వచ్చినపు డిట్టి యుపకారముఁ జేయకున్న నాతని ఋణ మిం కేవిధమునఁ దీర్పఁగలము?"

అనంతర మందఱు గలిసి సర్వమంగళాలయమునకు వెళ్ళిరి. అచట దేవిని బూజించి వీరవరుఁడు. "తల్లీ! ప్రసన్నురాలవుగమ్ము. నీ వీ కానుకను స్వీకరించి శూద్రకమహారాజునకు శాశ్వతజయము గూర్పుము" అని ప్రార్థించి సుతుని తల నఱకివైచెను. పిమ్మట నాతఁ డిటులు చింతించెను. "వేతనము దీసికొన్నందుకు రాజఋణము దీఱినది. ఇక నపుత్రకుఁడనై జీవించుట దుష్కరము" అని తలపోసి తన శిరమునుగూడ ఖండించుకొనెను. పతి సుత శోకమునకు దాళఁజాలక సతియు నటులే యొనరించెను.

చాటున నుండి యదియంతయుఁ జూచుచున్న రాజాశ్చర్యముతో నిటు లాలోచించెను. "నాబోటి క్షుద్రులనేకులు జనించు చుండిరి; గిట్టుచుండిరి. ఈతనికి సాటి రాఁదగువారు భూతభవిష్యద్వర్తమానములలో నెవ్వరు నుండరు. ఈతఁడు చనిపోయి నపుడు నాకు రాజ్యముండియు నిరుపయోగము." అని తలఁచి శూద్రకుఁడు తన శిరము ఛేదించుకొనుటకై కత్తి యెత్తెను. అపుడు భగవతియగు సర్వమంగళ శూద్రకుని చేయిపట్టుకొని నిలిపి "కుమారా! నీ సాహసమునకు మెచ్చి నీయెడఁ బ్రసన్నురాలనయితిని. మరణానంతరమైన నీ రాజ్యమున కేహానియుఁ గలుగదు"

నావుడు రాజు సాష్టాంగ నమస్కారము చేసి "తల్లీ! నాకింక రాజ్యమేల? జీవితము మాత్రమేల? నీకు నాయందుఁ గరుణగలదేని నా యాయుశ్శేషమును గ్రహించి వీరవరుఁడు సతీసుత సమేతముగా జీవించునటు లనుగ్రహింపుము. కానిచో నాగతికి నన్ను వదలుము." అని వేడికొనెను.

రాజు మాటలు విని యామె "కుమారా! నీ సేవక వాత్సల్యమునకు నీయెడఁ గడు సంతుష్టురాల నైతిని. పొమ్ము విజయము నొందుము. ఈ వీరవరుఁడును నాలుబిడ్డలతో జీవించును." అని పలికి యదృశ్యురాలయ్యెను.

అనంతరము వీరవరుఁడు కుటుంబముతోఁగూడి యింటికిఁ బోయెను. రాజును వారలకు తెలియకుండ శీఘ్రముగా నంతిపురముఁ జేరెను.

మఱునాఁ డుదయమున రాజు ద్వారమందున్న వీర వరుఁ జూచెను. "ప్రభూ! ఆ యేడ్చుచున్న యామె నన్ను జూచి యదృశ్యురాలయ్యెను. మఱొక విశేషమేమియు లే" దని యాతఁడు ప్రభువునకు విన్నవించెను. ఆపలుకులు విని 'యీతఁ డెంతటి మహాసత్త్వసంపన్నుఁడు? ఈతని నేమని కొనియాడుదును?

దైన్యము నెన్నఁడు తనయందుఁ దోఁప నీయక ఆత్మ స్తుతి చేసికొనక, ప్రియవాక్యముల బలుకుచు, దానగుణము గలవాఁడై, యపాత్రుని కొనఁగక నిష్ఠురోక్తు లాడక యుండు

వాఁడేకదా శూరుఁడనఁదగు. మహాపురుష లక్షణములన్నియు నీతని యందున్నవి" అని రాజు తలపోసి పిమ్మట శిష్టసభను సమావేశ పఱచి జరిగిన యావృత్తాంతముఁ దెలిపి, పొగడి వీర వరునకుఁగానుకగాఁ గర్ణాట రాజ్యమొసంగెను. కావున నాగంతుకుఁడై సపాత్రన, జాతిమాత్రదుష్టుడైనంత మాత్రమున నట్లన రాదు. వారిలోనుత్తమ మధ్యమాధము లుండవచ్చును." అని హిరణ్యగర్భుఁడు వినిపింపఁగా మంత్రి చక్రవాక మిటులనియె.

ఎవ్వఁ డకార్యము జరుగుచుండ నది కర్తవ్యముగా నంగీకరించునో వాఁడు దుర్మంత్రి యనఁబడును. అకార్యమున కంగీకరించి ప్రభువునకు నాశకారకు డగుటకన్న ప్రభువునకుఁ దాత్కాలిక మనోదుఃఖము గలిగించినను దప్పు కానేరదు. వైద్యుఁడు, గురువు, మంత్రి యను మూవురు నేరాజుకడ ముఖప్రీతి కలిగించు మాట లాడుదురో యాతఁడు శరీరము నుండియు, ధర్మమునుండియు, కోశమునుండియు భ్రష్టుఁడై నశించుచున్నాఁడు. పుణ్యవశమున నెవ్వరికో లభించిన యర్థము నాకును దొరకు ననుకొనఁదగదు. నిధులు దొరకునను నాసతో భిక్షుకుని జంపి యొక మంగలి హానిం జెందెను. నీకాకథ వివరింతు నవధరింపుము.

## క్షపణకులనుగొట్టి నిధులు పొందిన క్షత్రియుని గాథ

అయోధ్యానగరమున జూడామణి యను క్షత్రియుఁ డొకఁ డుండెను. ఆతఁడు ధనమునుగోరి కడు శ్రమల కోర్చి

చాలకాలము శివు నారాధించెను. కొంతకాలమున కాతని పాపములు నశించుటవలన నీశ్వరుని పనుపునఁ గుబేరుఁ డాతని కలలోఁ గానఁబడి "నీ వుదయము క్షౌరము గావించుకొని దుడ్డుకఱ్ఱ యొకటి జేతఁబట్టుకొని యింటియందు నడిగాకుండ నుండుము. అపుడే వీథిని వచ్చు నొక భిక్షుకునిఁ జూడఁగలఁవు. అతనిపట్ల నెంతమాత్రము జాలిదలఁపక యాదండముచే నాతనిఁ గొట్టుము. అనంతర మా భిక్షుకుఁడు బంగరు గిన్నెగా మాఱి పోవును. దానితో నీవు యావజ్జీము సుఖింపవచ్చు" నని పలికెను. చూడామణియు నాప్రకార మొనరించి సంపదల నొందెను.

## భిక్షుకులనుగొట్టి యురి తీయబడిన మంగలి కథ

చూడామణికి క్షౌర మొనరించుటకు వచ్చిన మంగలి యిది యంతయుఁ జూచి 'నిధులు దొరుకవలె నన్న నిది యుపాయము గాబోలును; నేను నటులేచేసి సంపదల నార్జింతును' అని తలచి, దండము చేతఁబట్టి ప్రతిదినము భిక్షుకుని రాకకై యెదురుచూచుచుండెను. ఒకనాఁడు దురదృష్టవంతుఁ డగు నొక భిక్షుకుఁడు రాఁగా నాతనిఁ జావమోదెను. ఆ యపరాధమునకు రాజపురుషు లామంగలిని గొనిపోయి యురి తీసిరి."

అట్లు మంత్రిచెప్పిన కథ విని రాజు 'పూర్వపుకథలు చెప్పుకొని యొకఁడు విశ్వాసఘాతుకుఁడో, యకారణ బంధువో నిర్ణయించుట తేలికకాదు. సరే, అదియటుండనిమ్ము. శత్రు రాజు చిత్రకర్ణుఁడు మలయపర్వతమున నున్నచో నిపు డేమి

చేయఁదగు' నని ప్రశ్నింప మంత్రి 'ప్రభూ! మనము పంపిన దూతవలన చిత్రవర్ణుఁ డాతని మహామంత్రియగు గృధ్రము సహాలను గౌరవించుట లేదని వింటిని. కావున నాతఁడు మూర్ఖుఁడని, సులభముగా గెలువవచ్చునని నాతని తలఁపు."

'లుబ్ధుఁడు, క్రూరుఁడు, అలసుఁడు, నసత్యవంతుఁడు, పొరపడువాఁడు, భీరుఁడు, చంచలుఁడు, మూర్ఖుఁడు, యోధుల నవమానించువాఁడు నగు శత్రువు సులభముగా జయింపఁబడు'నని పెద్దలవచనము కావున నాతఁడు మనకోట నరికట్టకముందే నద్యద్రివనమార్గముల యందు వానిబలములను హతమార్చుటకు సారస్వతాది సేనాపతులను నియోగింప వలయును. 'దూరప్రయాణముచే నలసినవానిని, నద్యద్రి వనములఁ జిక్కుకొన్నవానిని, ఘోరాగ్నికిఁ బాలుపడినవానిని, నాకలిదప్పులకు లోనైనవానిని, వ్యాధులచేతను దుర్భిక్షముల చేతను బీడింపఁబడినవానిని, దోపిడిగాండ్ర బాధకు లోనైన వానిని మీఁదఁబడి నాశనము చేయవలయు' నని యార్యు లందురు. 'శత్రువులు మీఁదఁ బడుదురను భయమున రాత్రి యంతయు మేలుకొని; పగలు సైనికులందఱు నిద్రింప దానును నిద్రించు శత్రువును జుట్టుముట్టి చంపివేయవలెను.' అనియు నార్యుల వచనము. గావున నావిధముగా బ్రమాదములకుఁ బాలయిన శత్రుసేనఁ జొచ్చి రేలుంబవళ్ళు మన సేనానులు చంపఁగలరు." అని వచించెను.

ఆప్రకారము కావింపగాఁ జిత్రవర్ణుని సైనికులు, సేనానులు పెక్కుమంది మరణించిరి. చిత్రవర్ణుఁ డపుడు మిక్కిలి కలఁతనొంది తన మంత్రియగు దూరదర్శి కిట్లనియె.

“ పూజ్యుఁడా ! యిట్టి సమయమున న న్నుపేక్షింపఁ దగునా ? నాయం దపరాధమేమైనఁ గలదా ? రాజ్యము లభించినదని గర్వముతో నడువఁ దగదు. ముసలితనము సౌందర్యమును హరించినట్లు వినయము సంపదలను హరించును. శక్తివంతుడు సంపదల నొందును. పథ్యముఁ గోరువాఁడే నీరోగత నొందును. అరోగి సుఖము నొందును. కృషిగలవాఁడు విద్యల నొందును. కాని వినయవంతుడు ధర్మము, నర్థము యశముఁ గూడ నొందఁగలడు ” నా విని మంత్రి గృధ్ర మిటు లనియెను.

“ జల సమీపమున నుండు వృక్షము పల్లవ కుసుమ ఫలములతో నొప్పారునట్లు రాజు తా నవిద్వాంసుఁడైనను విద్యావృద్ధులను సేవించి గొప్పసంపదల నొందఁగలఁడు. మఱియు మద్యపానము, స్త్రీ వ్యామోహము, వేఁట, జూదము, అర్థదూషణము, మాట బిరుసుఁదనము, కఠిన దండనము నను నవి రాజున కుండరాని సప్తవ్యసనములు.

కేవలము సాహసమువలన గాని, కేవల ముపాయములవలనఁగాని యున్నత సంపదలు గలుగవు. సమయానుగుణముగా నీతి శౌర్యములు చూపు వారికి సంపదలు దమంత దామే వచ్చి చేరును. నీవు సేనల యందలి యుత్సాహముఁ

జూచి యతిసాహస మొనరించి, నే నుపదేశించిన మంత్రాలోచ నము దనాదరమును, వాక్పారుష్యమును జూపితివి. ఆ యవి నీతికి ఫల మిపు డనుభవించుచుంటివి.

దుర్మంత్రము గలవానిని నీతిదోషములు తాఁకును. అపథ్యము భుజించువానిని రోగము లాశ్రయించును. శ్రీగర్వి తుని మృత్యువు సమీపింపకమానదు. స్త్రీవాంఛ లెవ్వానికిఁ బరితాపముఁ గూర్పకుండును? ముదమును విషాదము, శర త్కాలమును హిమాగమము, సూర్యుడు చీకటిని, కృతఘ్నత సుకృతమును, మైత్రి దుఃఖమును, నీతి యాపదలను హరించిన విధమున సమృద్ధమైన సంపదలను గూడ దుర్నీతి నాశనము చేయును.'' అని పలికి మనమున నిట్లు తలపోసెను. "రాజిపుడు ప్రజ్ఞాహీనుఁ డయ్యెను. కాకున్నచో నీతిశాస్త్రమును వెన్నెలను వాక్కు లనెడి కాగడాలచేతఁ జెడగొట్టునా? ఎవ్వానికి సహజ ముగఁ బ్రజ్ఞయుండదో వానికి శాస్త్రము మాత్రమేమి మేలు చేయగలదు? లోచనములు లేని వాని కద్ద ముపయోగింపదు గదా!'' అని యాలోచించి యూరకుండెను.

పిమ్మట రాజు దోసిలొగ్గి "పూజ్యుఁడా! నాతప్పు సైరింపుము. నేను మిగిలిన సేనతో మరల వింధ్యాచలముఁ జేరు నుపాయముఁ దెలుపుము'' నావుఁడు మంత్రి "యిఁక గోప ముడిగి, యుపాయము వెదుకవలెను. ఏలయన 'దేవతలందును, గురునియందును, గోవులయందును, బ్రాహ్మణుల యందును, రాజులయందును, బాలవృద్ధాతురులయందును కోపము నూప

రా' దని పెద్దల వచనము " అని మనమునఁ దర్కించి చిఱునగ వుతో రాజున కిటులనియె.

"ప్రభూ! భీతిఁజెందకుము. ఊరడిలుము. సన్నిపాత రోగముఁ గుదుర్చుటలో వైద్యుల ప్రజ్ఞ వెల్లడియగునట్లు చెడిన వ్యవహారములు చక్కఁబఱచు పట్టుననే మంత్రుల ప్రజ్ఞ వెల్లడి కావలయును. అన్నియుఁ జక్కగా నున్నపు డందఱును బండి తులే యగుదురు. అజ్ఞులు సామాన్యపు యత్నములు ప్రారంభించి యవి నెరవేర్పలేక సతమతమగుచుందురు. ప్రజ్ఞా వంతులు మహాయత్నముల నే సంకోచములేక నెరవేర్చుకొనఁ గలరు. కావున నీప్రతాపము వలననే కోటను భేదించి కీర్తి పరాక్రమ సహితముగా శీఘ్రకాలముననే వింధ్య పర్వతము నకుఁ గొనిపోవఁగలను."

ఆపలుకులువిని రాజు 'ప్రస్తుత మత్యల్పబలముతో నది యెట్లు శక్యమగు' నని యడిగెను. "దేవా! సర్వము సమకూ ఱును. జయమం దిచ్ఛగలవాఁడు కేవలము సూత్రములు పన్నుకొనుచుఁ గూర్చుండరాదు. కావునఁ ద్వరితముగా దుర్గముఁ జుట్టుముట్టి యరికట్టవలయును." అని మంత్రి బదులు పలికెను.

గూఢచారిగాఁ బంపబడిన బకము హిరణ్యగర్భుని దగ్గఱకేఁగి 'ప్రభూ! అల్పమగుసేన గలిగియు రాజగు చిత్ర వర్ణుఁడు మంత్రి గృధ్ర ముపదేశించుటచేఁ గోట నరికట్టు

చున్నాఁడు' అని యెఱింగించెను. అపుడా రాయంచ 'సర్వజ్ఞా! యిపు డేమి చేయఁదగు' నని మంత్రి నడిగెను.

"మనసైనికులలో సారాసారపరిశీలనముఁజేసి, యర్హా తలను బట్టి సువర్ణవస్త్రాదికములగు కానుక లొసఁగి వారి నుత్సాహపఱుపవలయును. ఒక్కకానియైన ననవసరముగాఁ బోవునపు డది పదివేలుగా భావించి కాపాడవలయును. కాలము వచ్చినపుడు కోట్లకొలఁది ద్రవ్యమైనను గవ్వలవలె వెచ్చించుటకు వెనుకాడరాదు. ఇటు లొనరించు రాజసింహుని లక్ష్మి యెన్నఁడును వరించియుండును ? యాగమున, వివాహమున, వ్యసమున, రిపునాశనమందు, యశమును గలిగించుకార్యమున, మిత్రులను సంపాదించుటయందు, ప్రియురాండ్ర విషయమున, నిర్ధనులగు బంధువులయెడ నీయెనిమిది సందర్భములలోను నతివ్యయ మని తలఁపక యెంతయైన వెచ్చింపవచ్చును. కొలఁదిఖర్చునకు వెనుదీసి సర్వనాశముఁ దెచ్చుకొనువాఁడు మూర్ఖుఁడు. బుద్ధిమంతుఁ డెవ్వఁడైనను పన్నిచ్చుటకు జంకి భాండము విడిచి పోవునా ?" యను చక్రవాకము సలహావిని "యీవిపరీత సమయమున దుబారాఖర్చుతగునా ?" యని రాజహంస పలుక "ప్రభూ ! సంకోచింపక దానమానములచే యోధుల నుత్సాహపఱుపుము. మన మెంతభద్రపఱచినను సమయము వచ్చినపుడు సంపద సంవ్యయమైపోవును. గౌరవాభిమానములచే దుష్టులగు యోధు లవలీలగా శత్రువుల జయింపఁగలరు. శీల సంపన్నులు, నుత్సాహవంతులుఁ, గృతనిశ్చయులు నగు శూరు

లై దువంపలమందియున్న నెంతశత్రుసేననైనఁ జెండాడఁగలరు. మఱియు సత్యము; శౌర్యము; దయ; త్యాగము ననునవి రాజున కుండవలసిన మహాగుణములు. ఈయవి లేకున్న వానికి నిందగలుగును.

ఇట్టి సమయములనే మంత్రులమాట చేకొనఁదగును. మేలుకీడులందెవ్వఁడు పాలుగొనునో యట్టిసచివునినమ్మి ధనప్రాణములయం దుపయోగించుకొనవలయును. ఎవనిమంత్రి ధూర్తుఁడును, స్త్రీయును, ననుభవశూన్యుఁడగు చిన్నవాఁడు నగునో యట్టిరాజవినీతివాయువు తాఁకునఁ గార్యసముద్రమున మునిఁగిపోయి, తేలకుండును. హర్షక్రోధములయందు సమబుద్ధియు శాస్త్రార్థముల యందు విశ్వాసము, సేవకులయం దెపుడు ననుపేక్షయుఁ గలుగు రాజునకు ధరిత్రి యెపుడును సంపద లొసఁగును. 'హానివృద్ధులు రాజుతోడివే' యని తలఁచు మంత్రుల నెన్నఁడు నవమానింపఁ జనదు" అని పలుకుచుండెను.

ఈసమయమున మేఘవర్ణుఁడు వచ్చి నమస్కరించి "ప్రభూ! యుద్ధముఁగోరి శత్రువు దుర్గద్వారము నరికట్టియున్నవాఁడు. కావున దేవరయాజ్ఞయిచ్చినచో దుర్గమువెలువడి నాపరాక్రమముఁ జూపి ప్రభువులఋణము దీర్చుకొందు" నని విన్నవించెను.

దానికిఁ జక్రవ యిటులనియె. "బయటికి వెడలి యుద్ధము చేయఁదగినయెడల దుర్గము నాశ్రయించుట నిరుప

యోగము. నీటియం దెంత బలిష్ఠ మైనను మొసలి బయటికి వచ్చిన నిర్వీర్యమయి లొంగిపోవును. మహాశూరమయిన సింహముగూడ నడవినుండి వెలువడి వెల్లడితావులలో నక్కవలెఁ జిక్కిపోవును. మరియుఁ బ్రభూ! స్వయముగా నేఁగి యుద్ధము చూచెదరుగాక. రాజు సేనలను ముం దుంచుకొని పరిశీలనచేయుచు యుద్ధ మొనరింపవలయును. స్వామి ప్రక్కనుండగా గుక్కయైనను సింహవిక్రమముఁ జూపునుగదా!"

## యుద్ధము

అనంతర మందఱు నేఁగి దుర్గద్వారమునొద్ద సంగరము చేసిరి. మఱుచటి దినమునఁ జిత్రవర్ణుఁడు గృధ్రముతో 'ఆర్యా! నీప్రతిజ్ఞ నెఱవేర్చుకొనవలసిన సమయము మిదియే, యనెను.

దానికి దీర్ఘదర్శి "రాజా! కాలమును సహింపనిదియు నత్యల్పమగునదియు; మూర్ఖుఁడు, వ్యసనవంతుఁడు నాయకుఁడు గాఁగలదియు; గుప్తము కానిదియు; భీరులగు యోధులుగలదియు నగుట దుర్గవ్యసన మనఁబడును. అది యచట నెంతమాత్రమును గానరాదు. భేదోపాయమును, జిరకాలము ముట్టడించుటయు, నిద్రాసమయమునఁ బైబడుటయు, తీవ్ర పౌరుషముఁ జూపుటయు నను నాలుగును కోటను వశపఱచుకొను నుపాయములు. ఈవిషయమున యథాశక్తిగా యత్నముఁ జేయుచుంటి" నని పలికి చెవిలో నింక నేమియో చెప్పెను.

## మేఘవర్ణుని మోసము

మఱుచటి దినమున సూర్యోదయింపకమున్నే నల గడల నాలుగు దుర్గద్వారములందు యుద్ధము జరుగుచుండగ గోట నడిమి గృహములం దొక్కసారిగాఁ గాకు లగ్ని ముట్టించినవి. పిమ్మటఁ 'గోటలొంగిపోయెఁ; గోటపడిపోయె' నను కోలాహలము విని మండుచున్న యగ్నిజ్వాలలు చూచి రాజహంస సైనికులును, నితర దుర్గవాసులను నగు పక్షులన్నియు శీఘ్రముగా జలాశయప్రవేశ మొనర్చినవి. మంత్రాలోచనము విక్రమము, యుద్ధము, పలాయనము సమయానుసారముగ నలుపవలెఁ గాని వెనుదీయరాదు.

## సారసపక్షి స్వామిభక్తి

సహజముగా మందగతియగు రాజహంస సారసద్వితీయుడై చిత్రవర్ణుని సేనాపతియగు కుక్కుటముచే నిరోధింపబడెను. అపుడు రాజ హంస 'సేనాపతీ! నన్ననుసరించి యుం యేల మరణమున కెరయగుదువు? నీవు శీఘ్రముగా నిషైనఁ దప్పించుకొనిపోఁగలవు. కావున నట్లు పోయి, జలము జొచ్చి యసువులు గాపాడుకొనుము. నాకొమరుఁడు చూడామణి యనువానిని సర్వజ్ఞుని సమ్మతితో రాజు నొనరింపుము. నావుడు సారస మిటు లనియెను.

'ప్రభూ! ఇట్టి మాటలు విననొల్లను. ప్రభువునకు జంద్ర దివాకరు లున్నంతకాలము విజయము గలుగుఁగాక! నేన

తమదుర్గమున కధికారిని. నా రక్తమాంసములచేఁ బూయఁ
బడిన ద్వారమార్గమున మాత్రమే శత్రువు దుర్గమునఁ జొరఁ
గలడు. మఱియును దాతయు, నోరిమి గలవాఁడును, గుణ
ములు గ్రహింపఁగలవాడును నగు ప్రభు వెంతయదృష్టముననో
కాని లభింపఁడు.' నాపుడు రాజు 'అది సత్యమేయయినను సమ
ర్థుఁడుఁ, బవిత్రుఁడు, ననురాగవంతుఁడునగు సేవకుఁడు దుర్లభుఁ'
డనియెను.

"ప్రభూ! యుద్ధమునుండి తొలఁగిన నిఁక మరణభయము
లేకుండుట స్థిరమైనచో మఱొక చోటికిఁ బాఱిపోవచ్చును. పుట్టిన
ప్రతిప్రాణికి మరణ మెపుడో యొకపుడు తప్పని దైనపుడు
యుద్ధమునుండి తప్పుకొని కీర్తి నేల మలినపఱచుకొనవలయును?
గాలితాఁకునఁ గలుగు కెరటముల తిరుగుడుచే నేర్పడిన సుడిగుం
డమువలె క్షణభంగురమైన యీజన్మయందుఁ బరులనిమిత్తము
జీవితము నర్పించు యోగము మహాపుణ్యమువలనఁ గలుగును.

ప్రభువు, అమాత్యుఁడు, రాష్ట్రము, కోట, కోశము, సేన
మిత్రుఁడు, పౌరశ్రేణులు ననునవి రాజ్యాంగములగు సప్తప్రకృ
తులు. అందుప్రభుఁడవగు నీవు సర్వవిధముల రక్షింపఁబడఁదగిన
వాఁడవు. ప్రకృతివర్గము సంపూర్ణమయ్యును బ్రభువు లేనిదే
నిలువఁజాలదు.

వైద్యుఁడు ధన్వంతరియైన నాయుర్దాయము లేనివాని
విషయమున నేమిచేయఁగలడు? సూర్యుని యుదయాస్తమయ
ముల ననుసరించి కమలము వికసించుట, ముకుళించుట జరుగు

నట్లు రా జభ్యుదయమున నున్నపుడు ప్రజలు సుఖింతురు, రాజు హాని నొందునపుడు ప్రజలును కీడునొందుదురు" అని పలుకు చుండఁగాఁ గుక్కుటమువచ్చి రాజహంస శరీరమున వాడియైన గోళ్ళతోఁ బొడిచెను. అపుడు సారసపక్షి శీఘ్రముగా రాజ హంసను దన దేహమం దిడుకొని భద్రముగా సరోవరజలమం దునిచెను.

అపుడు కుక్కుటములన్నియుఁ జుట్టుముట్టి సారసము దేహమంతయును దూంట్లువడునట్లు పొడిచెను. సారసమును దన విక్రమముఁజూపి కుక్కుటసేనను జాలవఱకు నంత మొందిం చెను. కుక్కుటములు లెక్కలేనన్ని యగుటచే నన్నియుఁ గలిసి ముక్కులతోఁ బొడిచి తుదకు సారసముం జంపివైచినవి!

అనంతరము చిత్రవర్ణుఁడు దుర్గమునుజొచ్చి దుర్గమం దలి విస్తారమైన ద్రవ్యము దీసికొని, వందిజనులు, జయజయ ధ్వనులు చేయుచుండ స్కంధావారము కేఁగెను.

విష్ణుశర్మ యిట్లు చెప్పుచుండఁ రాజకుమారు లిట్లు లనిరి. 'రాజహంస సేనయందు స్వదేహమును త్యాగముచేసి ప్రభువును రక్షించిన సారసపక్షి సుకృతము కడు శ్లాఘ్యము. సర్వగోవులును ధేనువు నాకృతిగల వత్సములఁ బెక్కింటిని గను చున్నవి. కొమ్ములు, మూఁపును దాఁకునట్టి ప్రశస్తమైన యాబోఁతు మాత్ర మేయొక్క గోవునకో జనించును' నావిని విష్ణుశర్మ యిట్లనియె.

"విద్యాధరస్త్రీలు పరిజనమై కొలువ మహాసత్త్వ మగు నాసారసము స్వర్గసుఖ మనుభవించును. యుద్ధమునఁ బ్రభువు నిమిత్తమై, దేశము నిమిత్తమై శరీరములఁ గోలుపోవు నట్టి కృతజ్ఞులగు ప్రభుభక్తులు స్వర్గము నొందుదురు. పంద తనము వహింపక యుద్ధరంగమున నెచ్చోట శత్రువులచేఁ జంపఁ బడిన శూరుఁడును నక్షయపుణ్యలోకము నొందును. పర మహీ పతుల కరితురంగ పదాతిసేనలతో నెన్నఁడు మీకు యుద్ధము సంభవింపకుండునుగాక! నీతిమంత్రవాయువులచేఁ జెదరగొట్ట బడి మీవైరులు గిరి గహ్వరముల నాశ్రయింతురుగాక!"

# సంధి

అనంతరము రాజపుత్రులు విష్ణుశర్మతో "ఆర్యా! తమ దయవలన విగ్రహము సాంతముగా వింటిమి. ఇపుడు సంధిని గురించి మాకుఁ దెలుపు"మని కోరఁగా విష్ణుశర్మ యిట్లు చెప్పఁ దొడఁగెను.

"రాజహంస జలాశయముఁ జేరినపిమ్మటఁ జక్రవాక మంత్రితో "మనదుర్గమున నిప్పుముట్టించినవాఁ డెవ్వఁడు? మన కోటలోని వాఁడే యిట్లు చేసెనా? లేక శత్రువులచేఁ బంపఁ బడిన మఱెవ్వఁడైనఁ గావించియుండునా? యని పలికెను.

అపుడు మంత్రి "ప్రభూ! మీనిష్కారణ బంధువగు మేఘవర్ణుఁడు సపరివారముగా నదృశ్యుఁడయ్యె; నీపని యాతఁడే యొనరించి యుండునని నాయూహ." నావుడు రాజు క్షణ మాలోచించి "యీ దురదృష్టమునకుఁ గర్త దైవము. మఱె వ్వరుఁ గారు. ఒకపుడు చక్కగా నాలోచించి చేసిన పనియు దైవయోగమువలన నాశనమగుదును గదా!" యని పలికెను. ఆ మాటలు విని మంత్రి యిటు లనియె.

"కార్యము విఫలమైనపుడు మానవుఁ డవివేకియై దైవ మును నిందించునే కాని తన యనాలోచిత కృత్యములఁ దెలిసి కొనఁజాలఁడు. హితమునుగోరు మిత్రుల వాక్యముల వినని వాఁడు నోటిపట్టు వీడి పడి చెడిన కూర్మమువలె హానిఁ జెందును. నీ కా కథ దెలుపుదును. వినుము.

## హితవాక్యములు వినక చెడిన కూర్మము కథ

మగధ దేశమున ఫుల్లోత్పల మను నొక్క సరస్సు గలదు. సంకట వికటములను పేరుగల రెండు హంస లందు నివసించుచుండును. వానికి మిత్రమై కంబుగ్రీవమను నొక్క కూర్మము గూడ నుండెను. ఒకనాఁడు జాలరు లాసమీప మునకు వచ్చి 'నేఁ డిచటనుండి రేపటియుదయమున నీ కొలని యందలి మత్స్య కూర్మాదులఁ బట్టుకొంద' మని తమలోదాము చెప్పుకొనిరి. ఆమాటలు విన్న తాఁబేలు హంసలతో నిటు లనియెను. 'ఇపుడు మనకుఁ గర్తవ్య మేమి?' 'ప్రాతఃకాల మున నేదోయొక యుపాయ మాలోచింతము ఈ లోగానే యంతప్రమాదము ముంచుకొని వచ్చిన నెట్లు జరిగిన నట్లు జరుగును.' అని హంస పలుకఁ గూర్మమిట్లు పలికెను.

"ఏదో యొకటి జరుగునని యూరకుండుట తెలివి తక్కువ. అనాగత విధాతయు, ప్రత్యుత్పన్న మతియు సుఖిం పఁగా, యద్భవిష్యుఁడు నశించినాఁడు. మీ కా కథ దెలుపు దును వినుఁడు.

## మూఁడు చేఁపల కథ

పూర్వ మొకప్పుడీ చెఱువునందే యనాగత విధాత, ప్రత్యుత్పన్నమతి, యద్భవిష్యుడు, నను మూఁడు చేపలు వసిం చుచుండెడివి. 'జాలరులు వచ్చి వేటాడఁదలఁచి' రను సంగతి

విని వానిలో ననాగత విధాత మఱొక జలాశయమునకు వెడలి పోయెను.

ప్రత్యుత్పన్నమతి యిటులు తలచెను. "భవిష్యత్తులో నెపు డేమి జరుగునో యెవరు నిర్ణయింపఁగలరు? ఆపదవచ్చినపుడు సమయానుకూలముగా నుపాయ మాలోచించుకొనవచ్చును. జరుగనున్నది జరుగక మానదు. జరుగఁబోవని దెచట నున్నను జరుగఁజాలదు." యద్భవిష్యుఁ 'డేదో యొకటి జరుగు' నని యెక్కువగా నాలోచింపక యూరకుండెను.

మరునాఁ డుదయమున జాలరులు వచ్చి పట్టుకొనఁగాఁ బ్రత్యుత్పన్నమతివలలో మరణించినట్లు నటించెను. వారది పనికి రాదని యెంచి వలనుండి తీసిదూరముగా విసరివైచిరి. అచట నుండి యది యెట్లో తప్పించుకొని లోఁతునీట మునిఁగెను. యద్భవిష్యుఁడు మాత్రము వల్లెవాండ్రకుఁ జిక్కి తప్పించుకొను నుపాయము గానక మృతి నొందెను. కావున నేను నీమఱొక చెఱువునకుఁ బోవ సాయముఁ జేయుఁడు. నావుడు నాయంచ లిటు లనియె.

" మఱొక చెఱువుఁ జేరినపిదప నీకుఁ దప్పక కుశలమే. కాని నీ వచటి కపాయకరమైన మెట్టత్రోవ నెట్లు పోఁగలవు? " "మీతో న న్నాకాశమార్గమునఁ దీసికొని పొం" డని కూర్మ మన " నదియెట్లు సాధ్య " మని యవి సందేహించెను.

"మీ రొక కఱ్ఱను రెండు చివరల ముక్కులతో బట్టు
కొనుఁడు. నేను దాని నడుమఁ గఱచుకొనియుండ మీ రెక్కల
బలమున నాకసమున నెగిరిపోవచ్చు" నని తాఁబేలన హంస
'లీయుపాయము మంచిదే కాని దీనియం దపాయ మేమైన నున్న
దేమో కనుఁగొనవలయును. బుద్ధిమంతుఁ డుపాయము నంటి
యుండు నపాయమును గూడ నెఱుఁగకున్నచోఁ దన పిల్లలను
ముంగిసల పాలొనరించి దుఃఖమునొందిన కొంగగతి గలుగును.
నీ కా కథ చెప్పుదుము వినుము.

## అపాయసహితమైన యుపాయముచేఁ జెడిన కొంగ కథ.

ఉత్తరదేశమున గృధ్రకూటమను పర్వత మొక్కఁడు
గలదు. ఆకొండయం దొక పెద్దపిప్పలిచెట్టుగలదు. ఆచెట్టుమీఁద
లెక్కలేనన్ని కొంగలు కాపురము సేయుచుండెను. ఆచెట్టు
మొదట నున్న పుట్టలోనొక సర్పము గలదు. చెట్టెక్కి యది
కొంగలు పెట్టిన పిల్లలను తిని జీవించుచుండెను. ఆకొంగల
దుఃఖమును భరింపలేక యం దొక పెద్దకొంగ కడమవాని కిట్లు
సలహా చెప్పెను. 'మీరు చేఁపలను దీసికొనివచ్చి ముంగిసలు
వసించు కలుగులనుండి పాముండు పుట్టవఱకు వానిని బడ
వేయుఁడు. ఆ యాహారము రుచిచూచి ముంగిసలు పాము
పుట్టవఱకు వచ్చి దానిఁ జూడవలయును. సహజవైరమువలన
పాము నవి చంపివేయగలవు.' ఆమాటలు విని కొంగలన్నియుఁ
గడు శ్రమకోర్చి యెన్నోచేఁపలదెచ్చి యనుకొన్నట్లు పడవై

చెను. తలఁచినట్లుగనే ముంగిసలు చేఁపలవెంబడి వచ్చి పామును జంపివైచినవి. వానికిఁ జెట్టుమీఁదఁ బక్షిపిల్లల ధ్వనులు వినరాఁగా నవి చెట్టెక్కి పక్షిపిల్లల నన్నిటినిఁగూడఁ దినివైచెను. కావున మే మిట్లంటిమి. మేము నీవన్నట్లు నిన్నుఁ దీసికొనిపోవుచుండఁగాఁ జూచిన ప్రజ లూరకుండక యేమైనఁ బలుకఁగలరు. అదివిని నీవేమైన జవాబీయఁదలఁచి నోరు దెఱచితివేని నీప్రాణములు నీవికావు; కావున నెట్లైన నీవిచటనే యుండుట మేలు. నావుడుఁ గూర్మ మిటులనియెను. "నే నంత యజ్ఞురాలఁగాను. వా రేమన్నను నే నేమియుఁ బలుక కూరకుండఁగలను."

తుదకుఁ దాఁబేటి మాటల కంగీకరించి హంసము లది పట్టుకొన్న కర్రను రెండువైపుల ముక్కునఁ బట్టుకొని వెడలుచుండ; నా విచిత్రమును కొందఱు గోపాలకులు చూచిరి. వారు వానివెంటఁబడి పరువెత్తుచు "నీ తాఁబేలు క్రిందఁబడినవెంటనే వండికొని తిందము; ఇచటనే కాల్చుకొని తిందము; కాదు ఇంటికిఁ దీసికొనిపోవుదము;" అని వారిలోవారు వాదులాడుకొనుచుండిరి.

ఆ మాటలకుఁ గూర్మమునకుఁ గడుఁగోపము కలిగెను. తనప్రతిజ్ఞనుమఱచి 'మీఁబూడిద తినుఁ'డని పలుకుచుఁ బట్టువదలి క్రిందఁ బడిపోయెను. దానిని వారు చంపి తీసికొనిపోయిరి. కావున హితవాక్యములు విననిచోఁ హాని సంభవింపకమాన"దని మంత్రి పలుకుచుండ గూఢచరుఁడగు బకమువచ్చి "ప్రభూ! నేను ముందే నుడివితిని 'ప్రతిక్షణము దుర్గశోధన మవసర' మని.

మీా రాపలుకుఁ బాటింపరై తిరి. దానిఫల మిపు డనుభవము నకువచ్చెఁగదా! శత్రుమంత్రియగు గృధ్రముప్రేరణచే మేఘు వర్ణుఁడే కోటలో నిప్పు ముట్టించెను." నావుడు రాజు నిట్టూర్పు విడిచి యిట్లనియెను. "తాత్కాలికమగు నుపకారమువలనఁ గాని, యనురాగము వలనఁగాని శత్రువులను విశ్వసించువాఁడు వృక్షాగ్రమున నిద్రించినవానివలెఁ బతనము సంభవించినపుడు మాత్రమే వివేకము నొందగలఁడు."

ఆమాటలు విని మరల బక మిటులు చెప్పెను. "దుర్గ మును దహించి యిచటినుండి వెడలిన యనంతరము చిత్రవర్ణుఁ డాతనిపై ననుగ్రహాముచే నిట్లనియె. 'ఈమేఘువర్ణు నీకర్పూర ద్వీపరాజ్యమున కధిపతిగా నభిషిక్తునిఁజేయుదము. కృతకృత్యుఁ డగు సేవకుని యుపకారము మఱువరాదు. మాటచేతను, క్రియచేతను నాతని సంతోషపఱుపవలయును.' నావుడు ప్రధానమంత్రి గ్రద్ద యిట్లనియె.

"ప్రభూ! ఇది యుచితముగాదు. మఱొక యుపకార మేదైనఁ జేయఁదగును. ఘనులగువారి కుచితమగు పదవిలో నెన్నడు నీచునిఁ గూరుచుండఁ బెట్టరాదు. నీచుఁ డుత్తమ పదవి నొందెనేని ప్రభువునకే హాని దలపెట్టఁ గలఁడు. ఒక మూషికము వ్యాఘ్రముగాఁ జేయఁబడి తన్నుగాపాడిన మునినే చంపయత్నించెను. నీకాకథ యెఱింగింతును, వినుము.

## తన్ను వ్యాఘ్రముగాఁ జేసి కాపాడిన మునిని జంప యత్నించిన మూషికము కథ

గౌతమ మహర్షి తపోవనమున మహాతపుఁ డను నొక మునిగలఁడు. ఒకనాఁ డొక కాకి యెలుకపిల్ల నెత్తుకొనియెగిరి పోవుచుండ, నది దాని నోటినుండి జాఱి ముని సమీపమునఁ బడెను. దానిం గాంచి యాతఁడు జాలి నొంది నీవారధాన్య కణంబులిడి పెంచుచుండెను.

ఒకనాఁడు మార్జాల మొకటి దానింబట్టు కొనఁబోవ నది ప్రాఁకివచ్చి మునియొడిలోఁ బడెను. ముని దానిం గరు ణించి తన మహిమవలన మార్జాలముగా మార్చెను.

మఱొకనాడు పిల్లిగామాఱిన యెలుక నొక కుక్క తఱుముకొని రాఁగా మునిదానిం గుక్కగా మార్చెను. ఇం కొకనాఁడు కుక్కగా నున్న యెలుకను బెద్దపులి తఱుమగా ముని మరల దానిని వ్యాఘ్రముగా మార్చెను. అనంత రము ముని దానిని మూషికముగనే భావించుచుండెను. ఆ మునిని, వ్యాఘ్రమును జూచియందఱు 'నీముని యెలుకను పులిగా మార్చినాఁడట' యని చెప్పుకొను చుండిరి. అదివిని పులిగా మాఱిన యెలుక యిటులు తలపోసెను.

"ఈముని జీవించియున్నంతకాలము నకీర్తికరమగు నా పూర్వ వృత్తాంతము మాసిపోదు. మఱియు నీముని యెప్పుడైన నే క్షుద్రజంతువు మీఁదికైన నేఁగిన దానిని మనతోఁ దుల్య

ముగా మార్పఁగలఁడు. మఱియుఁగోపమువచ్చిన నన్నెట్టి రూపమునకైనఁ మార్పఁగలఁడు. కావున నీముని నివుడే మట్టుపెట్టుట మంచిది" అని తలఁచి మునిపైఁబడ నుంకింప నతఁ డది కనిపెట్టి దాని నెప్పటియట్లు మూషికముగా మార్చి వైచి దానితో నిట్లనెను. "నీచప్రాణి కౌన్నత్యముఁ గల్గించినను నది మేలు గాఁ జాలదు. దానిని యథాస్థితిలో నుంచుటే యుత్తమము. ఈయర్థము నెఱింగించు కథ యొకటి కలదు. నీకది యెఱింగించెదను వినుము.

## కన్యగా మారి తగినవరుడు దొరకక యథాస్థితి నొందవలసి వచ్చిన మూషికము కథ

ఒకముని పుణ్యతీర్థములన్నియు సేవించుచు నొకనాఁడు గంగానదియందు స్నానము గావించి సూర్యున కర్ఘ్యమొసఁగుచుండెను. ఆసమయమున నాకాశవీథి యం దొకడేగ యెలుక నొకదానిం దన్నుకొని పోవుచుండెను. దైవ వశమున నా యెలుక డేగపట్టునుండి జాఱి యర్ఘ్యమొసఁగు చున్నయాముని చేతులలోఁ బడెను. అతఁడు దానింజూచి వేడుకగలవాఁడై దయదలఁచి 'ఈమూషికము కన్యయగుఁ గాక' యని పలుకఁగా నది యట్లే యయ్యెను.

ముని యకన్యను గొనిపోయి తనభార్య కిచ్చెను. ఆమె కన్న కొమారితకన్న నెక్కువప్రీతితో నాకన్యకను బెం

పఁగాఁ 'గొంతకాలమున కామెకు యౌవనము వచ్చెను. మిక్కిలి సుందరముగా నున్నయామెను గనుఁగొని యమ్ముని యొకనాఁ డిట్లు చింతించెను.

" ఈకన్యను దగిన వరునకు సమర్పింప వలయును. లేకున్న వివాహ వయసు దాఁటిపోవును. అందువలనఁ బాపము కలుగుటే కాక ప్రజలందఱు నిందింతురు. చక్కని చుక్క యగు నీమెను సామాన్య వరున కీయరాదు. "

ఇట్లాలోచించి మంత్రములచే సూర్యుని స్మరించెను. వెంటనే దివ్యమూర్తియైన భాస్కరుఁడు ప్రత్యక్షము కాఁగా నమస్కరించి యమ్ముని యిట్లనెను.

" ఈసుందరికి మానవుఁడు భర్త కారాదని నిన్ను స్మరించితిని. నీవీమెను భార్యగా గ్రహింపుము " అని కోరెను.

" ఈ సుందరిని వరించుటకు మహాబలిష్ఠుఁడైన వాయు వొక్కఁడే యర్హుఁడు. ఆతఁడు నాకన్న సంపదలుగలవాఁడు." అని చెప్పి సూర్యుఁడు వెడలిపోయెను.

అప్పుడాముని తన తపశ్శక్తిచే వాయుదేవుని స్మరించెను. ఆతఁడు వెంటనే ప్రత్యక్షమయ్యెను. " నాకుమారియగు నీకోమలిని వివాహమాడు " మని ముని యామెం జూపఁగా వాయుదేవుఁడు మెల్లన నిట్లు పలికెను.

" దేవేంద్రుఁడు నాకంటె గొప్పవాఁడు. ఆతనిఁ గాదని యితరుల కిచ్చుట న్యాయము గాదు. ఆతని కిచ్చి పెండ్లి చేసిన

యెడల నీవు సకల స్వర్గసౌఖ్యములు ననుభవించును." అని మునికి నచ్చఁ జెప్పి వాయు దేవుఁడు వెడలిపోయెను.

ఆముని యపుడు మంత్రమహిమవలన నింద్రు నారాధింపఁగా నాతఁడు ప్రత్యక్షమయ్యెను. ఆముని యానందించి దేవేంద్రునిం బెక్కువిధముల స్తోత్రము చేసి "చూడు మీ సుందరాంగి నాతనయ. దీనిని వివాహమాడుటకు నీవే యర్హుఁడవు. నరసురాసుర కిన్నర యక్షవరులలో నింకెవ్వరు దీనికిఁ దగరు. కావున దీనిఁ జేకొనుము." అని ప్రార్థించెను.

అంతట దేవేంద్రుఁ డామునీంద్రున కకన్నియమీఁదఁ గల వాత్సల్యమును, నాకన్య జనించిన విధమును గ్రహించి నవ్వుచు నిట్లనెను.

"మేరుపర్వత శ్రేష్ఠుఁడు మాకును మాకును నందఱికిని బూజనీయుఁడు. సురుచిరములయిన రత్నసానువులతో నొప్పుచుండును. ఆతనిశృంగములు మహోన్నతములు. సూర్యచంద్ర నక్షత్రాదు లనవరతము నాతని చుట్టుఁ దిరుగుచుందురు. శంకరుఁడు, బ్రహ్మ మున్నగు దేవత లాతని శిరమున నుందురు. ఆతఁడు ధనికుఁడు. సత్యవంతుఁడు. కావున నీపుత్రిక నాతని కిచ్చుట మేలు" ఇట్లు చెప్పి యింద్రుఁ డంతర్ధానమయ్యెను.

"పిలిచి పిల్ల నిచ్చెదనన్న నొకరు నంగీకరింపరైరి. వారితోడనే యున్నదా యేమి?" అని తలఁచి యాముని మేరువును స్మరించెను. వెంటనే యాతఁడు సుకుమారరూపముఁ

దాల్చి మునికిఁ బ్రత్యక్షము కాఁగా ముని యాతని కర్థ్యాసత్కా-
రములొనరించి "ఈసుందరి నెవ్వరికి నీయక నీకీయదలఁచితిని.
కావున మాతో వియ్యమందవలయును" అని పలికెను.

దానికి మేరు విట్లు బదులు పలికెను. "నాశరీరము
మిక్కిలి స్థూలమైనది. అంతగొప్పశరీరమును వేషధారిణియగు
నీమూషికము పెకల్లకలుగులుగాఁ దొలిచి వైచును. కావున
నిది నాకన్న నధికురాలు. కావున నీ కుమారిక కిట్టి ఘనమైన
మఱియొక్క మూషికమే భర్తకాఁ దగును. కాని నావంటి
యల్పుల కీమె నిచ్చుట మంచిదికాదు" అని పలికి యమ్మునిని
వీడుకొని మేరువు వెడలిపోయెను.

అపు డాముని యాకన్యకెచటను దగిన వరుఁడు లభింప
నందున "దీనికి వివాహవయసుదాఁటి పోయిన ధర్మహాని
గలుగును. పూర్వమువలె మూషికమైయున్న నేవిచారము
నుండ" దని తలపోసి మరల మూషికముగా మార్చివైచెను.
కావున నీచు నున్నతాధికారమున కెన్నుకొనరాదు. నీచుని
నధికారిగా నంచుకొని శశకపింజలములు వినాశము నొందెను.
నీకాకథయు నెఱింగించెదను, వినుము.

## నీచు నధికారిగా వరించి చెడిన శశకపింజలముల కథ

ఒకానొక చెట్టుతొఱ్ఱయందుఁ గపింజలమను నొకపక్షి
నివసించుచుండెను. అదియొకనాఁ డాహారమునకై పోయి

కొంచె మాలస్యముగాఁ దన తావునకుఁ దిరిగివచ్చెను. అప్పటికి దాని నివాసస్థలమున దీర్ఘకర్ణమను పేరుగల కుందేలు ప్రవేశించి యాక్రమించి యుండెను. దానింజూచి కపింజలము "మేఁతకుఁ బోయి వచ్చునంతలో నాయిల్లాక్రమించుట తగునా" యని యడిగెను.

"విడిచిపోయిన యింటికి, నరపతిలేని రాజ్యమునకు, మగదిక్కులేని సతికి నెవఁడు బలవంతుఁడో వాఁడే యధికారి కాఁగలఁడు. నేను బలవంతుఁడను దీనిని నేను విడువ వలసిన యవసరము లేదు.

మఱియుఁ జెఱువులుఁ, గూపములు నెవరివశముననున్న వారివే యని మనువు పలికెను. కావున నే నిచ్చోటు వదలను." అని కుందేలు పలికిన మాటలకుఁ గపింజల మిట్లనెను.

"మొగమోట యించుకైన లేక యిది నాయిల్లని పలుకుట నీకుఁ దగదు. తగవు దీర్చుకొందము రమ్ము. లేదేని నీకును నాకును బెద్ద జగడము తప్పదు."

దాని కంగీకరించి యాశశము "తగవు దీర్చుకొనుటకు రమ్మనఁగా రాననుట పాడిగాదు" అని పలికి యాపక్షితోఁ గూడి కొంతదూరము పోయి "మనకుఁ దగవు చెప్పు వారెవ్వరు?" అని కపింజల మడుగఁగా యమునా నదీతీరమున దధికర్ణుఁ డను మార్జాలశ్రేష్ఠుఁడు కలఁడు. ఆతఁడు సత్యవ్రతుఁడు. ఆతని నడిగి ధర్మసందేహముఁ దీర్చుకొంద" మనెను.

"పిల్లి హృదయము కడుఁ గ్రూరమయినది. ఎన్నఁడు దానిని నమ్మరాదు. నీకట్టి మార్జాలము మీఁద విశ్వాస మెట్లు కలిగె" నని పక్షి ప్రశ్నించెను.

"దధికర్ణుఁ డాచారవంతుఁడు. ఉత్తముఁడు. ఈచేరువ వారందఱు నాతని నెఱుంగుదురు. నీకేమియు భయ మవసరము లేదు నాతోరమ్ము" అని చెవులపిల్లి బదులుపల్కెను.

"నాకు భయమున్న నీకును భయ ముండును. యిది యిర్వురకు సమానమే. నాకుఁదోచినమాట చెప్పితిని. నీకు లేని భయము నాకు మాత్రమేల ?" యని కపింజల మనెను.

అట్లాశశకపింజలములు పోయి పోయి దధికర్ణుని నివాసమునకుఁ జేరి కొంతదూరమున నిలిచి "మాయిరువురకు నింటి విషయమై వివాదము గలిగినది. నీవు ధర్మమార్గమున దీనిని బరిష్కరించి వేగముగా మమ్ముఁబంపి వేయు" మని కోరెను.

ఆమాటలు విని మెల్లనఁ దలయెత్తి చూచి దధికర్ణుఁ డిట్లనెను. "వెనుకటివలెఁ గాక మిక్కిలి ముదుసలినై యుంటిని. దూరముననున్న వస్తువులు కంటికానుటలేదు. మాటయు బాగుగా వినఁబడుటలేదు. ఈవిధమున నింద్రియ వైకల్యము నొందియుంటిని. నాపై విశ్వాసమున్నచో దగ్గఱికి వచ్చి మీరు చెప్పఁదలఁచినది చెప్పుఁడు." దధికర్ణుని యీమాటలు విని యది సమీపించుట కింకను గొంచెము వెఱచు చుండఁగా మరల నతఁ డిట్లనియె.

"పనిగట్టుకొని బంధువులై యిచటికివచ్చి భయపడె దరేల ? ధర్మమును మనము చెఱిచిన నది మనలను నాశము చేయును. ధర్మమును మనము కాపాడిన నది మనలను రక్షించును. ధర్మమే మిత్రుఁడై వెనువెంట వచ్చును. తక్కినధనము లన్నియుఁ గర్మాయత్తమైన శరీర మెచట నశించునో యచటనే నిలిచిపోవును.

నాపలుకు లన్నియు నిజములు. కల్లలాడువాఁడు నరక కూపమునఁ బడిపోవును. కావున నీచవృత్తితోఁ గల్లలాడువాఁ డనుగాను.

అహింసకు మించిన ధర్మములేదు. పరమాత్మ స్మరణము తప్ప నితరములన్నియు విడిచి యహింసావ్రతముం బూని చాంద్రాయణ వ్రత మనుష్ఠించుచున్నాను. నాతపశ్శక్తి వలన మీరడిగిన ధర్మసందేహము లన్నియుఁ దీర్పఁగలను."

ఈవిధమున నమ్మకము గలుగునట్లుగా దధికర్ణుఁ డొనగిన దీర్ఘోపన్యాసము విని శశకపింజలములు భయ ముడిగి దగ్గఱకుఁ జేరి నిలిచెను. వెంటనే యారెండింటిని ముందఱి కాళ్ళతో బట్టి చంపి దధికర్ణుఁడు ప్రీతిమీఱ భక్షించెను." కావున నీచుని నధికారిగా నొనరించికొన్న శశకపింజలములవలె చేటొందక తప్పదు.

మఱియు నీకర్పూర ద్వీపమును వశపఱచికొని యేలు టంత తేలికపని యనిఁ తలఁచి పేరాసనొందరాదు. ఱకఱకము లైన చేపలఁ బెక్కింటినిఁ బొట్టఁబెట్టుకొని పేరాసచేత నొక

కొంగ తుద కెండ్రకాయచే మరణము నొందెను. నీకాకథ యెఱింగించెదను వినుము.

## పేరాస వలన నెండ్రకాయచే మృతినొందిన కొంగ కథ

మాళవ దేశమునఁ బద్మగర్భమను నొక సరస్సు గలదు. అచట బలహీనమై, దీనమైన దానివలె నున్న యొక ముదుసలికొంగను జూచి యొక కుళీరమిట్లు ప్రశ్నించెను. 'నీవెందువలన నాహారము ముట్టక యిటు లుంటివి?' నావుడు బక మిటులనియె. "మత్స్యములు నాజీవనమున కాధారములు. వానిని జాలరులువచ్చి పట్టివేయుదురని నగరపరిసరముల విని యుంటిని. జీవనవృత్తి నశించి మరణ మవశ్యము సంభవించు నసికలతనొంది యాహారము నందు ప్రీతిలేనివాఁడనై యుంటిని."

మత్స్యము లాపలుకులు విని యిటు లాలోచించినవి. 'ఈసమయమున నీకొంగ యుపకరించు నటులు గానఁబడు చున్నది. కావున గర్తవ్యమేమో దీనినే యడుగుదము. ఉపకరించు వైరితోనైన సంధి చేసికొనవలయును. మిత్రుఁడైన నపకరించువానిఁ జేరరాదు. మిత్రత్వ శత్రుత్వములకులక్షణము, లుపకారాపకారములే కదా!' యని తలఁచి యవి కొంగను జేరి 'యోబకోత్తమా! ఇఁక మేము బ్రదుకు నుపాయ మేదైనఁగలదా?' యన నాకొంగ మఱొక చెఱువును జేరుట యొక్కటే మీకు రక్షణోపాయ' మనెను. నీవే మాపైఁ

గరుణించి మఱొక కొలనికిఁ జేర్పుమని యాచకమును చేఁపలు వేఁడుకొనఁగా నయ్యది యొకొక్క చేపం దీసికొనిపోయి భక్షించుచుండెను.

అన్నియు నైనపిమ్మటఁ గుళీరము దన్నుఁగూడ జలాశయాంతరమునకుఁ దీసికొనిపొమ్మని బకమును గోరెను. అపూర్వమైన యెండ్రకాయ మాంసము లభించుచున్నదని పేరాసఁజెంది యానందముతోనా కొంగ దాని దీసికొని యొకస్థలమునఁబెట్టి పొడుచుకొని తినుట కువ్విళ్ళూరుచుఁ బోవుచుండ నా కుళీర మచటి చేపల యెముకలన్నింటినిజూచి 'అయ్యో చచ్చితిని. ఇపుడు సమయోచితముగా మెలఁగి దీనిఁ దప్పించుకొనవలయు' నని యాలోచించెను.

"భయపరిస్థితి వచ్చువఱకు భయపడఁదగును. వచ్చిన పిమ్మట భయము వీడి తెగువఁ జూపవలయును. శత్రువు నెదుటఁబడి మఱొకసాధన మేమియుఁ గానరానపుడుయుద్ధము చేసి మరణించుట ప్రాజ్ఞుని లక్షణము 'యుద్ధము చేయకున్న మరణము తప్పక సంభవించు పక్షమున, యుద్ధము చేయుచో రవంతయైన గెలుపునం దాసయున్నపుడు దప్పక యుద్ధము చేయఁదగు' నని పండితులు పలుకుదురు." అని యాలోచించి యాకుళీరము తనశక్తి యంతయు నుపయోగించి కొంగమెడను బట్టి దానిని ఛేదించెను.

అని మంత్రి చెప్పఁగా విని చిత్రవర్ణుఁడు "సచివోత్తమా! ఇచట నీకర్పూర ద్వీపమున రాజుగాసుండి, యిచటి యమూల్య

వస్తువులన్నియు మేఘవర్ణుఁడు నాకంపగలఁడనియు, వానిని సుఖముగా ననుభవింప వచ్చుననియు భావించితి" నని పలుక మంత్రి నవ్వి యిటులనియె. 'రాబోవుసుఖములను దలఁచుకొని సంతసించు వాఁడవి కలుగ నపుడు మిక్కిలి యాశాభంగము నొందును.'

రా జా మాటవిని రహస్యముగా గ్రద్దతో"నట్లైన నిప్పుడు నన్నేమిచేయమందు' వని యడిగిన మంత్రి యిటులనియె. 'మదోద్ధతుఁ డగు రాజును, జెల రేఁగిన యేనుఁగును నడుపువారు జననిందకుఁ బాత్రులగుదురు. ప్రభూ ! వినుము మన బలాధిక్యత వలన దుర్గము గెలువఁబడినదా ? లేక యుపాయబలమున గెలువ బడినదా?" యని ప్రశ్నింప రాజు "ఆర్యా ! పూజ్యులగు తమ యుపాయముననే గెలువఁబడిన" దనియెను.

అటులైన నామాటయందు గౌరవముంచి వెంటనే స్వదేశమున కేఁగుటమేలు. అట్లుకాదేని వర్షాకాలము రాఁగానే మరలఁ దప్పక యుద్ధముజరుగును. పరభూమియందున్న మన కపుడు స్వదేశమున కేఁగుటకైన వీలుచిక్కదు. శాంతి సుఖముల నాసించినచో సంధిచేసికొని వెడలుట యుత్తమము. దుర్గము జయించి కీర్తి సంపాదించితిమి. సంపాదించిన విజయ మపజయముగా మారకుండ మనము చూచుకొననియెడల లబ్ధనాశము నొంది దుఃఖపడిన మొసలివలె నగుదుము. నీకాకథ యెఱింగించెదను వినుము.

## తన యవివేకముచే లబ్ధనాశనమొందిన మొసలి గాథ

లవణసముద్రతీరమున మహావృక్షములతో నిండిన యొక తోఁటలో బలివర్ధనుఁడను నొక కపివరుఁడు వేలకొలఁది తన యనుచరులతో నివసించుచుండెను. కొంతకాలమునకుఁ బిమ్మట సమీపమందలి మఱొక కోఁతుల మందకు నాయకుఁడైన కపీశ్వరుఁడు ముదుసలియగు బలివర్ధనుం బాఱఁద్రోలి యాతని రాజ్య మాక్రమించెను.

బలివర్ధనుఁడు చేయునదిలేక సిగ్గువడి యచటనుండి చాల దూరము వెడలిపోయి యొక నదిగట్టునఁ బండ్లతో నిండిన యొక పెద్ద మేడిచెట్టును గనుఁగొనెను. తన యదృష్టము వలన ఫలభరితమైన యా వృక్షము కనఁబడినదని సంతసించి యా చెట్టుపై వసించుచు నందలి పండ్లారగించుచుఁ గాలముఁ బుచ్చుచుండెను.

అట్లా మర్కటము పరిపక్వములైన మేడిపండ్లుగోసి కొని భక్షించుచుండ నొకపండు చేయిజారి నీటిలోఁబడి చప్పుడయ్యెను. అదేసమయమునఁ గ్రకచుడను పేరుగల మొసలి యొకటి సమీపమున జలములందు సంచరించుచు నా ధ్వని విని "ఈ ప్రాంతమున నెప్పుడు నిట్టిధ్వని విని యుండలేదు." అని తలయెత్తి చూచెను. గట్టుమీఁది యుదుంబరవృక్షశాఖాగ్రమున విలాసముగాఁ గూరుచుండి పండ్లు కోసి తినుచున్న మర్కటముం జూచి, యది జారవిడిచిన ఫలమే ధ్వనికిఁ గారణ

మని తెలిసికొనెను. వెంటనే "ఓ మర్కట శ్రేష్ఠుఁడా! నీవు మహోన్నతస్థానము నధిష్ఠించి మహాఫలము లనుభవించుచుంటివి. క్రిందనున్న మావంటి మిత్రులకుఁ గూడ ఫలప్రదానముఁ గావింపరాదా?" యని యడిగెను. బంధుమిత్రవర్గము నెడఁబాసియున్న వానరమున కా మాట లమృతప్రాయముగాఁ దోఁచెను. వెంటనే క్రకచుని చెలిమి కోడంబడి మధురములైన కొన్ని ఫలములుగోసి యాతనికిఁ గ్రిందఁ బడవైచెను. క్రకచుఁడును వాని మాధుర్యమునకుఁ బరవశుఁడై కొన్నిరోజులింటికిఁ బోక కపివరునితో మైత్రి నెఱపుచు నచటనే యుండెను.

ఆ మొసలి భార్య యెంతకాలమునకు నింటికి రాకయున్న పెనిమిటిని దలంచుకొని మిక్కిలి విచారించి, తన చెలికత్తెను బిలిచి యిట్లనెను.

"ఇంతకుముందు నా ప్రియుఁ డెచ్చటి కేఁగినను వెంటనే తిరిగివచ్చుచుండువాఁడు. ఈ సారి వెడలి యిన్ని దినములయినను నింటికిఁ జేరకుండుటకుఁ గారణమేమియుఁ గానరాదు. ఎచటనైనఁ జిక్కులఁబడెనో? పరాంగనలం దాసక్తుఁడై యెచటనైన నిలిచిపోయెనో? యెఱుఁగరాదు. కావున నీవేఁగి యెట్లైన సమాచారముం దెలిసికొని రమ్ము."

చెలికత్తెయు మర్కటమకరముల చెలిమిఁ గనుఁగొని యాఁడుమొసలి కడకు మరలిపోయి యున్నవియు లేనివియుఁ గల్పించి యిట్లు చెప్పెను.

" చెలీ! నీ పనుపున నెవ్వరెఱుంగకుండఁ బోయి నీ పతి జాడ గనుఁగొని వచ్చితిని. ఈ నది యొడ్డున నొకయుదుంబర వృక్షము మీఁద రూపలావణ్య విలాసములతో నొప్పు నొక కపిభామ గలదు. నీప్రియుఁ డామె పొందునొంది మక్కువతో నక్కడి నుండి కదలి రాఁజాలకుండెను. నీమీఁది భక్తిచే సత్యము చెప్పవలసి వచ్చినది. "

చెలికత్తె చెప్పినమాటలు విని యాఁడు మొసలి మిక్కిలి పరితాప మొందుచుండునంతలోఁ గ్రకచుఁడు పెండ్లాము మీఁది మక్కువచేఁ గపివరునడిగి యుదుంబరఫలములు గొన్ని దీసి కొని యింటి కేతెంచెను. మిక్కిలి వంతనొందియున్న ప్రియు రాలింగాంచి " కోమలీ! నీ తీరు చూచిన మిక్కిలి భయమగు చున్నది. నీవిట్లు పరితాపము నొందుచుండుట గారణమేమి? నీ మనసులోని బాధయేమో కొంచెము నాకెఱింగించితి వేని నీకోర్కెయెట్టిదైనఁ దీర్చెద" నని పలికెను. ఆడుమొసలి యేమియుఁ బలుకఁజాలక చెలికత్తెవంకఁజూడ నది నిజమేయని తోఁచున ట్లీ విధమునఁ బలికెను.

" నీవు వెడలినది మొద లీమె రోగమునకుఁ జిక్కినది. ఇఁక గొన్నినాళ్ళిటులున్న నీమె జీవించుటకల్ల. ఒకసిద్ధుఁడీమె జీవించుట కొక మందుచెప్పి వెడలినాఁడు. నాఁటినుండియు నీసంగతి నీకుఁ దెలుపుదమన్న నీజాడయే కానరాదయ్యెను. "

ఆ మాటలువిని కనులనీరు వెట్టుకొని క్రకచుఁ డిట్లనియె. " సంజీవని మొదలుగా నెట్టి వస్తువైన నవలీలగాఁ దెచ్చి

యీామెను బ్రదికింపఁగలను. ఇది వట్టిమాటగాదు. వెంటనే చెప్పు మాయౌషధ మెద్ది?

ఆ మాటలకు 'వానరహృదయముఁ దిన్నచో నీమె రోగము వెంటనే మానును. లేకున్నఁ గొలఁది కాలములో మరణము తప్పదు' అనిచెప్పి వెడలినాఁడు సిద్ధుఁడు. ఈమె నెట్లు బ్రదికించుకొందువో నీసామర్థ్యములో నున్నది. యని చెలికత్తె తెలిపెను.

అదివిని యా మొసలి సరే! యని పలికి కొంతదూరము వెడలి తనమనమున నిట్లు చింతించెను. "కపి హృదయము నాకు దొరకుటెట్లు? కపీశ్వరుఁడైన బలివర్ధనుఁడు పుణ్యాత్ముఁడు, నా ప్రమిత్రుఁడును. అట్టివానిని వధించుట పాడియా? ఎంత విషమ పరిస్థితి సంభవించినది? ఒక వంకఁ బ్రాణమిత్రుఁడు. వేఱొకవంకఁ బ్రియసతి. ఇద్దఱుఁ బ్రాణముకన్న బ్రియమైన వారు. అయినను 'భార్యను రక్షించుకొనుట పరమధర్మ' మని పెద్దలు చెప్పుదురు.

ఉన్నతకులమున జన్మించి, చక్కఁదనమున నతిశయించి, సుగుణముల మేటియై యేమ్మృగలోచన పతి మనసును భక్తిచే వశపఱచుకొనునో యట్టి సతికిఁ బతియై యుండుటకన్న ధన్యత యేమి యుండును? కావునఁ గులకాంతను రక్షించుకొనుటకై బలివర్ధనునిఁ ద్యజించివైచెదను."

ఇట్లు నిశ్చయించి తడఁబడుచు మంద మందముగ నా యుదుంబరవృక్షముం జేరం జనుదెంచిన క్రకచునిం జూచి బలివర్ధనుఁడు " సఖుఁడా ! ఇన్నాళ్ళుండి యింటికి వెడలి వెంటనే మరలివచ్చితివి. దీనికిఁ గారణమేమి ? నీముఖముఁ జూడ విచారముతో నున్నట్లు కానవచ్చు చున్నది. ఇంటియొద్ద నందఱుఁ గుశలమే కద ? " యని ప్రశ్నించెను.

" చాలకాలము నీ చెలిమి కలవడి యుండు కారణమున నింటికిఁ బోగా నాయిల్లెరవై కానఁబడెను. ఉపకారమును గోరి మైత్రి చేయుదురు. నీవట్లు ప్రత్యుపకార మపేక్షింపక నాతోఁ జెలిమిచేసితివి. అట్టి నీవంటి యుత్తముని విడిచి యుండుటు యెట్లు ? " అని మకరము జవాబీయఁగా మరల బలివర్ధను డిట్లనెను.

"నీకు నేను గావించిన మహోపకార మేమిగలదు? నీతోడి స్నేహము వలన నాకు రాజ్యము పోయిన దుఃఖము దొలఁగినది. నీమైత్రివలన సంతోషముగాఁ గాలము గడుపు చుంటిని. శోకమును, శత్రుభయమును పోఁగొట్టి ప్రీతి విశ్వాసము లకుఁ గారణమైన "మిత్ర" అను నక్షరద్వయమనెడి రత్నము నే దేవుఁడు సృజించినాఁడోకదా !"

ఆమాటలు విని క్రకచుఁడు "సఖుఁడా ! ఆకాశము వరకుఁ బెరిగిన యీచెట్టు మీఁద నీవును, నీటియడుగున నేనును నున్నంతవరకు మన మైత్రికి సంపూర్ణఫలమెట్లు చేకూరును?

ఇంతేకాక నీవొసంగిన ఫలములు గొనిపోయి నాప్రేయసి కిచ్చి నీవృత్తాంతముఁ దెలిపితిని. 'ఇన్నాళ్ళు ప్రాణమిత్రు డొసగిన మధుర ఫలములు తెగఁదిని, యాతని మన యింటి కతిథిగాఁ గొనిరాకుండ నెట్లు రాఁగలిగితిరి? మీకీ మాత్ర మాలోచనయే యేల తోఁచకపోవలయును?' అని నాభార్య నను మందలించినది. కావున నిన్నుఁ దీసికొని పోవలయునను తలంపున వచ్చితిని" అని పలికెను.

'తరుచరమ నగు నేను నీతో జలములలోని కెట్లు రాఁగల' నని బలివర్ధనుఁడు ప్రశ్నింపఁగా "నీకాభయమక్కఱలేదు. నామూపుపై నిన్నుఁ దీసికొనిఁ పోఁగలను. మా యింటి సమీపమున నిసుకతిన్నెయందు మన ముల్లాసముగా విహారింప వచ్చును. అచటను ఫలవృక్షములుగలవు." అని క్రకచుఁడు బదులు పలికెను.

వానరవరునికి మకరపత్నిని జూడవలయునని వేడుక కలిగెను. వెంటనే నిష్కపట బుద్ధితో మొసలి వీపు మీఁదికి వచ్చి కూరుచుండెను. అట్లు బలివర్ధనునిఁ గొని పోవుచు నూరకుండఁ జాలక మకరమిట్లు తలపోసెను. 'నేటి కీ మిత్రునిఁ జంప వలసి వచ్చెనుగదా! నావంటి పాపాత్ముఁ డుండఁడు. స్త్రీ కారణమునఁ జెలికానిం జంపుచున్న నాకు లోకమున నెట్టినింద కలుగునో కదా!

బంగారము మంచి చెడ్డలు క్షణములో నొరపుడు రాతిపై గీచి తెలిసికొనవచ్చును. కొంచెము పరిశీలించి

చూచినచోఁ బురుషుని గుణము లిట్టివని గుర్తింపవచ్చును. ఎంత పరిశీలించినను స్త్రీస్వభావముఁ దెలియుట కష్టము. ఒక వేళ నాప్రియురా లేదైనఁ గారణమున నీయుక్తి పన్నె నేమో తెలియదు, ఇట్లాలోచించుచుఁ బరధ్యానమున 'నాడుదాని కొఱకుఁ బ్రియమిత్రునిఁ జంప నాకెట్లు బుద్ధి పుట్టెను' అని కొంచెము గట్టిగాఁ బలికెను.

ఆమాటలు విని బలివర్ధనుడు 'ఇప్పుడేమని పలికితివి? నీమనసులోని చింతయేమో నాకెఱిఁగింపుము' అనఁగా మొసలి 'నే నేమియు ననలేదే! నీవు పొరపడియుందువు.' అని బదులు వలుకగాఁ బలివర్ధనునకు మిక్కిలి సంశయము గలిగెను. 'దీని కేదియో కారణముండి తీరును. అడిగి చూచెదనుగాక.' యని తలచి "నాకుఁ దోబుట్టువగు నీభార్యయిపుడు కుశల ముగ నున్నదా?" యని యడుగఁ గ్రకచుఁడు పరవశత్వమున "నాభార్య జబ్బుపడినది. వైద్యులు రోగ మసాధ్యమని చెప్పిరి. ఏదోయొక మందు చెప్పినఁ దెచ్చువారు లేరు. నీటిలోనున్న వారిపని యింతియేకదా!" యని పలికెను.

ఆమాటలు విని బలివర్ధనుఁడు "జలములందేకాని బయల సంచరింపఁజాలనను విచారము నీకేల? ఆమం దేదియో నాకుఁ దెలుపుము. అది యెచటనున్నను భూవలయమంతయుఁ దిరిగియైన సూర్యుఁ డస్తమించులోపలఁ దెచ్చి యీఁగలను." అని పలుకఁగా మకర మిట్లనియె.

"ఒక వైద్యు నడిగితిని. ఆతఁడు చెప్పిన మందు నీకుఁ దెలుపఁజాలకయే నేను బరితాపబడుచుంటిని. ఇపుడు నీవు గట్టిగాఁ బ్రశ్నించుచుంటివి గావునఁ జెప్పకతప్పదు. నామనసు లోని దుఃఖము తొలఁగుట నీవశముననే యున్నది."

ఆ మాటలు విని వానరనాథుఁడు "మనసు గలిసిన వారి కేమాటయైనఁ జెప్పక దాచుట పాపమని చెప్పుదురు. ప్రాణసఖుఁడ నగు నాకడ దాపఱికము నీకుఁ దగదు. ఎంత చెప్పఁగూడని మాటయైనఁ జెప్పుము." నావుడుఁ గొంతవిచారముఁ దక్కి యామొసలి యిటులు పలికెను.

"వానరోత్తమా! 'కోఁతి గుండెతోఁ గూడిన యౌషధ మీ మగువ కిచ్చినచో నీమె జీవించును. రోగమంతయు హరించును.' అని వైద్యుఁడు నాసతికిఁ జెప్పెను. ఆమె నన్ను వానరహృదయముఁ గొనిరమ్మని కోరెను. ఈ సంగతి యెవ్వరికిఁ దెలుపక నీకుఁ జెప్పలేక యుంటిని. భార్యకు రోగము వచ్చిన వైద్యము చేయింపలేని యసమర్థుఁడని జనులందఱు నిందించెదరని యీపనికిఁ బూనుకొంటిని."

క్రకచుని మాటలు విని బలివర్ధనుఁడు భయమునఁ గొయ్యబాఱిపోయి, కొంతసేపటికిఁ దేఱుకొని తనలో నిట్లాలోచించెను. "ప్రేమ నటించి యింటికిఁ బిలువఁగా నీమొసలి మాటలకుఁ జిక్కి మోసపోయితిని. ముదిమివచ్చినను జితేంద్రియుఁడను గాక మకరసతిం జూచు కుతూహలము నొందుట

వలన నిట్టి యాపదకు లోనయితిని. రాగద్వేషములు విడువని వాఁ డరణ్యమున నున్నను బ్రయోజనములేదు." ఇట్లాలోచించి దైవవశమున నొక్క యుపాయము స్ఫురింపఁగా గ్రకచునితో నిట్లనెను.

"ఓయీ, సఖుఁడా! ఎంత పొరపాటు చేసితివి? నాకీ సంగతి ముందేల చెప్పవు? అట్లు చెప్పిన నామందు దీసికొనియే వచ్చువాఁడను గదా!

గుండె బరువని ముసలితనమున మోవఁజాలక యొక కొమ్మమీఁదఁ బెట్టి సంచరించుచుంటిని. నేను దురదృష్టవంతుఁడను. మిత్రునకుఁ బ్రాణావసరమైన పదార్థము దగ్గఱనుండియు సమయమున కుపయోగింపని నాజీవితము వ్యర్థము.

అయిన నిది యాలోచనకు సమయముగాదు. త్వరితముగా మేడిచెట్టు కడకుఁ గొనిపొమ్ము. అస్మదీయ హృదయముంగొని యతిశీఘ్రముగా మరలివచ్చి యామె మరణింపకుండఁ గాపాడవలయును."

ఆమాటలన్నియు నమ్మి యామకరము వానరముఁ దీసికొని క్షణములో నుదుంబరవృక్షముఁ జేరెను. వెంటనే కోఁతి కుప్పించి చెట్టుకొమ్మమీఁది కెగసి చిట్టచివరికొమ్మఁ జేరెను. 'చెలికాఁడా! రమ్ము. శీఘ్రముగఁ బోయి ప్రియసతిం గాపాడవలయును' అని క్రకచుఁడు పిలువఁగా బలివర్ధనుఁడు వికటముగ నవ్వి యిటు లనెను.

"చాలుఁ జాలు. నీతోఁ జెలిమిచేసి చాల మేలొందితిని. కోఁతి గుండె యెచట నుండునో తెలియని మూర్ఖుఁడవు పెండ్లాము పన్నుగడ లెట్లు తెలిసికొనఁగలవు? అది యెట్టి రోగమో గ్రహింపఁగల బుద్ధి నీకులేదు. ఒకమాఱు వంచింపఁబడియుమరల నీకడకు వచ్చు మూఢుఁడనుగాను. తొల్లి యొక నక్క మాటలు విని బుద్ధిలేని గాడిద యొకటి రెంపు మాఱులు వంచింపఁబడి వినాశము నొందెను. నీ కాకథ తెలుపుదును, వినుము.

## రెండుమాఱులు వంచింపఁబడి మరణించిన గాడిద కథ

ఒక భయంకరమయిన యడవిలో నొకసింహము రాజయియుండెను. ఆతనికడ నొక జంబుకము ప్రియభృత్యుఁడై యుండెను. ఒకనాఁడాసింహముం జంబుకము నూచి "ఓయీ! నా దేహమున మహోదరవ్యాధి యంకురించి, యంతకంతకు ముదురుచున్నది. తగినమందు సేవింపకున్నచోఁ బ్రమాదము సంభవింపఁ గలదు. గార్దభకర్ణ మొక్కటి లభించినచో నది యౌషధమునఁ గూర్చి యారగింతును. దానితో నా వ్యాధి యంతరించిపోవును. కావున నెట్లయిననొక్క గాడిదను నాకడకుఁ గొనిరమ్ము" అని దీనముగాఁ బలికెను.

"చిత్తము" అనిపలికి యాజంబుకము గార్దభమునకై వెదకుచుఁబోయి యొకగ్రామ సమీపమునఁ జిక్కియున్న చాకలివాని గాడిదను జూచి జాలినటించుచు వినయముతో మాట

లాడి దానికి నమ్మకము పుట్టించి మృగేంద్రముకడకుఁ గొని వచ్చి యెదుటనిలిపెను. ఆసింహము దానింజంపఁబోఁగా నది దాని కందక వేగముగఁ బరుగిడి తనతావునకుఁ బోయి నిలిచెను.

అపుడు సింహము సృగాలముం జూచి "మనయత్నము నెఱవేఱినది గాదు. ఎట్లయిన మరలఁ బ్రయత్నించి కార్యము సాధింపవలయు" ననఁ "మూఢచిత్తుఁడు ముం దెఱుంగక మోసమునకు లోనగునుగాని యొకమాఱు కపటము గనులార జూచియు మరల మోసగింపఁబడుట కష్టము. అయినను నా నేర్పుకొలఁది యత్నించెద" నని పలికి యాగార్దభము కడకుఁ బోయి "ఓయీ! మృగరాజును సేవించి యాతనికడనున్న మేఁత యంతయు సుఖముగా ననుభవింపవచ్చును. సేవకు లందఱుఁ బ్రీతితో మన్నింపఁగలరు. ఈవిధమునఁ బెద్దఱికము వహించియుండజాలక భయపడి పాఱివచ్చుట తగునా? సాహ సము లేని వానికి సంపదలు రమ్మన్న వచ్చునా?

మఱికి బట్టలు మూఁపున మోసిమోసి, చాకలిచేఁ దిట్టులు, మోదులు నొందుచు నిచటనే నడపీనుఁగవై పడియుం డుట మేలని తలఁచుచుంటివా?" యని పలికెను.

"ఇరువురమును గలిసిమెలసి బ్రదుకుదము రమ్మని నమ్మించి కొనిపోయి సింహమునెదుట నిడి ననుఁ జంపింపఁ దలఁ చుట నీకు న్యాయమా? వాడిగోళ్ళుసాచి, ముఖ మెఱ్ఱవాఱి

భయంకర మగునట్లుగా నామీఁది కుఱుకఁబోవుచుండు సింహము బారిఁదప్పించుకొని పాఱిపోవ కెట్లు నిలువఁ గలను?" అని యాగాడిద బదులుపలుకఁగా మరల జంబుకము "నీ విదివఱ కెన్నఁడు సింహముం జూచియుండని కతమున నట్లు భయపడి తివి. సమీపించి నమస్కరించినచో నాతఁడు దయార్ద్రహృద యుఁడై కాపాడును. అది యెఱుఁగక నీవు రాజాశ్రయముఁ బోఁగొట్టుకొంటివి.

స్నేహభావమున నీకు మేలుసేయఁ బోఁగా నా య త్నము ఫలింపదయ్యెను. శ్రేయస్కరమగు యత్నమునకు బహువిధములైన విఘ్నములు కలుగుచుండును. రాజాశ్రయ మువలన నెన్నియైన మేళ్లు చేకూఱునుగదా!" యని ప్రియా లాపములు పలుకుచున్న గోమాయు వచనములకు లోఁబడి యాగార్దభ మిట్లనెను.

"నీవు నాకు మిక్కిలి ప్రియసఖుఁడవై నాకు మేలు గూర్పఁదలపెట్టితివి. నీ వన్నమాట లన్నియు నిజము. తిండి చాలక బాధపడుచుండుట కన్న దొడ్డరాజునకు సేవకుఁ డనై యొక్కదినము జీవించినను జాలును."

ఇట్లని నమ్మకముఁ బ్రకటించియున్న యా గార్దభముం దోడుకొనిపోయి మృగరాజు ముందట నిలిపి జంబుక మిట్లనియె. "ఈతని నమ్మించి తోడి తెచ్చితిని. ప్రియభృత్యునిగాఁ జూచి యీతని మన్నింపఁదగును." అని పలికి దూరముగాఁ

దొలఁగిపోయెను. సింహామును మెలఁపున నా గాడిదను బట్టు కొని చంపివైచెను."

ఆ విధమున రెండవమాఱు నీకుఁ జిక్కుటకు నేను బుద్ధిలేని గాడిదను గాను. ఈపాటికి స్నేహాము చాలించి ప్రియాంగన కడకు దయచేయవచ్చును." అని బలివర్ధనుఁడు పలుకఁగాఁ జింతాక్రాంతుఁడయిసిగ్గుపడుచుఁగ్రకచుఁడుజలమధ్య మునకుఁ బోయెను. కావున మనము మెలఁకువ గలిగి వర్తింపక యుద్ధమే ముఖ్యమని యెంచిన విజయ మపజయ ముగా మాఱి లబ్ధనాశము సంభవింపవచ్చును.

"ధర్మముఁ దలపోసి రాజునకుఁ బ్రియమా, యప్రి యమా? యని యాలోచింపక సత్యవాక్కులు కొంచెము పరుషముగా నున్నను జెప్పఁగలిగినవాఁడే యుత్తముఁడు. అట్టివాఁడే రాజునకు నిజమైన మిత్రుఁడు. మిత్రులను, సేనను రాజ్యమును, దన్ను, కీర్తిని యుద్ధమునకు సిద్ధపడి సందేహాడోలి కయందుఁ బడద్రోయ వివేకవంతుఁ డెవఁడు తలపోయును?" నావుడుఁ జిత్రవర్ణుఁ 'డట్లైన ముందే యేల యీసంగతిఁ జెప్ప వైతి' వని యడిగెను.

దానికి మంత్రి నామాట నీవు తుదివఱకు వినవైతివి గాదా! అప్పుడైన నీ యుద్ధారంభమునకు నేను సమ్మతింపలేదు. అది యటుండనిమ్ము. ఈ హంసల రాజగు హిరణ్యగర్భుఁడు సంధిజేసికొనఁదగు సకల సుగుణములు గలవాఁడు. కాని విరోధింపఁదగినవాఁడు కాఁడు.

ఇట్లు దూతయగు బకము చెప్పఁగా విని చక్రవాకము నీ విక వెడలుము. అనంతర విషయములు దెలిసికొని మరల రావచ్చు' నని యాతని బంపించి హిరణ్యగర్భునితో నిట్లనెను.

"రాజా! మనమిపుడు సంధి గావించుకొనుటయే యుక్తము. శత్రుమంత్రి గ్రద్ద చెప్పిన దిదియే కదా! జయగర్వమున నాతఁడు వెంటనే మంత్రిమాటలు మన్నింపకపోవచ్చును.

మహాబలవంతుఁడు, సింహళద్వీపాధిపతియు నగు సారసము మనమిత్రుఁడుగదా! ఆతనికి జంబూద్వీపముపైఁ గోపము కలిగింపఁవలయును. బలవంతులతోఁ జేరి సంచరించుచు శత్రువులకుఁ బీడకలిగింపవలయును. బలవంతులచే నట్లు పీడింపఁబడిన శత్రువు తనచే విజితులైనవారితోనైన సంధిఁజేసికొనుట కీయకొనును. నావుడు రాజహంస యామాటల కంగీకరించి విచిత్రమను పేరుగల బకమున కొక రహస్యలేఖ వ్రాసియిచ్చి సింహళద్వీపమునకుఁ బంపెను.

అచట దీర్ఘదర్శి చిత్రవర్ణునితో మరల నిట్లు పలికెను. "ప్రభూ! మేఘవర్ణుఁ డచటఁ జాలకాల ముండెను గదా! రాజహంస సంధిచేసికొనఁదగు సుగుణములు కలవాఁడైనదియుఁ గానిదియు నాతఁ డెఱుంగును. నావుడు రా జాతనిఁ బిలిచి "హిరణ్యగర్భుఁ డెట్టివాఁడు? ఆతని మంత్రి చక్రవాకము స్వభామము నేపాటిది?" యని ప్రశ్నింప వాయసము హిరణ్య'గర్భుడు ధర్మరాజునకు సాటివచ్చు గుణవంతుఁడు. చక్రవాక

మునకు సాటిరాఁదగు మంత్రులు లోకమున నరుదు' నావుడు మయూర మిటు లనియె.

'అంతటి సమర్థులైనచో నీవా రాజు నెటులు వంచింపఁ గలిగితివి ?' అను ప్రశ్నకు వాయసము నవ్వి యిటులనియె. 'ప్రభూ ! నమ్మినవారిని వంచించుటలో విశేషమేమి కలదు ? ఒడిలో సుఖ నిద్రగాంచిన వానిఁజంపుటయు నొక పౌరుషమే యగునా? చక్రవాకమంత్రి నన్నుఁ జూచిచూడకుండఁ గనే కనిపెట్టెను. కాని యాశ్రితవత్సలుఁడగు నారా జాతని మాటలు వినక నన్ను నమ్ముటవలన నేను వంచింపఁ గలిగితిని. తనవలెనే యెదుటివారును నిష్కపటులని నమ్మువారు ధూర్తులచే మోస గింపబడిన బ్రాహ్మణునివలెఁ జెడిపోవుదురు. నీ కాకథ వివ రించెదను; వినుము.

## ధూర్తులచే వంచింపఁబడి యజ్ఞమేషమును వదలుకొన్న బ్రాహ్మణుని కథ

గౌతమారణ్యమందలి యొక విప్రుఁడు యాగముచేయఁ గోరి గ్రామాంతరము నకుఁబోయి యొక్క ఛాగమును గొనెను. దాని నాతఁడు బుజముపై నిడుకొని తీసికొనిపోవుచుండ ముగ్గురు తుంటరులుచూచిరి. ఈఛాగముమిక్కిలి బలిసియున్నది.దీని నే యుపాయముననయిన నపహరింపఁ గలిగినచోఁ జక్కఁగాఁ దిన వచ్చును. అని యాలోచించి యాబ్రాహ్మణుని మార్గమున

ముువ్వురు మూడుస్థలముల దూరముగా నిలిచి యాతని రాక కెదురు చూచుచుండిరి.

అందొక ధూర్తునియొద్దకు బ్రాహ్మణుఁడు రాఁగా నాఁతడు వినయము మెఱయ "బ్రాహ్మణోత్తమా! సర్వము దెలిసిన మీరీ కుక్కను బుజము నెక్కించికొనుట న్యాయమా?" యని ప్రశ్నించెను. అపుడు విప్రుఁడు "ఛీమూర్ఖుఁడా! యాగచ్ఛాగమును కుక్కయనుటకు నోరెట్లువచ్చె" నని యాతని ధిక్కరించి ముందునకుఁబోఁగా రెండవధూర్తుఁడును నాశ్చర్యము బ్రకటించుచుఁ 'బరమపవిత్రులగు బ్రాహ్మణులు కుక్కనుమోసికొనిపోవుట ఘోర' మని యాబాపనితోఁ బలికెను.

అపు డావిప్రుఁడు కొంచెము సంశయించి మేక నొకసారి క్రిందికి దింపి పరిశీలించిచూచి 'కుక్క కా'దనుకొని మరల బుజముపై నుంచుకొని పయనము సాగించెను. దుష్టు ల వాక్యములు విన్న వివేక వంతులకును నొకపుడు నిజముగా మతిచలించును. అట్టిమాటలను నమ్మియొకపుడు చిత్రకర్ణునివలె మరణముగూడ నొందఁ గలరు. నీకాకథ తెలుపుదును వినుము.

## దుష్టుల మాటలువిని, నమ్మిచెడిన లొట్టియ కథ

ఒక వనమందు మదోత్కటమను సింహము నివసించుచుండెను. దానికిఁ గాక వ్యాఘ్రజంబుకములు ముువ్వురనుచరులు. వారు వనమునఁ దిరుగుచు సార్థమునుండి తప్పిన యొంటె

నొకదానిం జూచి 'నీ వెచటినుండి వచ్చితి?' వని యడుగ నది తన వృత్తాంతము వివరించెను. వారు దానిని సింహమునొద్దకుఁ గొనిపోయి దర్శనము చేయింప సింహము దానికభయమిచ్చి, చిత్రకర్ణుఁ డని పేరిడి తన పరివారమున నుండ నియమించెను.

ఇటులుండఁ గొన్నిదినములైన పిమ్మట నొకనాఁడు సింహమునకు శరీరమున ననారోగ్యము కలిగి, వేటకుఁ బోవలేక పోయెను. అందు లన నెవ్వరికి నాహారము దొరకలేదు. అప్పుడు కాక వ్యాఘ్రజంబుకములు రహస్యమున నిటు లాలోచించెను.

'ఈచిత్రకర్ణుని మనరాజు చంపునటులు చూడవలయును. కంటకాదులఁ దిను నీతని వలన నుపయోగ మేమికలదు?' అని కాకము పలుక, వ్యాఘ్రము 'మన ప్రభు వీతని ననుగ్రహించి యభయమిచ్చి స్నేహముతో నుండగా నీతని జంపించుట యెట్లు సాధ్యమగు' నని ప్రశ్నించెను. దానికి కాక మిటులు పలికెను. "మన ప్రభు వివు డాహారములేమిఁ గృశించి యున్నాఁడు. తిండికొఱకెట్టి పాపమునకైన నొడిగట్టఁ గలఁడు. ఆకలి గొనియున్న స్త్రీ తన పుత్రునైన విడిచి వైచును. ఆకలిగొని పాము తన యండములనే భక్షించును. క్షుధార్తులయిన నరులు కరుణాహీనులై ఏపనినైనను జేయుదురు."

ఆమాటల ప్రకార మంగీకరించి యవి సింహము దగ్గఱకు వెడలెను. సింహమువానిం జూచి 'యాహారమేమైన

దొరకెనా!' యని యడుగఁ "ప్రభూ! అల్పులమగు మే మెంత యత్నించినను గొంచెమైన దొరకలేదు. నాఁపుడు 'నీకబ్రదుకుట కేమిమార్గ' మని సింహ మడుగ 'స్వవశమందున్న యాహార మును విసర్జించుట చేత నీవిధముఁగ సర్వనాశన పరిస్థితి సంభ వించినది' అని కాకమనెను. 'స్వాధీనమైన యాహారమేమి కల' దని సింహ మాశ్చర్యముతో నడుగఁ గాకి 'చిత్రకర్ణుఁడే యా యాహార ' మని పలికెను.

దానికి సింహము చెవులు మూసికొని "ఈతనికి నే నభయమిచ్చి చేరఁదీసితిని. భూదానము కాని, సువర్ణ దానము గాని, గోదానాన్నదానములుకాని యభయ ప్రదానమునకు సాటిగావు. అట్టి యభయ దానము నెట్లు భంగపుచ్చఁగలను? సర్వకామములు నొసఁగు నశ్వమేధయాగముకంటె శరణు జొచ్చిన వారినిఁ గాపాడిన నెక్కువ ఫలము గలుగును." అనెను. సింహము మాటలకు మరలఁ గాకమిట్లు' పలికెను.

"ఈతని మీరు చంపనక్కఱలేదు. ఆతడు తన దేహ మును తనంతటఁ దానొసఁగునట్లు మేము చేయఁగలము" నావుడు సింహమేమియు బదులుపలుకఁ జాలక యూరకుండెను. అది యవకాశముగాఁగొని కాకము వ్యాఘ్రజంబుకములతో నొక కుట్ర పన్నెను.

లొట్టియకడ కేఁగి కబురులుచెప్పి దానితో నామూఁడును సింహముదగ్గఱకు జేరెను. అపుడు కాకము "ప్రభూ! మే మెంత

యత్నించిన నించుకేని యాహారము దొఱకదయ్యె. మీరా బహుదినములనుండి యుపవాసమున మిక్కిలి డస్సియున్నవారు. కావున నిపుడు నామాంసము స్వీకరించి కొంతయాకలి దీర్చు కొనుఁడు. మంత్రులకుఁ బ్రజావర్గమంతటికిఁ బ్రభువే మూలము. నరులకు సమూలములయిన తరువులేకదా ఫలము లొసంగఁ గలవు!" అని వినయము మెఱయఁ బలికెను.

దానికి సింహము "ఇట్టి మహాపాపముఁజేసి జీవించుట కన్న ప్రాణములు గోలుపోవుట మిక్కిలి శ్రేయస్కరము." నావుడు జంబుకమును నటులే 'నా దేహ మాహారముగాఁ గొను'మని ప్రార్థేయపడెను. సింహము దానికి నంగీకరింపలేదు. అనంతరము వ్యాఘ్రముకూడ 'నా దేహము నుపయోగింపు' మని సింహమును గోర 'నదియెంతమాత్ర ముచితముగా' దని సింహ మనెను.

పిమ్మట నెక్కుడు నమ్మకము కలిగి చిత్రకర్ణుఁడును 'దప్పక నా దేహము భక్షించి యాకలిఁ బాపుకొను' మని సింహమును వేఁడికొనెను. ఆపలుకులు విన్నతోడనె సింహము దానిపై నుఱికి దానియుదరముం జీల్చివైచెను. సింహము తినఁగా మిగిలిన యాహారమును దృప్తితీర కాకవ్యాఘ్రజంబుక ములు భుజించెను. కావున దుష్టవాక్కు లసత్యములైనను గొంత నమ్మకమో, సంశయమో కలిగింపకమానవు. పిమ్మట మూఁడవ తుంటరి బ్రాహ్మణుని సమీపించి "స్వామీ!

మీవంటి యుత్తము లిట్టి నీచపుఁ బనిచేయుట యేటి న్యాయ”
మని ప్రశ్నించెను.

ఆపలుకులు విని బ్రాహ్మణుఁడు “నిజముగా నాకు మతి చెడినది. లేకున్న నందఱుఁ గుక్కయని పలుకుచుండ దానిని మేఁకయని యెట్లు నమ్మెదను? ఎవఁడో దుష్టుఁడు నాకీ కుక్కను మేఁకయని యంటఁగట్టినాఁడు” అని యాలోచించి యిఁక బుజముపైనున్న దానివంకఁజూడకయే దాని నచట దిగవిడిచి, స్నానముచేసి యింటికిఁబోయి కుక్కను ముట్టు కొన్నదోషముఁ బరిహరించు కొనుటకు గాయత్రిని జపించు కొనెను. ఆతుంటరులు తమనేర్పునకు మిక్కిలి సంతసించి మేఁకను గొనిపోయి కోసికొని మాంసముం బంచుకొని తినిరి. కావున నుత్తముఁడైనవాఁ డందఱు తనవలె యోగ్యులే యని నమ్మఁజనదు.”

అదియంతయు విని మయూరరాజు మేఘవర్ణునితో ‘నీవు శత్రుమధ్యమునఁ జిరకాలము వారిని నమ్మించి యెట్లు వసింపగలిగితి’ వని ప్రశ్నించెను. మేఘవర్ణుఁడు నిట్లు బదులు పలికెను. “స్వామికార్యము నిమిత్తముకాని, స్వప్రయోజనము కొఱకుగాని చేయరాని పనియుండునే? మానవులు వంట వండుకొనుటకయి కట్టెలు దలపై నిడికొని మోయుచున్నారు గదా! వృక్షములఁ బడగొట్టుటకై నదీవేగము వృక్షపాద ములు గడుగుచున్నదికదా! బుద్ధిమంతుఁడు శత్రువును శిర

మునఁ దాల్చియైనను గార్యసిద్ధి నందఁ జూచును. కార్యసిద్ధికై కప్పలను మోచిన సర్పముకథ యొండుకలదు. నీకు దానిని వివరింతును వినుము.

## కార్యసిద్ధి నిమిత్తము కప్పలను మోచిన సర్పము కథ

ఒక పాడువడిన యుద్యానవనమున వృద్ధసర్ప మొండు నివసించుచుండెను. దానికి మందవిషమని పేరు. అది మిక్కిలి ముదిసి యుండుటవలన నాహారము వెదకుటకైన శక్తిలేక యొక చెఱువు దగ్గఱఁ బడియుండెను. దానిం జూచి దూరముననుండి మండూకమొకటి "నీ వాహారము వెదకు కొనక యేల యిట్లు పడియుంటి" వని యడుగ నాసర్పము "మందభాగ్యుఁడ నగు నన్నుఁ బలుకరించిన నీకు లాభమేమి? నీత్రోవను నీవు పొ"మ్మని పలికెను. దానితో నాకప్పకు దాని వృత్తాంత మెఱుంగ మిక్కిలి కౌతుకము పొడమి సర్పమును బలవంతపెట్ట నది యిట్లు చెప్పఁదొడఁగెను. "ఓయీ వినుము. బ్రహ్మపురవాసియు, మిక్కిలి శ్రోత్రియుఁడు నగు కౌండిన్యుని పుత్రుఁడు సకలసుగుణసంపన్నుఁడు, నిరువది వత్సరముల వయసు వాఁడుఁ దైవవశమున నడవిలో దిరుగుచుండ నేను చూచి ఘాతుకస్వభావముచే వానిఁ గఱచితిని. సుశీలుఁడను పేరుగల యా బాలుఁడు వెంటనే మరణించెను. కుమారుఁడు మరణించుట చూచి కౌండిన్యుఁడు దుఃఖభారముచే మూర్ఛనొంది నేలపైఁబడి దొరలెను.

ఆపురమందలి బ్రాహ్మణులందఱు నావార్తవిని యచటఁ జేరిరి. అది యుచితము కదా! ఉత్సవ సమయమునను, దుఃఖ కాలమునను, యుద్ధమందును, కఱవుకాలమునను, విప్లవము జరుగునపుడును, రాజద్వారమందును, మరణకాలమునను నెవ్వఁడు దరిజేరునో వాఁడే నిజమగు బందుగుఁడు.

అపుడు కపిలుఁ డను నొక గృహస్థుఁడు "ఓయీ కౌండిన్యా! వివేకము లేమింజేసి యిట్లుదుఃఖించు చున్నావు. జన్మ కలిగినపుడే మరణ మందఱకు వ్రాసిపెట్టఁ బడియుండ విచారమునకుఁ గారణ మేమి కలదు? సకల యోధులతోఁ గూడిన నరపాలు లందఱు నిపు డుండిరా? ఎంద ఱెందరో యెడఁ బాటునొందియున్నట్లీ భూమి నిలిచియుండి సాక్ష్యమిచ్చుటలేదా? శరీరమునకు క్షణక్షణము నపాయము పొంచి యుండును. సంపదలాపదలకు మూలము. కలయిక లెడఁ బాటునకు హేతువులు. జనించిన దంతయు నశింపకతప్పదు. మంటికుండ నీటిలోఁబెట్టినచోఁ గరగి పోవునటులు శరీరము క్షణక్షణము నాయువు తఱుగుటచేత క్షీణించిపోవు చున్నదని మానవు లెఱుంగఁజాలకున్నారు. ప్రతిదినము మృత్యుదేవత మనలను మరణశిక్షనొంది వధ్యస్థానమునకుఁ గొంపోఁబడువానినివలె సమీపించుచున్నది. యౌవనము, రూపము, సంపదలు, జీవితము, ప్రియుల పరిచయము నివియన్నియు ననిత్యములు. కావున వీనిపైఁ బండితుఁడు తగులాటము వహింపఁడు. మహా

ప్రవాహమున రెండు దుంగలు కొట్టుకొనిపోవుచు నొకమారు కలిసికొని యట్టె విడిపోవుచుండునట్లు మానవులు నొకమాఱు గలిసికొనుచుందురు. అట్లే విడిపోవుచు నుందురు. మఱియు నొక చాటసారి యలసి కొంతసే పొక చెట్టునీడను బరుండి విశ్రమించి వెడలిపోవును. అట్లే ప్రాణియు నొకచోట జనించి పని తీరిన వెంటనే వెడలిపోవును. ఈ శరీరము పంచభూతముల సమ్మేళనమునుండి జనించినది. మరల విడి పంచభూతములం గలియుచున్నది. దీనికై విచారించుట యవివేకము. ప్రాణి బంధువర్గముతో నెన్నివిధముల సంపర్క మేర్పఱచుకొను చున్నాఁడో యన్నివిధముల హృదయమున శోకశంకువులు నాటుకొనుచున్నవాఁడే యగుచున్నాఁడు. అపథ్యభోజనము వలె ప్రియసమాగమములు తాత్కాలికానందము గలిగించి నను మనకవి యతిదారుణములై పరిణమించును. నదీప్రవాహ ములు ముందునకే కాని వెనుకకు మరలనట్లు రేలుంబవళులు మానవుల యాయువును దీసికొని ముందునకు బోవుచునే యుండును. వియోగమను కత్తితోఁ గోయఁబడిన మానసమున కేమందును బనికిరాదు. కావుననే సత్సంగమునైనను విబుధులు కాంక్షింపరు. సగరాది చక్రవర్తు లెంతటిపుణ్యము లొనరించినను వారికిని మరణము తప్పలేదు. నరలోకమున జనించుటకు గర్భములోఁ బడినది మొదలు ప్రాణులు మృత్యువు నొద్దకు విరామము లేక పయనించుచునే యుండును. కావున

నవివేకమూలమగు విచార ముడిగి సంసారముఁ జూచికొనుము.”
అని యుదేపశించెను.

ఆ మాటలు విని, నిద్ర మేలుకొన్నవానివలెఁ గౌండి
న్యుఁడు లేచి యిటు లనెను.

“నా కిఁక నీగృహనరకము చాలును. వనవాసము
నకుఁ బోవుదును” అది విని కపిలుఁడు “రాగముతోఁ గూడిన
వారికి వనమునన్నైనఁ గష్టములు రాకమానవు. గృహమం
దుండియుఁ బంచేంద్రియములఁ గట్టుదిట్టము చేసికొన్నదియే
తపస్సగును. రాగములేనివాఁడై; కుత్సితకర్మలలో నడచుకొనని
వానికి గృహమే తపోవనము. ఏ యాశ్రమమందున్నను ఎట్టి
దుఃఖము నొందినను ధర్మమును విడువరాదు. సకలప్రాణుల
యందును సముఁడై యుండవలయును. ఆశ్రమము ధర్మకార
ణము కాఁజాలదు. బ్రదుకుట కొఱకు మాత్రము తిండియు,
సత్సంతానము కొఱకు మాత్రము సంసారమును, సత్యమా
డుట కుపయోగింపఁబడు వాక్కును నెవరికుండునో వారు
కోటలనైన దాటఁగలరు.

“ఆత్మయే నది. ఇంద్రియనిగ్రహమే పుణ్యతీర్థములు.
సత్యమే జలము. శీలమే గట్టులు. దయ కెరటములు. అట్టి
యాత్మనదియందు మునిఁగిననే మానసము పరిశుద్ధి నొందును
గాని నదీస్నానము లెన్ని చేసినను లాభములేదు. జన్మము,
మరణము, వ్యాధి, వేదన మున్నగు నుపద్రవములతో గూడిన

సంసారము విడిచిన వానికి సుఖముగలుగు" నన, గౌండిన్యుఁ డామాటల కామోదముఁ జూపెను. కాని "నేఁడు మొదలు కప్పలను మోయు" మని నన్ను శపించెను.

కంపిజలుడు "నీ విపుఁడు క్రోధముచే సహనములేక యుంటివి. ఎవరితోను స్నేహము పెట్టుకొనరాదు. అట్లుండ లేకపోయినచో మంచివారితో మాత్రముమైత్రి చేయఁదగును. అందలి దోసమున కదియేమందు." నావుఁడు గౌండిన్యుడు "యథావిధిగా సన్న్యాసముఁ దీసికొనెను. నాఁటినుండి యీ బ్రాహ్మణ శాపవశమున గప్పల మోయుటకై యిట నున్నాఁడ" నని సర్పము పలికిన మాటలు విని యామదుసలి కప్ప తమ ప్రభువగు జాలపాదునొద్ద కేఁగి యీ సంగతి దెలిపెను.

అంతట జాలపాదుఁడు సర్పము దగ్గఱకువచ్చి దాని వీపుమీఁది కెక్కెను. పాము దానిని మెచ్చుకొని విచిత్ర మగు రీతుల నడిచెను. మరునాఁడు కదలలేకుండ నున్న యీసర్పమును గాంచి మండూకరాజు "నీవిపుడు బాగుగా నడుచుటలే దే" మని యడుగ నది 'తిండి లేనందున బలహీన ముగా నుంటి' ననెను. 'నీయాకలికి సరిపడునట్లు మండుకములఁ దిని చక్కగా మోయుచుండు' మని రాజాజ్ఞాపించెను. మహా ప్రసాదమని పలికి నాటినుండియు దినదినము వలయునన్ని కప్పలఁ దినుచుఁ గొంతకాలమునకుఁ గప్పలన్నియుఁ జెల్లిపోఁగా

నాసర్పము తుదకు మండూకరాజును గూడ భక్షించెను. కావున స్వామికార్యార్థ మెట్టి యిడుమలనైన భరించుట కష్టముకాదు. ఇపు డాసంగతులు చర్చించి ప్రయోజనము లేదు. హిరణ్యగర్భుఁడు సకల విధముల సంధికిఁ దగినవాఁడు. నాయభిప్రాయ మిది'' యని మేఘవర్ణుఁడు వివరించెను.

చిత్రవర్ణుఁడన్నియు విని "నీ కీవిచార మేల? ఆతఁడు నాచే జయింపబడిన కారణమున నాకు సేవచేయుట కంగీకరింపవల యును. లేదేని విగ్రహము తప్ప'' దని పలుకుచుండగా జంబూ ద్వీపము నుండి చిలుకవచ్చి యిటు లనెను.

"ప్రభూ సింహళదేశమున కధిపతియగు సారసరాజ జీవుడు జంబూద్వీపమును ముట్టడించి యున్నాఁడు'' ఇట్లు చెప్పఁగాఁ గంగారుపడి 'ఏమైనది చెప్పుచెప్పు'మని రాజు తొం దరపెట్టఁగాఁ జిలుక మొదటివలెనే మరలఁ బలికెను.

గ్రద్ద తనలో "ఓ చక్రవాకమంత్రీ! సర్వజ్ఞా! లెస్సయైన పనిచేసితివి'' అని తలపోయుచుండెను. 'సరే! కానిండు. అచటికే వెడలి వానిని సమూలముగ నిర్మూలింపఁగల' నని రాజు పలుక దూరదర్శి నవ్వి యిటులనియె. "శరత్కాలమేఘ ముఱిమినట్లు వృథాగా గర్జింపరాదు. మహాపురుషులైన వారు పరులకుఁ దమమనసులోని యర్థానర్థములు వెల్లడింపరు. మఱియు నొక్కేసారి పదిమందితో యుద్ధము పెట్టుకొనరాదు.

"బలవంతమైన సర్పము చలిచీమలచేత జిక్కి చావదె ?' కావున సీతనితో సంధిచేసికొని మఱియేగుట మంచిది. కాకున్న మన వెనుకనే యాతఁడు విజృంభింపవచ్చును. కేవలము గోపమునకు లొంగి యథార్థమెఱుఁగకుండువాఁడు పరాభవమొంది పశ్చాత్తాప పడవలసివచ్చును.

కామము, క్రోధము, లోభము, మోహము, గర్వము, అసూయ యనునవి మానవునకు శత్రువుల వంటివి. ఇవియే అరిషడ్వర్గ మనఁబడును. వీనిని విడువ గలిగిన నరుఁడు తప్పక సుఖమొందఁగలఁడు" అను మంత్రిపలుకులకు రాజు "ఆర్యా! ఇది మీ నిశ్చయము." నావుడు మంత్రిమరల నిట్లు పలికెను "అవును పరమార్థము స్మరించుటయు, మంచిచెడ్డల తర్కమును, వివేకము తోడి నిశ్చయము, రహస్య గోపనము, దృఢబుద్ధి- ఇవి మంత్రికుండఁదగు ముఖ్యగుణములు. మఱియు నేపనియుఁ దొందరపడి చేయరాదు. దూరాలోచన లేకున్న నాపదలు తప్పవు. యుక్తాయుక్తములు గుఱుతించి పనిచేయువానిని సంపదలు వాని గుణములపట్ల నాదరముగలవై స్వయముగా వరించును. వేయేల ప్రభూ! నామాటలయం దేమైనఁ దమకు గౌరవ మున్నచోఁ దప్పకసంధి గావించుకొని వెడలుట మేలు. కార్యసాధనమునకు నాలు గుపాయములు. శాస్త్రములలోఁ జెప్పఁబడి యున్నను గడమవి మూఁడును కేవలము నామమాత్రములు. కార్యసిద్ధి ముఖ్యముగా సామము నాశ్రయించి యుండును. ఇంకను విశేష మేమన నీరాజహంస ధర్మజ్ఞుఁడు.

ఆతని మంత్రి సర్వజ్ఞుఁడు. మేఘవర్ణుని మాటలవలన, నాతఁడాచ రించిన పనులను బట్టియు నీవిషయము స్పష్టమగుచున్నది." అను మంత్రిమాట లాలించిరాజు "ఆర్యా! ఇకఁ జర్చయవస రము లేదు. నీమనసునకు వచ్చినట్లుగావింపుము. నావుడు మంత్రి 'సరే! ఉచితరీతి నాచరింత'మని పలికెను.

రాజు, మంత్రియుఁ దమ తావులకుఁ బోవఁగా నావిష యమును గమనించిన గూఢచారియగు కొంగ హిరణ్యగర్భు నొద్దకు సత్వరముగా వచ్చి "ప్రభూ! సంధి సమకూర్చుటకై మహామంత్రి గృధ్రము మన సమ్ముఖమునకు వచ్చుచున్నాఁ" డని తెలిపెను. అపుడు రాజహంస తనమంత్రితోఁ మరల నేదైన గపటము పన్నఁదలఁచి వచ్చుట లేదుగదా" యన మంత్రియగు సర్వజ్ఞుఁ డిటు లనియెను.

"ప్రభూ! ఈవిషయము సందేహింపఁదగ్గదికాదు. ఏలన దూరదర్శి గొప్పయాశయము గలవాఁడు. ఒకపుడు గొంచె మైన ననుమానింపకయుండుటయు, వేఱొకపు డన్నిఁటియందు సంశయించుటయు నను నవి మందమతుల లక్షణములు. రాత్రి నక్షత్రములు సరసులోఁ బ్రతి ఫలించినపుడు, హంస యవి తెల్ల దామరలని భావించి వానిఁజేరఁబోయి తాను వంచింపఁబడినట్లు క్షణములోఁ దెలిసికొనును. ఆహంస పవలు చెఱువులోని తెల్ల దామరలను జూచి యవి నక్షత్ర ప్రతిబింబములుగా భావించి వానిఁగొఱుకఁ దలఁపక విడుచును. అట్లే వివేక హీనుఁ డసమ

యమునను సందేహించు. సందేహాస్పదమగు విషయము వెంటనే నమ్మును. దుర్జనులవలనఁ గలఁతనొందిన మనసు గలవాఁడు సుజనులనుగూడ నమ్మక పోవును. పాయసము దినఁబోయి చేయి కాలిన బాలుఁడు పెరుగును గూడ నూదికొని తినును.

కావున నో ప్రభూ! ఆతని గౌరవించు నిమిత్తము రత్నాదికములగు కానుకలు సిద్ధపఱుపవలయును." నావుడు రాజందులకుఁ దగు నేర్పాటులుగావించెను. మంత్రి చక్రవాకము దుర్గద్వారమునొద్ద కెదురేఁగి గృధ్రమును సత్కరించి తీసికొని వచ్చి రాజదర్శనము చేయించెను. గృధ్రము రాజునకు వందనము చేసి యాతని యనుమతిపై నుచితాసన మలంకరించిన యనంతరము చక్రవాక మిటు లనియె.

'ఈరాజ్యమంతయునుమీయదియకాభావించి స్వేచ్ఛగా ననుభవింపుఁ' డన రాజహంసయు నటులే పలికెను. 'దూరదర్శి యీమాటల కిటులు బదులు పలికెను. మీవచనము లుత్తములకుఁ దగినటు లున్నవి. లుబ్ధుని ధనముచేతను, సాధుపురుషుని నమస్కారమాత్రము చేతను, మూర్ఖుని మాటకుఁ గాదనక యూరకుండుటచేతను, దత్త్వార్థముచేఁ బండితుని వశపఱచుకోవచ్చును. సద్భావముతో మిత్రుని, నుత్సవములచే బంధువులను, దానమానములచే స్త్రీలను, భృత్యులను దయచే నితర జనులను నాకర్షింపవచ్చును. కావున నాతనితో నిపుడు సంధి చేసికొనుట మేలు. రాజు చిత్రవర్ణుఁడు మహాప్రతాపవంతుఁడు"

నావుడు రాజహంసఁ మంత్రి చక్రవాకము "సంధిచేసికొను మార్గమును గూడ సెలవిండు" అని పలికెను. రాజహంస 'సంధి ప్రకారము లెన్ని?' యని యడిగెను. దానికి గృధ్ర మిటులు పలికెను.

"బలవంతుఁడు దాడి చేసినపుడు ప్రతిక్రియ సాధ్యము గాని-చోఁ గాలయాపనకొఱకు సంధిచేసికొనవలయును. కపాలము ఉపహారము, సంతానము, సంగతము, ఉపన్యాసము ప్రతీకారము, సంయోగము, పురుషాంతరము, అదృష్టనరము ఆదిష్టము, ఆత్మాదిష్టము, ఉపగ్రహము, పరిక్రియము, ఉచ్ఛిన్నము, పరభూషణము, స్కంధోపనేయము నని సంధి పదు నారు రకములు.

సమమైన తాహతుగలవారు చేసికొన్నది కపాలసంధి యనఁబడును. ధనమొసఁగి కూర్చుకొనుసంధి యుపహారమనఁ బడును. కొమార్తెల నొసఁగి చేసికొనుసంధి సంతాన సంధి. సత్పురుషులతో స్నేహపూర్వకముగా జేసికొనునది సంగతసంధి.

ఈసంగతసంధి యుత్తమము. జీవితాంతమువఱకుండు నది. ఆపదలందు, సంపదలందు సమానార్థ ప్రయోజనములు గలిగి యేకారణముల వలనను తెగిపోక యీసంధి చక్కఁగా నదుకఁబడిన సువర్ణమువలెఁ బ్రకాశించును.

తనకార్యసిద్ధి కొఱకుఁ జేసికొనుసంధి యుపన్యాస మనఁ బడును. నేనిదివఱ కీతని కుపకారముచేసితిని. ఈతఁడు మరల

నాకుపకరించునని చేసికొనుసంధి ప్రతీకార మన నొప్పును. రామ సుగ్రీవులసంధి యిట్టిదే. ఏకప్రయోజనము గలక్రియ నుద్దేశించి చేసికొనఁబడు సంధి సంయోగ మనఁబడును. 'మన యోధుల మూలమున మన మీయర్థము సాధించుకొంద' మని పణము నిర్దేశించు కొనఁబడిన సంధి పురుషాంతరము నాఁబడు. నీయొక్కని చేతనే నాపని సాధింపఁ బడవలయునని శత్రువు పణమిడి చేసికొన్న సంధిపేర దృష్ట పురుషాంతరము.

భూమిలోఁ గొంతభాగము పణముగానిచ్చి చేసికొన్న సంధి యాదిష్టమనఁదగు. స్వసైన్యముచేఁ జేసికొనఁ బడినది ఉదాహృతము. ప్రాణరక్షణముగోరి, సర్వస్వము నొసఁగి చేసికొనుసంధి యుపగ్రహము. కోశములో నొకభాగము గాని, యర్థకోశము గాని, సర్వకోశము గాని యొసఁగి శిష్టరక్షణ మునకై చేసికొనుసంధి పరిక్రమ్య మను పేరఁబరగును. సార వంతములగు పొలములొసఁగి కావించుకొనుసంధి కుచ్ఛిన్నమని పేరు. భూమిలోఁ బండు పంటయంతయు నొసఁగి చేసికొనునది పరభూషణసంధి. ఫలించినదానిలో భాగమిచ్చి చేసికొనుసంధి స్కంధోపనేయము'' అని ఇట్లు సంధిభేదములు వివరింప రా జిటు లనియె.

" ఈఁతడు మిత్రుఁ డాతఁడు శత్రుఁడని యల్పులు దలఁతురు. ఉదారచరితులగువారు వసుధయంతయు నొకేకుటుంబ మని నమ్ముదురు. పరవనితలయందు మాతృభావము, పర

ద్రవ్యమందులోష్టబుద్ధి, సర్వభూతములందాత్మభావన గలుగు వాఁడే పండితుఁడు. మీరు మహానుభావులును బండితులును. కావున మే మేమిచేయవలయునో యానతిండు.” నావుడు గృధ్ర మిట్లనెను.

“ఆధివ్యాధులచేఁ బీడితమై నేఁడో, రేపో నశించు శరీరము నిమిత్తము ధర్మము దప్పుట కెవ్వఁ డోపును. ప్రాణుల జీవితము కదలుచున్న నీటిలోని చంద్రునివలె గడు జపలము. ఈసంగతి గుర్తించి యనుక్షణము ధర్మమాచరింపవలయును. సంసార మెండమావులఁ బోలె క్షణభంగుర మని యెఱిగి; ధర్మముకొఱకు, సౌఖ్యముకొఱకు, సుజనులతో స్నేహము చేయవలయును. కావున నాయభీష్టము వినుఁడు.

‘వేయియశ్వమేధములు’ నొక్కసత్యము వేఱు సిబ్బెల లో నిడి తూచిన సత్యమే యధికముగ నుండెను. కావున సత్య మను దివ్యమను బురస్కరించుకొని యుపహారమనుసంధిఁ జేసి కొనుట యుక్తము’ నావుడు సర్వజ్ఞుఁడును దాని కంగీకరించెను.

రాజపుడు వస్త్రాద్యలంకారములు కానుకగానిడి పూజింప మిక్కిలి సంతసించి గృధ్రము తనతో సర్వజ్ఞునిఁ దోడుకొని పోయి మయూరరాజదర్శనము చేయించెను. చిత్రవర్ణుఁడును గ్రద్దమాటలువిని సర్వజ్ఞుని మిగుల నాదరించి సంధి నంగీక రించి పంపెను. అనంతరము దూరదర్శి “ప్రభూ! నేఁటికి మన కోరిక నెఱవేఱినది. ఇపుడు స్వస్థానమగు వింధ్యాచలమున

కేఁగుదము.” అని రాజుతోఁబలికెను. పిమ్మట నందఱు వింధ్యపర్వతమునకుఁ బోయిరి.

వారు వింధ్యగిరికిఁ జేరుటకుముందే హిరణ్యగర్భుఁడంపిన దూతలు శీఘ్రముగా నరిగి సింహళద్వీపాధిపతో “సర్వోపద్రవ కారణమైన యుద్ధము నుజ్జగించి చిత్రవర్ణునితో సంధి గావించు కొనుటయైనది. మేము కలిగించిన శ్రమకు మన్నించి మీరును సంధికొడంబడుట మంచిది. మీదండయాత్రవలన మాకు సంపూర్ణ ఫలితము చేకుఱినది. మీరిష్టపడినచోఁ జిత్రవర్ణుని మంత్రి దీర్ఘదర్శియుఁ దమరాజును దప్పక సంధికొప్పించును. ఇది మాప్రభువగు హిరణ్యగర్భుని సందేశము” అని విన్న వించిరి.

ఇదేవిధమునఁ జిత్రవర్ణుని కడనుండియు సంధికై రాయ బారము రాఁగా సింహళద్వీపాధిపతి దానికంగీకరించి, చిత్రవర్ణు నిచే సత్కరింపఁబడి తన బలములతో స్వస్థానమున కేఁగెను. ఈ విధముగా సంధిగావించుకొని యందరానందమొందిరి.”

ఈవిధముగాఁ దెలిపి విష్ణుశర్మ “రాజకుమారులారా! ఈనీతిశాస్త్రముఁ బఠించినవారికి సకల విషయములు గరతలా మలకము లగును. అట్లు పఠింపనివారెంతటివారయ్యును గార్య సమయములందుఁ గర్తవ్యతా విమూఢులై యనర్థముం జెందుదురు. ఈవిధముగామీకు ధర్మార్థ కామసాధనములైన యనేకకథలు వినిపించితిని. కావున నిందలి నీతులు మనసునఁ

బదిలపఱచుకొని దృఢచిత్తులై రాజకార్య నిర్వహణాదు లందు నిత్యవిజయముం గాంచి ధర్మపరిపాలనచేఁ బ్రజల కానందముఁ గూర్పఁ బూనుకొనుఁడు" అని బోధించెను.

అదివిని యారాజకుమారు లాగురునకుఁ బ్రణామములు చేసి "మహాత్మా! పరుసవేది యొకించుక తాఁకిన మాత్ర మున సకలలోహములుఁ బరిశుద్ధహేమ మయము లగును. అటులే మీవాగమృత ధారలచే మాహృదయములు మిక్కిలి పరిశుద్ధములైనవి. మాకు సంపూర్ణ నీతివివేకము గలిగినది. యని పలికి యాతనికడ రాజనీతిశాస్త్రంబు లభ్యసించుచుండిరి.

అనంతర మొకనాఁడు సుదర్శనమహారాజు విష్ణుశర్మను రావించి "ఆర్యా! మీవలనఁ గుమారు లత్యంతప్రజ్ఞాధురీణు లైరి. ఇఁకమీఁద నాయుధ విద్యాభ్యాసంబుఁ జేయించెదను. అనుమతి యిండు" అని పలికి, లెక్కలేని గోహిరణ్యాదికము లను విష్ణుశర్మకుఁ గానుకగా నొసఁగి సత్కరించి పంపెను.

సుదర్శనుఁడు బహుకాలము రాజ్యమేలి వానప్రస్థా శ్రమమునకుఁ బోయిన యనంతరము నీతివిదులగు నాతని కుమారు లనవరతము విష్ణుశర్మ బోధనలు స్మరించుకొనుచుఁ జాలకాలము సకల శ్రేయస్కరముగా రాజ్యపరిపాలనముఁ గావించిరి.